శ్రీః

'జాంబవతీశ్రీకృష్ణపుత్ర'
సాంబమహాకవి విరచిత

# సామ్బపఞ్చాశికా

ఆంధ్రవ్యాఖ్య–మయూఖమాలిని


వ్యాఖ్యాత

మేళ్ళచెర్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

విశ్రాంత సంస్కృత అధ్యాపకుడు



ప్రకాశకులు

శ్రీ సదాశివబ్రహ్మేంద్రాశ్రమము

**చిల్లకల్లు,** జగ్గయ్యపేట మండలం, కృష్ణాజిల్లా.

పిన్ : 521 178

శ్రీః

'జాంబవతీశ్రీకృష్ణపుత్ర' సాంబమహాకవి విరచిత

# సామ్బపఞ్చాశికా

**ఆంధ్రవ్యాఖ్య–మయూఖమాలిని**

**వ్యాఖ్యాత– మేళ్ళచెఱ్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రి,**

*విశ్రాంత సంస్కృత అధ్యాపకుడు*

ప్రథమముద్రణ :– శ్రీరామనవమి, వికృతినామసంవత్సరము

ప్రతులు : 500

పేజీలు : 96

వెల : రూ. 60–00



**D.T.P. :-**
**Vikram. P,**
**Nuthalapadu.**
**Cell : 9492080750**

***Printed at :-***
**SURYA OFFSET,**
Station Road,
CHIRALA.
Cell : **9346911249**

వివృతిరచనాం='వివృతి' అను వ్యాఖ్యారచనను, న్యయుంక్త=నియోగించెను, ఇతి=అని, ఏతత్=ఇది, ఏవమ్=ఇలా, ఝటితి=తొందఱపాటుగా, న ఘటితమ్=కూర్పబడలేదు. సద్భిః=సత్పురుషులచేత, దర్శనీయం హి=చూడదగినదే.

**తాత్పర్యము :** క్షేమరాజు అని ఒకానొక శైవుడున్నాడు. అతడు మహామహేశ్వరాచార్యుడయిన అభినవగుప్తునకు పాదపద్మోపజీవి అయిన శిష్యుడు. పరశివునితో సమాధి సామరస్యం మీద బాగా ఆసక్తి గలవాడు. అభినవమయిన/ అభినవగుప్తుని దయవలన వచ్చిన శక్తిపాతదశావేశంతో లేదా స్తోత్రదశావేశంతో వివశుడయినవాడు. అట్టివాడు ఈ మంచిస్తోత్రంలో "వివృతి" అను వ్యాఖ్యానసేవను సమకూర్చాడు. అయితే అందుకని ఇది తొందరపాటుగా చేసినది కాదు. కనుక సత్పురుషులు చక్కగా పరిశీలించవలసినది. ఇది క్షేమరాజు శ్లోకము.

మయూఖమాలిని సమాప్తము.

----

## వినతి

**"ఇది బ్రహ్మణ్యుడు సాంబుని**
**మదినుండి సముద్గతంబు, మాన్యము దీనిన్**
**చదువుడు సుబ్రహ్మణ్యుని**
**'వదనము'తో తమకు వదనభాగ్యము పండన్.**

**కృష్ణసుతుడైన సాంబుడు**
**నిష్ణాతుడు సౌరమందు, నిజమిది దీనిన్**
**విష్ణువు జేయుటకు నలం**
**భూష్ణువునో కాదొ, వ్రాయబూని తి వ్యాఖ్యన్.**

**తెగబడితిని ముదముననా**
**జగద్గురుసుతుని కవిత్వచాతురి దడవన్**
**పొగడెదరో తెగడెదరో**
**నగియెదరో ఎఱుగలేను నమ్రుడ మీకున్".**

ఇట్లు
శ్రీ మేళ్ళచెర్వు వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

## *జాంబవతీ శ్రీకృష్ణ తనయ శ్రీ 'సాంబ' మహాకవి రచితమయిన "సాంబపంచాశిక" అను "చిత్సూర్య" స్తోత్రము*

## ప్రభాతం

*భారతదేశంలో భౌతిక విషయాలమీద జరిగిన పరిశోధనలు మధ్యయుగంలో దురదృష్టవశాత్తు ఏ కారణంచేతనో మధ్యంతరంగా ఆగిపోయినవి. ఆధ్యాత్మికభూమిలో పరిశోధన మాత్రం సాగుతూనే వచ్చింది. దేశం పరాధీనమయినా **"సర్వం దైవాధీనం"** అనుకొనే మనస్సు మారకపోగా మఱింత గట్టిపడింది. ఏది ఎలా పోయినా 'పరం' చెడకుండా ఉండాలన్న కాంక్షకు ఏ ఆంక్ష లేదు మఱి. అందువలన సర్వభౌతికయంత్ర తంత్రాలకు ఇతరదేశాలమీద ఆధారపడిన యీ జాతికి ఆధ్యాత్మికవిషయంలో ఇతర దేశ మతాలమీద ఆధారపడవలసిన అవసరం లేకపోయింది. కావలసినన్ని మతాలు, సిద్ధాంతాలు, ఆచారాలు, విధానాలు, దేవతారూపాలు దేశంలోనే కొల్లగా వెల్లి విరిసినాయి. అందులో అతిప్రాచీనకాలంలోనే ఆగమ నిగమాలు ఆధారంగా ఏర్పడినది **"కాశ్మీరశైవము"**. దీనిలో శాఖలు చాలా ఉన్నవి. త్రికసిద్ధాంతము మొదలైనవి. శాక్తదర్శనముగూడా ఇందులో అంటుతొక్కిన మొక్క అన్న సంగతి సిద్ధాంతసామ్యంవలన గ్రహింపవచ్చును. ఇందులో బాగా పేరు తెచ్చికొన్న మహాపండితోపాసకుడు మహామాహేశ్వరాచార్య **శ్రీమదభినవగుప్తుడు**. వశిష్ఠ మంత్రితమయిన రఘురాజరథం వంటి యీయన మనీష అప్రతిహతంగా సాగని వాఙ్మయరంగం లేదనవచ్చును.*

***శ్రీమాలినీవిజయతంత్రం*** *ఆధారంగా శ్రీ అభినవగుప్తులు "తంత్రాలోకం" అన్న ఉద్గ్రంథాన్ని రచించారు. శైవతంత్రవిషయాలకు కాణాచి అయిన ఆ గ్రంథం "సరళం" కాదని ఆయనే సారాంశంగా "తంత్రసారం" అనే లఘుగ్రంథాన్ని వెలయించారు. ఈ శైవసిద్ధాంత పరంపరలోనివాడే **"క్షేమరాజ"** పండితుడు. ఆయన శ్రీకృష్ణపుత్ర 'సాంబ' రచితమయిన "సాంబపంచాశిక" అనే "చిత్సూర్య" స్తోత్రఖండకావ్యమునకు (అర్ధశతకము) **"వివృతి"** అను పేరుతో, నాతి విపులమయిన సంస్కృత వ్యాఖ్య రచించాడు. అందులో సాంబుని గ్రంథమును అందలి సంకేతితవిషయాలను, శైవసిద్ధాంతప్రతిసీరపై వ్యాఖ్యానించాడు. కాని "సాంబపంచాశిక"లో మాత్రం 'శివ' ప్రస్తావన లేదు. కాని శైవసిద్ధాంత సంబంధమయిన పదజాలం కనబడుతున్నది. బహుశః "సౌరమతం"లో*

*గూడా ఈ రకమయిన ఆలోచనా ప్రస్థానం ఉండిఉండవచ్చును. అందువలన ఈ గ్రంథపీఠికగా "నేను" కాశ్మీరశైవసంప్రదాయమును, అందలి కొన్ని సంకేతాలను పాఠకులకు పరిచయం చేస్తాను. అదే యీ ప్రభాతం.*

*కాశ్మీరశైవంగూడా చాలా విషయాలలో అద్వైతమే. కాకపోతే పరబ్రహ్మమును పరమశివుడంటారు. జీవుడు (మోక్షం వచ్చేదాకా) నిత్యుడంటారు. శివుణ్ణి జగత్తుగా భావిస్తారు. ఇక సంకేతభాష చాలా భిన్నంగా ఉంటుంది. అయినా పర్యవసానం అద్వైత వేదాంతమే. ప్రమాణాలు శివోక్తమయిన ఆగమాలు, వేదాలు. స్థూలంగా ఇదీ దీని పరిస్థితి.*

*జ్ఞానం మోక్షకారణం. అది అజ్ఞాననిరోధకం. అజ్ఞానం బంధకారణం. అది సంసారమూలకారణం. దానిని **"మలం"** అంటారు. బుద్ధిగతమయిన 'అనిశ్చయాత్మక, విపరీతనిశ్చయాత్మక-అజ్ఞానాన్ని పోగొట్టే పురుషగతమయిన వికల్పరూపమయిన అజ్ఞానం నశిస్తుంది. స్వరూపం తెలియకపోవటమే అజ్ఞానం. స్వరూపం అంటే 'జ్ఞానమే'.*

***మోక్షో హి నామ నైవాన్యః స్వరూపప్రథనం హి సః***
***స్వరూపం చాత్మనః సంవిత్॥*** *(తంత్రసార పాదటీకా)*
***"వికల్పసంవిదభ్యాసస్య అవికల్పాంతతాపర్యవసానాత్"*** *– తంత్రసారం.*
*జ్ఞానం అంటే "సమ్యగ్నిశ్చయము". అది శాస్త్రాభ్యాసంవలన వస్తుంది.*
***"శాస్త్రం చ పరమేశ్వరభాషితమేవ ప్రమాణమ్".*** *కనుక శంభునాథప్రోక్తమయిన తంత్రాగమాలు ప్రమాణం అని అభినవగుప్తపాదులు.*

***అజ్ఞానం కిల బంధహేతురుదితః శాస్త్రే మలం తత్ స్మృతం***
***పూర్ణజ్ఞాన కలోదయే తదఖిలం నిర్మూలతాం గచ్ఛతి।***
***ధ్వస్తాశేషమలాత్మ సంవిదుదయే మోక్షశ్చ తేనామునా***
***శాస్త్రేణ ప్రకటీకరోమి నిఖిలం యద్ జ్ఞేయతత్త్వం భవేత్॥*** *–తంత్రసారం.*

*సమస్తపదార్థములు మనకు తెలుస్తున్నాయంటే అర్థం అవి "ప్రకాశం" అయినాయని అర్థం. ప్రకాశంలేనిదే ఏ పదార్థము 'తెలియటం' కుదరదు. తెలియటం అంటేనే ప్రకాశం. ఈ ప్రకాశమే పరమశివస్వరూపము. అదే మనం "చిత్" అంటాము. జ్ఞానం అంటాము.*

***"తత్ర ఇహ స్వభావ ఏవ పరమోపాదేయః స చ సర్వభావానాం ప్రకాశరూప ఏవ- అప్రకాశస్య స్వభావతానుపపత్తేః"*** *– తంత్రసారం. అయితే సర్వభావాల్లో భేదం ఉండినా ప్రకాశంలో భేదం ఉండదు. అది ఏకమే.*

**"తదితర స్వభావానుప్రవేశాయోగే స్వభావభేదాభావాత్"** – తంత్రసారం.

దేశకాల భేదంకూడా దీనికి ఉండదు. ఎందుకంటే

**"తయోరపి తత్ప్రకాశస్వభావత్వాత్"** అన్నారు గుప్తులు.

ఇంతకూ ప్రకాశం ఏమిటి? అంటే,



అయిన కృష్ణుని తత్త్వము వ్యతిరేకంగా సూచించాడు. ఆయన ప్రేయసీమణులు రూపసౌందర్యంవలన ఆకర్షణలో పడినవారు. తన ప్రేయసులు అలాకాదు. ఇలా 'తాను' భగవంతుడైన వాసుదేవపుత్రుడనని సూచన. లేదా వారును ఇట్టి వారేనని సూచన కావచ్చును.

**"వ్యతిరేకలభ్యేనార్థేన భగవద్వాసుదేవసుతత్వమాత్మనః ప్రకటయతి"**

– వ్యాఖ్యాత క్షేమరాజు.

**శ్లో॥ ఇతి పరమరహస్యశ్లోకపఞ్చాశదేషా**
**తపననవనపుణ్యా సాగమబ్రహ్మచర్చా।**
**హరతు దురితమస్మద్వర్ణితాకర్ణితా వో**
**దిశతు చ శుభసిద్ధిం మాతృవద్భక్తిభాజామ్॥ 53**

**ప్రతిపదార్థము :** ఇతి=ఈ విధముగా రచితమయిన, పరమరహస్య=పరమగహనమయిన, శ్లోకపంచాశత్='50' శ్లోకముల సమూహము (స్థిత్వా కించిత్ అను శ్లోకందాకా), తపన= చిద్భాస్కరునియొక్క, నవన=స్తోత్రముచేత, పుణ్యా=పవిత్రమయినది. సాగమ=ఆగమశాస్త్ర విషయసహితమైన, బ్రహ్మచర్చా=పరాద్వైత విమర్శగలది, అస్మద్వర్ణితా=మాచే వర్ణింపబడిన, ఏషా=ఇది, ఆకర్ణితా=మీచే వినబడినదై, వః=మీయొక్క, దురితమ్= పాపమును, హరతు= హరించుగాక! మాతృవత్=తల్లివలె, భక్తిభాజాం=భక్తులయిన మీకు, శుభసిద్ధిం చ= శుభస్థితిని గూడా, దిశతు=ఇచ్చుగాక!

**తాత్పర్యము : 'స్థిత్వా కించిన్మన ఇవ పిబన్'** అనే శ్లోకం వఱకు సాగిన ఈ జ్ఞానభాస్కరస్తోత్రం పరమరహస్యమయిన 'సాంబపంచాశిక' సర్వపాపతాపనుడయిన తపనుని వర్ణన గనుక ఇది పవిత్రమయినది. దీనిలో ఆగమశాస్త్ర సంబంధమయిన బ్రహ్మ విమర్శ ఉన్నది. మేము చేసిన ఈ స్తోత్రం విన్న మీకు పాపహరమై తల్లివలె భక్తులయిన మీకు శుభములు చేకూర్చుగాక!

ఇచ్చటికి సాంబపంచాశిక సమాప్తము

**శ్లో॥ కశ్చిచ్ఛైవః పరశివసమావేశగాఢానురాగో-**
**ద్రేకః స్ఫూర్జన్నభినవదశావేశవైవశ్యశాలీ।**
**సత్స్తోత్రేఽస్మిన్ "వివృతి" రచనాం క్షేమరాజో న్యయుఙ్క్తే-**
**త్యేతన్నైవం ఝటితి ఘటితం దర్శనీయం హి సద్భిః॥ 54**

**ప్రతిపదార్థము :** పరమశివ=పరమాత్మతో, సమావేశ=నిర్వికల్పకసమాధియందు, గాఢ= పాతుకుపోయిన, అనురాగోద్రేకః=ప్రేమోద్రేకంగలవాడును, అభినవ=క్రొత్తదయిన/అభినవ గుప్తుని శక్తిపాత సంబంధమైన, స్తోత్రసంబంధమయిన, దశావేశ=దశావేశమువలన, వైవశ్యశాలీ=వివశుడై, స్ఫూర్జన్=ధ్వనిచేయుచు, కశ్చిత్=ఒకానొక, క్షేమరాజః=క్షేమరాజు అను, శైవః=శైవుడు, అస్మిన్=ఈ, సత్‌స్తోత్రే=బ్రహ్మసంబంధమయిన/మంచిస్తోత్రంలో,

**విశేషములు-వివరములు :**

1) సుప్రతిష్ఠాంచ కార- అని ఒక పాఠం ఉన్నది. అనగా ప్రార్థనను సరిగా ప్రతిష్ఠించెనని అర్థము.

2) యుక్తి-యోగం. పరస్వరూప విశ్రాంతిరూపమయిన యోగము.

**వస్తునోఽన్యేన వస్తునా**- అని ఆగమోక్తం. ఆ ప్రకారము యోగం అనగా జీవుడు బ్రహ్మంతో ఐక్యం చెందటం.

3) ధర్మాధర్మ గ్రసన- అనగా

**ధర్మాధర్మాభ్యాం యద్గ్రసనసమర్థాత్ అబుద్ధస్య జగతః తదేవ రశనా॥** - అనగా ధర్మాధర్మములు వ్యవహారసక్తమయి అజ్ఞానంతో ఉన్న ప్రపంచాన్ని వశపఱచికొన్నవని అర్థము.

**శ్లో॥ భక్తిశ్రద్ధాద్యఖిలతరుణీవల్లభేనేదముక్తం**
**శ్రీసామ్బేన ప్రకటగహనం స్తోత్రమధ్యాత్మగర్భమ్।**
**యస్సావిత్రం పఠతి నియతం స్వాత్మవత్సర్వలోకాన్**
**పశ్యన్ సోఽన్తే వ్రజతి శుకవన్మణ్డలం చణ్డరశ్మేః॥ 52**

**ప్రతిపదార్థము :** భక్తిశ్రద్ధాది=భక్తి, శ్రద్ధ మొదలగు, అఖిల=సమస్తమయిన, తరుణీ=స్త్రీలకు, వల్లభేన=ప్రియుడైన, శ్రీసాంబేన=శ్రీసాంబ కవిచేత, ఉక్తం=చెప్పబడినదియు, ప్రకట= బాహ్యార్థరీత్యా స్పష్టమయినదియు, గహనం=అంతరార్థరీత్యా రహస్యమయినదియు, అధ్యాత్మ గర్భమ్=రహస్యగర్భమయినదియు అగు, ఇదం=ఈ, సావిత్రమ్=సౌరమయిన, స్తోత్రం= స్తోత్రమును, యః=ఎవడు, నియతం=తప్పక, పఠతి=చదువునో, సః=ఆ యోగి, సర్వలోకాన్ =సమస్తలోకాలను, స్వాత్మవత్=ఆత్మభావముతో, పశ్యన్=భావన చేయుచు, అంతే= జీవితాంతమున, శుకవత్=శుకమహర్షివలె, చండరశ్మేః=సూర్యునియొక్క, మండలమ్= మండలమును, వ్రజతి=చేరికొనును.

**తాత్పర్యము :** భక్తి శ్రద్ధ మొ॥ మతిభేదములనే యువతులకు వల్లభుడయిన శ్రీ సాంబకవి రచించిన యీ స్తోత్రం పైకి స్పష్టంగాను, లోపల కష్టంగాను ఉన్న అధ్యాత్మగర్భమయినది. ఈ సావిత్రస్తుతిని నియమంగా ఆత్మానుసంధానంతో చదివినవాడు సమస్త లోకములను ఆత్మసమంగా గమనిస్తూ జీవన్ముక్తుడై జీవితాంతమున మోక్షమును పొందును. శుకమహర్షి వలె సూర్యమండలమున ప్రవేశింపగలడు.

**విశేషములు-వివరములు :**

1) చండరశ్మి=ద్వైతాన్ని దహించే చిద్భానువు అని అర్థము. ఆయన 'మండలం' అంటే సర్వవిశ్వమును మ్రింగి సమరసం అయిన మరీచిచక్రము-అని అర్థం.

2) భక్తి, శ్రద్ధ, తత్త్వార్థచింత, మొదలయిన తరుణీమణులు. అనగా రూపలావణ్యా- తిశయం వలన గాక గుణాతిశయంవలన వాటికి ప్రియుడు. ఇందులో తనతండ్రి



**"ఏక ఏవ ప్రకాశః, స ఏవ చ సంవిత్"** -తంత్రసారం.
ఈ ప్రకాశం ఎవరికీ అధీనం కాదు. సర్వం దాని అధీనం.

**"స చ ప్రకాశో న పరతంత్రః, ప్రకాశ్యతైవ పారతంత్ర్యమ్".**

ప్రకాశం-ఒక్కటే కనుక అది పరతంత్రం కాదు. అన్నీ దానికి పరతంత్ర మయినవే. అందువలన అది స్వతంత్రం. అదే పరమశివతత్త్వము.

న చ ప్రకాశాంతరం కించిదస్తీతి **స్వతంత్ర ఏకః ప్రకాశః**, స్వాతంత్ర్యాదేవ చ దేశకాలాకారావచ్ఛేదవిరహాత్ వ్యాపకో నిత్యః॥ - అన్నారు గుప్తులు.

'ప్రకాశం' అనే పరమశివతత్త్వానికి "స్వాతంత్ర్యశక్తి" ఉన్నది. దానినే ఆనందశక్తి లేదా చమత్కారశక్తి అంటారు. చమత్కారం అనగా "లొట్ట" వేయడం. ఆనందశక్తిని అనుభవించే కోరిక ఇచ్ఛాశక్తి, ప్రకాశరూపత చిచ్ఛక్తి, విమర్శజ్ఞానశక్తి, సర్వాకార సంబంధము క్రియాశక్తి అని పంచశక్తులు ఉన్నవి. కాని ప్రధానంగా ఇచ్ఛాజ్ఞానక్రియా శక్తులను పరిగణిస్తాం. అవి సృష్టి సంబంధమయినవి కనుక వాటి అవసరం ఎక్కువ.

ఈ "శివుడు" స్వతంత్రుడు కనుక స్వాతంత్ర్యశక్తితో తనను తనశక్తిని కాస్త తగ్గించికొని (సంకుచితం) "అణువు" అవుతాడు. అతడే జీవుడు. అయినా "శివుడు"గా మిగిలి ఉంటాడు. ఈ అణువు తన శివతత్త్వమును తెలిసికొనడం ఇందలి లక్ష్యం. దీనిని "సమావేశం" అంటారు. ఇదే అనుపాయంగా శివప్రసాదం, గురుశక్తిపాతం మొ॥ వానితో ప్రహ్లాదునికి లాగా జరుగుతుంది. లేదా కొందఱికి సోపాయంగా జరుగుతుంది. ఉపాయం అయితే 3 రకాలు. ఇచ్ఛ, జ్ఞానం, క్రియ. వీటివలన జరిగే సమావేశాలు (సమాధులు) వరుసగా శాంభవం, శాక్తం, ఆణవం అంటారు.

అనుపాయసమావేశం పొందగలవారికి మంత్రపూజాధ్యానాదుల పని లేదు.

**ఉపాయ జాలం న శివం ప్రకాశయేత్ ఘటేన కిం భాతి సహస్రదీధితిః।**
**వివేచయన్నిత్థముదారదర్శనః స్వయంప్రకాశం శివమావిశేత్ క్షణాత్॥ - తంత్రసారం.**

**'అఖండమండలం'** అనబడే శివతత్త్వంలోకి సోపాయంగా ప్రవేశింపవలసిన వాడు శాంభవోపాయాన్ని, ఇచ్ఛోపాయాన్ని ఆశ్రయించవచ్చు.

ప్రపంచం అంతా బింబప్రతిబింబమాత్రమని, ఈ ప్రతిబింబరూపమయిన విశ్వం పరమేశ్వరప్రకాశంలో భాసిస్తున్నదని (Paper weight లోపల సీసంలో design లాగా) అయితే దీనికి 'మూలబింబం' అంటూ ఏదీ లేదని, పరమేశ్వరుని స్వాతంత్ర్యశక్తివలననే ఇలా అవుతున్నదని, అందుచేతనే భగవంతుడు విశ్వాత్మకుడని, సంవిన్మయమయిన విశ్వమే చైతన్యమునకు వ్యక్తిస్థానమని గ్రహించాలి.

**అంతర్విభాతి సకలం జగదాత్మనీహ యద్వద్విచిత్రరచనా ముకురాంతరాలే**
**బోధః పరం నిజవిమర్శరసానువృత్త్యా విశ్వం పరామృశతి నో ముకురస్తథాతు॥**

- తంత్రసారం.

వచ్చిన వికల్పాన్ని క్రమంగా బుద్ధిబలంతో సంస్కరించటం శాక్తోపాయం. దీనికి సత్తర్క సదాగమాదులు కావాలి. దీనిలో మానసికజపహోమాదులుంటాయి. తద్ద్వారా తానే **శివతత్త్వం** అని గ్రహించడం జరుగుతుంది.

**యో నిశ్చయః పశుజనస్య జడోస్మి కర్మ సంపాశితోస్మి మలినోస్మి పరేరితోస్మి।**
**ఇత్యేతదన్యదృఢనిశ్చయలాభసిద్ధ్యా సద్యః పతిర్భవతి విశ్వవపుశ్చిదాత్మా॥ - తంత్రసారం.**

**ఆణవోపాయం :-** శాక్తజ్ఞానం కూడా చాలక మరొక ఉపాయం కావలసివచ్చినవాడు బుద్ధిప్రాణదేహఘటాది రూపాలను ఉపాయంగా గ్రహించి అణువయి ఆణవజ్ఞానమును పొందును. ఇది క్రియాశక్తి ప్రధానం. ఈ ఉపాసనోపాయాలను గురించి మొత్తం మీద సంగ్రహంగా చెప్పిన శ్లోకం ఇది -

**వికల్పః కస్యాపి స్వయమనుపయన్పూర్ణమయతాం**
**ఉపాయాత్సంస్కారం వ్రజతి స ఉపాయోత్ర బహుధా।**
**ధియి ప్రాణే దేహే తదను బహిరిత్యాణవతయా**
**స నిర్ణీతో నైషాం పరఫలవిధౌ కాపి హి భిదా॥ - మాలినీ విజయతంత్రం**

శాక్తతంత్రాలలోను ఈ విషయాలు కొన్ని సమానంగా ఉంటాయి.

1) పరమేశ్వరుడు 'ప్రకాశం' అయితే ఆయన శక్తిని 'విమర్శ' అంటారు. అంతేకాదు, స్ఫూర్తి, ఉల్లాసం, స్పందం, స్ఫురణ, స్ఫురత్తా, చిత్, చితి,
**విమర్శ ఇతి తాం ప్రాహుః శైవశాస్త్రవిశారదాః** - దేవీభాగవతం 9-10.
**ఇచ్ఛాశక్తిరుమాకుమారీ**- శివసూత్రం 1/13

శైవం ప్రకారం 36 తత్త్వాలు. శాక్తంగూడా అంతే. "షట్త్రింశత్తత్త్వాని విశ్వమ్"

1) శివ 2) శక్తి 3) సదాశివ 4) ఈశ్వర 5) శుద్ధవిద్య 6) మాయ 7) అవిద్య 8) కలా 9) రాగ 10)కాల 11) నియతి 12) పురుష/జీవ 13) ప్రకృతి 14) మనస్సు 15) బుద్ధి 16) అహంకార 17) జ్ఞానేంద్రియాలు '5' 18) వాక్ మొ॥ కర్మేంద్రియాలు '5'-26, 19) రూపం మొ॥ 5 విషయాలు-31, (20) ఆకాశాది పంచభూతాలు-5-36. మొత్తం-36.

వీటిలో భూమినుండి మాయాతత్త్వం వఱకు ఉన్న 21 తత్త్వములను ఆత్మతత్త్వము అని, 'శుద్ధవిద్య, ఈశ్వర, సదాశివతత్త్వములు 3, విద్యాతత్త్వమని, శక్తిశివులను, శివతత్త్వమని అంటారు. వీటి మొత్తం సమష్టి-**"తురీయతత్త్వము"**.

**"తురీయతత్త్వం సమష్టిరేతేషామ్" - సేతుబంధం.**

తురీయతత్త్వము పరమశివతత్త్వం అంటారు. ఇది పూర్ణచిద్రూపం. ఇదే "చితి, సంవిత్. పరాసంవిత్. చైతన్యాత్మ. అనుత్తరుడు, పరతత్త్వము. ఇదే ప్రకాశవిమర్శల అవినాభూతస్థితి. ఈ నిత్యసామరస్యం పరమశివతత్త్వం.

1) **శివతత్త్వం :** సృష్టికి ప్రారంభంలో నిర్వికారమయిన ఈ పరమశివతత్త్వము ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తుల స్పందంవలన "శివ"తత్త్వంగా మారింది. ఇదే లలితాతంత్రంలో "కామేశ్వర"తత్త్వం, వేదాంతంలో సగుణబ్రహ్మం. ఇదే ప్రకాశం-జ్ఞానం.



ప్రాణాపానములను దాటుటకు ఉపాయము నాదము. నాదరూపము అయిన సృష్టి. దీనిచేత బ్రహ్మరంధ్రమార్గము నిరుద్ధమయినది. ఇదే సేతుబంధము. అచ్చటనుండి- అని అర్థము.

10) తాలుస్థానంలో లంబికాస్థానం ఉంటుంది. యోగి తన తురీయస్థితిలో 'లంబికా చతుష్పథం' గుర్తిస్తాడు. తాలువులో 4 ద్వారాలుంటాయి. అందుకు అది చతుష్పథం. 2 మార్గాలద్వారా ప్రాణాపాన ప్రసారాలు జరుగుతాయి. 3వ మార్గం ద్వారా సాధారణ యోగులకు ప్రాణాపానములు సుషుమ్నా నాడిలో లయమయి మూలాధారానికి చేరుతాయి. అచ్చటనుండి షట్చక్రభేదనం చేస్తాయి. మహాయోగులకు 4వ మార్గంద్వారా నేరుగా సమాధి లభిస్తుంది. వారికి మూలాధారాది భేదనం అవసరం రాదు. కాగా 2 మార్గాలు సంసారానికి, 2 మార్గాలు మోక్షానికి సంబంధించినవి అని కొందరు విద్వాంసుల కథనం.

**శ్లో॥ సర్వాత్మత్వం సవితురితి యో వాఙ్మనఃకాయబుద్ధ్యా**
**రాగద్వేషోపశమసమతాయోగమేవారురుక్షుః।**
**ధర్మాధర్మగ్రసనరశనాముక్తయే యుక్తియుక్తాం**
**స శ్రీసామ్బః స్తుతిమితి రవేః స్వప్రశాన్తాం చకార॥ 51**

**ప్రతిపదార్థము :** యః=ఎవడు, సర్వాత్మత్వమ్=విశ్వరూపత్వము, సవితుః =విశ్వకారణుడయిన సూర్యునకు, ఇతి=ఉన్నదని, వాక్=స్తోత్రముతో, మనః =అనుసంధానముతో (మనస్సుతో), కాయ=ప్రణామముతో (శరీరముతో) గూడిన, బుద్ధ్యా=నిశ్చయంతో, రాగద్వేష= రాగద్వేషములయొక్క ఉపశమ=ఉపశాంతివలన వచ్చిన, సమతా=సామరస్యరూపమయిన, యోగమేవ=యోగమునే, ఆరురుక్షుః =అధిష్ఠింపదలచినవాడో, సః=ఆ, శ్రీసాంబః= కృష్ణభగవానుని పుత్రుడయిన శ్రీసాంబుడు, ధర్మాధర్మ=ధర్మాధర్మములచేత జరుగు, గ్రసన=ఆక్రమణ అనే, రశనా=పాశమునుండి, ముక్తయే=మోక్షముకొఱకు, యుక్తి=పరమ స్వరూప విశ్రాంతిరూపమయిన యోగముతో, యుక్తాం=కూడిన, ఇతి=ఈ ప్రకారమయిన, రవేః=సూర్యునియొక్క స్తుతిమ్=స్తోత్రమును, స్వ=తనయందు/ఆత్మయందు, ప్రశాంతాం= విశ్రమించినదానినిగా, చకార=చేసెను.

**తాత్పర్యము :** కృష్ణభగవానుని పుత్రుడయిన శ్రీ సాంబుడు సవితయొక్క సర్వాత్మతను భావించి వాఙ్మనః కాయబుద్ధులతో ఆయననే ఆత్మరూపంగా భావించి రాగద్వేషాదులు నశించగా అబ్బిన సామరస్యయోగమును/ సమతాయోగమును స్వీకరించినవాడై, అట్టి యోగముతో నిండిన యీ స్తోత్రమును, ఆత్మజ్ఞానముకొఱకు, తద్ద్వారా తనను బంధించిన ధర్మాధర్మ, పుణ్యాపాప, కర్తవ్యాకర్తవ్య, పాశములను భేదించుటకొఱకు, తనయందు అనగా ఆత్మరూపమునందు నిమజ్జనము చేసెను. అనగా ఈ స్తోత్రం ద్వారా విశ్వాత్మకుడయిన సవితయే తానని అనుసంధానించి ప్రశాంతుడయ్యెను. మనముగూడా అట్లే కావలయునని సూచన.

3) సేతుబంధం అంటే వంతెన. ఆ వంతెన భ్రూమధ్యం వద్దనే. అదే సుషుమ్న. '2' దారులమధ్య బ్రహ్మయానానికి భగవంతుడు వేసిన వంతెన. దానిమీదుగా ఊర్ధ్వయానం చేయాలి.

4) 'తాలు'-ఇది షట్చక్రాలలోది కాదు. ఒక అవాంతరచక్రముగా కొన్ని గ్రంథాలు చెప్పినాయి. ఇచ్చట 'లంబికాయోగం'తో అనగా నాలుక కొనను కొండనాలుకతో కలపడం ద్వారా-యోగి ఆకలిదప్పులు హరించే అమృతపానం చేస్తాడు. అదే తాలుచక్రం యోగాంతంలో కుండలిని సహస్రారచంద్రుని కాటువేసిన సందర్భమున అమృతస్రావం చేస్తుంది. అపానశక్తితో అంతవఱకు దగ్ధప్రాయమయిన శరీరప్రపంచం అంతా మఱల ఈ అమృతస్రావంతో సచేతనం అవుతుంది-అని యోగసంప్రదాయము.

5) ధ్రువపదము-అంటే ఉత్తరధ్రువం. అది ముక్కువద్ద ఉంటుంది. మన శరీరం అనే భూగోళానికి ముక్కు ఉత్తరధ్రువం. ముడ్డి దక్షిణధ్రువం. 'నాసాగ్రం' అని శాస్త్రం. ఇది మొదలుకావచ్చును. కొనకావచ్చును. ధ్రువానంతరమే ఆకాశంలోనూ విష్ణుస్థానము. ఏ ఋషి అయినా సప్తర్షులవలె ధ్రువదర్శనస్పర్శనలు చేసి మాత్రమే ఊర్ధ్వమయిన విష్ణుపదమును చేరగలడు.

6) పరమాకాశము అంటే బ్రహ్మస్వరూపం. అంతేతప్ప అదొక ఆకాశం కాదు. అచ్చట అగ్నీషోములుండరు. శివశక్తులుండరు. శివశక్తులుంటే అది సృష్టి. అదే 'సత్యలోకము'. శిరస్సు ప్రాంతం. అచ్చట ద్వైతం ప్రారంభం. ఆదిదంపతులు అందుకు దృష్టాంతం. దీనిని దాటితే సగుణబ్రహ్మం శక్తిరూపంలో కనబడుతుంది. ఆ తరువాత ద్వాదశాంతంలో పీఠక చక్రంలో శక్తిస్పందం గూడా లేని పరమాకాశం. అందుకే అచ్చట అగ్నీషోముల ప్రసక్తి లేదు. అట్టి ఆకాశము గమ్యము. అదే అనుత్తరాకాశం. అది ప్రాణాపాన శూన్యం.

7) తాలు-**లంబికాఖ్యరౌద్రగ్రంథిధామవ్యక్తం కృత్వా**-అన్నారు వ్యాఖ్యాత. అది రుద్రగ్రంథి స్థానము. శరీరంలో నాభివఱకు బ్రహ్మగ్రంథి, కంఠంవఱకు విష్ణుగ్రంథి, తరువాత భ్రూమధ్యందాకా రుద్రగ్రంథి. దీని ప్రాంతంలోనిదే 'తాలు' చక్రం.

8) ధ్రువపదం-అంటే **"సమస్తవేద్యావిభాగప్రకాశాత్మబిందుస్థానం"** అన్నాడు వ్యాఖ్యాత. అంటే 'పశ్యంతీ' వాక్కుయొక్క స్థానం కావచ్చును. సమస్త జ్ఞేయములు సామాన్యరూపంతో ప్రకాశించటం-అట్టి బిందువు అనగా ఒక సూక్ష్మస్థానం. అదే సంస్కారరూపమయిన మనస్సు.

9) సేతుబంధం అంటే- **"నిరోధకోర్ధ్వశక్త్యా తటద్వయాంతర్వాహిప్రాణాపానాద్యుత్త-రణోపాయనాదనాదాత్మసృష్టినిరుద్ధసమస్తకరంధ్రమార్గే స్థిత్వా"** - అని వ్యాఖ్యాత క్షేమరాజు ఇచ్చిన వివరణ. అర్థమేమంటే

'2' తీరములుగా ప్రవహించుచున్నవి ప్రాణాపానములు. అవి అంతర్వాహములు. నిరోధకమయినది ఊర్ధ్వశక్తి. ఓంకారక్రమంలో ఒక అవయవం నిరోధిక. ఈ



**"యదయమనుత్తర మూర్తిః నిజేచ్ఛయాఖిలమిదం జగత్స్రష్టుమ్**
**స్పందతే సస్పందః ప్రథమః శివతత్త్వముచ్యతే తజ్జైః"** -షట్త్రింశత్తత్త్వసందోహం

2) ఇక **శక్తితత్త్వం** అంటే -
**"ప్రపంచనాసనారూపాశక్తిరిత్యభిధీయతే" - పరమానందతంత్రం**

శివునియొక్క విశ్వసృష్టిసామర్థ్యమే 'శక్తి'. సగుణశివుడే శక్తితత్త్వమని కొందరు. **త్రికసిద్ధాంతము**లో ఒక వరుస ఉన్నది.

పరమశివుడు, పరమేశ్వరుడు-ఆయన మనస్సులో సృష్టివాంఛ కలిగినంతనే "శివశక్తి" మిధునం ఆవిర్భవించింది. అదే ప్రకాశవిమర్శ ద్వయం. విమర్శం అంటే 'నేను' అనే భావన. అదే స్ఫూర్తి. స్ఫురణ, స్ఫురత్త. ఇది సృష్టికాలములో విశ్వస్వరూపంగానూ, స్థితికాలంలో విశ్వప్రకాశంగానూ, ప్రలయంలో విశ్వలయం గానూ ఉన్నది. ఈ విమర్శశక్తికి చిత్, చైతన్యం, సంవిత్, ప్రమ స్వరమోదిత, పరావాక్, స్వాతంత్ర్యశక్తి, పరమాత్మయందలి 'ముఖ్యైశ్వర్య', కర్తృతా, స్ఫురత్తా, శారా, స్పందము మొ॥ పేర్లు గలవు. ఈ స్వాతంత్ర్యశక్తి ఇచ్ఛాది శక్తుల సముదాయరూపం. ఇచ్ఛకు వికాసం జ్ఞానం. దానికి వికాసం క్రియ.

ప్రమలో 2 అంశాలు. "నేను, ఇది (అహం-ఇదమ్)". అహం-శివుడు. ఇదం-ప్రకృతి, శక్తి, విమర్శ. విమర్శ అద్దంవంటిది. అద్దంలేనిదే ముఖం ప్రత్యక్షం కానట్లు, విమర్శలేనిదే ప్రకాశానుభవం రాదు. కాగా విమర్శవలన ప్రకాశం అనుభవంలోనికి వస్తుంది. ప్రకాశం ఉంటేనే విమర్శ సంభవిస్తుంది. కనుక శక్తిలేనిదే శివునకు ప్రకాశరూప మయిన జ్ఞానం కలగదు. ఒకరాజు తన అందాన్ని అద్దంలో చూచి తెలిసికొన్నట్లు శివుడున్ను స్వాధీనమయిన ఆత్మశక్తివలన తన పరిపూర్ణాహంతా ప్రకాశమయమయిన స్వరూపాన్ని తెలిసికొనగలుగుతాడు. విమర్శ అనగా పరమాత్మయొక్క స్వస్వరూప ప్రతీతి. కనుక విమర్శ పరమశివుని పూర్ణాహంత. మణికి ప్రకాశరూపం ఉన్నా దాని సత్త దానికి తెలియదు. ప్రకాశం అయిన శివుడు తన సత్తను విమర్శిస్తాడు. ఈ విమర్శవలననే శివునకు కర్తృత్వం వచ్చింది. కనుక పూర్ణస్వతంత్రుడు. కనుక శివుడు శక్తిమయుడు. శక్తి శివమయం. "చంద్ర-చంద్రకలల" వంటి అవినాభావస్థితి.

**3) సదాశివతత్త్వము** - తన ఇచ్ఛాశక్తివలన ఏర్పడిన యీ జగత్తును "తాను"గా భావించి అనుగ్రహించు అంతర్ముఖ తత్త్వము.

**స్వేచ్ఛాశక్త్యుద్గీర్ణం జగదాత్మతయా సమాసాద్య।**
**నివసన్ నిఖిలానుగ్రహనిరతః సదాశివోఽభిహితః॥**

- అంటే "శాక్తదర్శనం"లో సారాంశం ఇది. **"అర్థాత్ యో విశ్వేశ్వరోఽహమితి మన్యతే విశ్వేన సహ యస్యాభిన్నభావః స సదాశివః" సదాశివస్య అహంతా పూర్ణాహంతా" మంత్రశాస్త్రంలో దీనినే "నాదశక్తి" అంటారు. ఈశ్వరప్రత్యభిజ్ఞలో దీనినే "సాదాఖ్యం" అంటారు.**

**"సదాఖ్యాయాం భవం సాదాఖ్యం. యతః ప్రభృతి సదితి ప్రఖ్యా"**
-ఈశ్వరప్రత్యభిజ్ఞా 3/1/2.

పూర్ణాహంతలో, 'విషయ విషయి' భేదం ఉండదు. కేవలం అహంవృత్తి మాత్రమే ఉన్న స్థితి. "ఇదం"కు భిన్నంగా ఉండటమే.

4) ఇక **ఈశ్వరతత్త్వము**– "ఇది ప్రపంచము" అన్న భేద వృత్తి ఈశ్వరుడు. ఇది 4వ తత్త్వము.

**"విశ్వం పశ్చాత్ పశ్యన్ ఇదంతయా నిఖిలమీశ్వరో జాతః"**

ఒక పసిపిల్లవాడు 6నెలలకు తన చుట్టూ ఉన్న వ్యక్తులను గుర్తించినట్లున్నది. త్రిమూర్తులీశ్వరతత్త్వంలోని వారే. విశ్వప్రకాశానికి సిద్ధమయిన జ్ఞానానికిది తృతీయదశ. ఇది సదాశివుని బాహ్యారూపము. క్రియాయుక్తము.

**"ఈశ్వరో బహిరున్మేషో నిమేషోంత స్సదాశివః"**

–అంటే సదాశివదశలో పరమేశ్వరునియందు కొద్ది స్పందం కలుగుతుంది. ప్రమాజ్ఞానంయొక్క 'అహం' అనే అంశం 'ఇదం'ను బయటకు ప్రకటించడం. కాని ఈశ్వరదశలో అహం, ఇదం, జగత్ అనేవి స్పష్టం అవుతాయి. కాగా సదాశివదశలో అహంత, ఈశ్వరతత్త్వంలో "ఇదంత" ప్రధానం. అంటే 6 నెలల తర్వాతనుంచి తల్లి మొ॥ బాహ్యప్రపంచాన్ని గుర్తించటం మొదలవుతుంది. మొదటిది సదాశివస్థితి. రెండవది ఈశ్వరస్థితి. అందుకే శిశువులు దైవంతో సమానం. మంత్రశాస్త్రంలో ఈశ్వరతత్త్వం 'బిందువు'. సదాశివతత్త్వం 'నాదం' అని చెప్తారు.

5) ఇక 5వది **శుద్ధవిద్యాతత్త్వము**. సదాశివునిలో "ప్రపంచం నేనే" అన్న స్థితినే 'విద్య' అంటారు. అదే జ్ఞానం కనుక. నిర్మలం అయినది కనుక 'శుద్ధవిద్య'. 'అహంతా+ఇదంతా' కలసిన యీ సదాశివుని మనోవృత్తి "శుద్ధవిద్య" సద్విద్య అని అంటారు.

**"సామానాధికరణ్యం సద్విద్యాహమిదంధయః"** – ఈశ్వర ప్రత్యభిజ్ఞ.

శివతత్త్వం – అహం విమర్శ

సదాశివతత్త్వం – అహమిదం–విమర్శ

ఈశ్వరతత్త్వం – "ఇదం" – విమర్శ॥ ఇదమహం.

6) ఇక 6వది **మాయాతత్త్వము.** సదాశివునిలోని 'అహమిదం' విమర్శ శుద్ధవిద్య అయితే ఈశ్వరునిలోని 'ఇదం జగత్' అనే భేద దర్శనం 'మాయ'. 'ఈ జగత్తు నాకన్న భిన్నమయినది' అన్న తత్త్వం ఈశ్వరవృత్తి. 6 నెలల తరువాత శిశువులో ఏర్పడే "తన–మన–నీ–ఆ" వంటిది. శుద్ధవిద్యవలన అభేదబుద్ధి, మాయవలన 'భేదబుద్ధి' వస్తాయి. దీనివలననే మనందరికి భేదభావనలు వచ్చాయి. ఈ మాయకు '5' పొరలు (కంచుకం) ఉంటాయి. వాటిసహాయంతో ఈశ్వరుడు తనను, తన వైభవాన్ని సంకోచించి జీవుడుగా మారుతాడు. ఇదంతా లీల. స్వాతంత్ర్యశక్తివలన జరిగేది వివశత్వం కాదు, విహ్వలత్వమూ కాదు.

7) **అవిద్య**–ఇది మొదటి మాయా కంచుకం. '7'వ తత్త్వం. ఈశ్వరుని సర్వజ్ఞతను ఇది సంకోచిస్తుంది. అందువలన జీవుడు అల్పజ్ఞుడు. **కొందరు దీనిని 'విద్యాతత్త్వ'**



**శ్లో॥ స్థిత్వా కిఞ్చిన్మన ఇవ పిబన్ సేతుబన్ధస్య మధ్యే**
**ప్రాప్యోపేయం ధ్రువపదమథో వ్యక్తముద్దాల్య తాలు।**
**సత్యాదూర్ధ్వం కిమపి పరమం వ్యోమ సోమాగ్నిశూన్యం**
**గచ్ఛేయం త్వాం సురపితృగతీ చాన్తరా బ్రహ్మభూతః॥ 50**

**ప్రతిపదార్థము :** సురపితృగతీ=దేవపితృయానములయిన ప్రాణపానమార్గముల యొక్క ఇడాపింగళులయొక్క, చ అంతరా=మధ్యన బయలుదేరి, తాలు=తాలు చక్రమును, వ్యక్తమ్=స్పష్టముగా, ఉద్దాల్య=లంబికాయోగంతో భేదించి, అథో=తరువాత, ఉపేయమ్= పొందదగిన, ధ్రువపదమ్=ధ్రువస్థానమను నాసికామూలమును, ప్రాప్య=పొంది, సేతుబంధస్య=పైన చెప్పిన సురపితృమార్గముయొక్క, మధ్యే=మధ్యలో (సుషుమ్నలో), స్థిత్వా=నిలిచి, కించిత్=సంస్కారరూపముగా మిగిలిన, మనః=మనస్సును, పిబన్నివ= త్రాగుచున్నట్లుగా ఉండి, సత్యాత్=విశ్వకారణమయిన సత్తకన్న, ఊర్ధ్వమ్=పైన ఉన్నదియు, కిమపి=అనిర్వచనీయమయినదియు, సోమాగ్నిశూన్యమ్= ప్రాణాపానరహితమయినదియు అగు, పరమంవ్యోమ= చిదాకాశమయిన, త్వామ్=నిన్ను, గచ్ఛేయమ్=పొందెదను.

**తాత్పర్యము :** సృష్టి అగ్నీషోమాత్మకం. సూర్యచంద్రాత్మకం. ప్రకృతి పురుషాత్మకం, ప్రాణాపానాత్మకం. దేవయాన పితృయాన స్వరూపం. ఇడా పింగళానాడీ స్వరూపం. దీనినుంచి బయటపడి దీనికతీతమయిన బ్రహ్మస్థితిని పొందాలంటే సాధకుడు ప్రాణాయామాదులతో శ్వాసను నియంత్రించి ప్రాణాపానములను వశపఱచుకొని వాటిమధ్యగా సమశ్వాసరూపమయిన సుషుమ్నలో చేరి చక్రభేదనముచేసి చివఱ భ్రూమధ్యంలోని ఆజ్ఞాచక్రం కన్న ముందున్న తాలుచక్రమును లంబికా (కొండనాలుక) యోగంతో భేదించి అమృతస్రావంలో శరీరమును ఆహ్లాదపఱచి శక్తి పుంజుకొని అచ్చటనుంచి ఉత్తరధ్రువస్థానమయిన నాసామూలమును చేరి అచ్చట '2' మార్గముల కూడలి అయిన భ్రూమధ్యం అనబడు సేతుమధ్యమున నిలిచి అచ్చట ఇంకా మిగిలి ఉన్న మనస్సంస్కారమును గూడా గ్రసించి, ఇంకా ఊర్ధ్వముఖుడై సర్వసంకల్ప వికల్ప, ప్రాణ–అపాన–శూన్యమయిన అనగా అగ్నీషోమశూన్యమయిన తురీయ స్థానమయిన నిన్ను చేరెదను గాక!

**విశేషములు–వివరములు :**

1) భ్రూమధ్యంవద్దనుంచి సుషుమ్నానాడి బ్రహ్మరంధ్రందాకా వెళ్తుంది. ఇడా పింగళలు అచ్చటనుంచి చెవులవైపు సాగుతాయి.

**"శతం చైకా చ హృదయస్య నాడ్యః। తాసాం మూర్ధానమధినిఃసృతైకా॥**

2) భూమధ్యం మనస్సుయొక్క స్థానం. అచ్చట మనస్సు అణుపరిమాణంతో చంద్రకాంతితో ఉంటుందని యోగశాస్త్రం. యోగి దానిని గూడా నశింపజేసి అమనస్కుడై ముందుకు కదలాలి.

శుక్లమార్గం ప్రాణం, అర్చిరాది మార్గం మొ॥ పేర్లతో ఉన్నది. పితృయానం అంటే సంసారమార్గం. ఇది ఇడానాడీమార్గం, అపానం, కృష్ణమార్గం 'ధూమయానం' మొ॥ పేర్లు. పైది ఉత్తరమార్గం, క్రిందది దక్షిణమార్గం. దక్షిణమార్గము వర్షాదులతో మొదలయితే ఉత్తరమార్గము శిశిరంతో మొదలవుతుంది. అంటే హేమంత, శిశిర, వసంత, గ్రీష్మ, వర్షా, శరత్తులు. వీటిలో శిశిరవసంత గ్రీష్మములు అనగా మాఘోత్తరాషాఢం దాకా ఉత్తరాయణం. ఇలా చూడాలి. వీటి మధ్యలో ఉన్నది మధ్యకాలము. బ్రహ్మనాడి బ్రహ్మయానము. వీటికి అతీతమయినది. పూర్తిగా '2' అయనాలు వ్యాపించినది కనుక విషువత్. శరీరంలో క్రిందిభాగము దక్షిణాయనము. పై భాగం ఉత్తరాయణము. ఇది జ్ఞానం. వెలుగు. దక్షిణం నుంచి ఉత్తరందాకా వ్యాపించునది 'విషువం'. కాలంలో ఇది సమానాహోరాత్ర కాలము. యోగంలో ఇడా పింగళల మధ్య శ్వాస సమానంగా నడిచే సుషుమ్న. ఇది అభిజిత్–'27' నక్షత్రములకన్న 12 రాశులకన్న భిన్నమయిన కాలము. శరీరంలో సర్వేంద్రియాలను జయించే బ్రహ్మాభిముఖమయిన మార్గము. శరీరమధ్యంలో ఉండేది కనుక 'మధ్యమ' నాడి.

'నీలతోయద**మధ్యస్థా**..... తస్యాశ్శిఖాయా **మధ్యే**
విశ్వస్యాయతనం మహత్.... తస్య **మధ్యే** వహ్ని శిఖా.

ఇడా పింగళలు కర్మయానాలు. సుషుమ్న బ్రహ్మయానం. కనుక క్రియాశూన్యం. వాంఛాశూన్యం. స్వప్రకాశానందఘనమయిన బ్రహ్మమునందు సర్వవికల్ప నివృత్తిపూర్వకముగా సుషుప్తిలోవలె జీవుని విశ్రమింపజేయునది.

3) దేవప్రీతికరం కనుక దేవయానం.

4) హృదయమునుండి 'ద్వాదశాంతం' వఱకు శిశిరవసంతగ్రీష్మరూపమయిన ఉత్తరాయణము. ద్వాదశాంతం అంటే 'పిలక' ఉండే చోటు. అది బ్రహ్మస్థానం. దానిని పీఠకచక్రం అంటారు. సహస్రారం కన్న వెనుకటిది. "ప్రాణవృత్తి" దీనిని ప్రసాదించును.

5) అపానవృత్తి ద్వాదశాంతమునుండి హృదయందాకా ప్రవేశించునది. ఇది వర్ష, శరత్, హేమంతరూపమయినది. ఇది దక్షిణాయనం. భోగప్రదం. కనుక పితృయానం. పితృదేవతాప్రీతిహేతువు. అనగా సంతాన, వంశవృద్ధిరూప సంసారమార్గము. ఇది అజ్ఞానావృతం కనుక 'కృష్ణం'. ధామం.

6) ఈ '2'కి భిన్నమయినది 'ఉన్మనా, ఉన్మనీ' అనబడే సుషుమ్నా మార్గము. దీనిలో మనస్సు శరీరాతీతంగా ఊర్ధ్వముఖం అవుతుంది. ఇది జీవన్ముక్తి ప్రదము.

7) హృదయమునుండి 36 అంగుళముల యీ మార్గములో హృదయమునుండి '6' అంగుళములలో మకరాది రాశులుదయించునని స్వచ్ఛందతంత్రము.

**షట్త్రింశదంగుళేఽంగులషట్కే హృదఃప్రభృతి మకరాదిరాశ్యూదయ ఇత్యర్థః॥**
శ్రీ స్వచ్ఛందాది శాస్త్రేష్వస్తి॥ – వ్యాఖ్యాత – క్షేమరాజు.



**మని, '5'వ తత్త్వాన్ని శుద్ధవిద్యాతత్త్వమని** అంటారు. సిద్ధాంతమేమంటే 'శివుని' శక్తుల సంకోచరూపమే 'జీవుడు'. శివుని శుద్ధవిద్య సంకోచం పొందితే అశుద్ధత అవుతుంది. కనుక విద్య లేదా అవిద్య కనుక ఇది జీవవృత్తి. ఈశ్వరుని సర్వజ్ఞత్వం జీవునిలో అల్పజ్ఞత్వంగా వచ్చింది.

8) **కలాతత్త్వం–**ఈశ్వరుని సర్వకర్తృత్వం జీవునిలో అల్పకర్తృత్వం అయింది. అదే 8వ తత్త్వం 'కలా' తత్త్వం.

**తత్సర్వకర్తృతా సా సంకుచితా కతిపయార్థపరా।**
**కించిత్కర్తారమమం కలయంతీ కీర్త్యతే కలానామ॥** – షట్త్రింశత్తత్త్వసందోహం

9) **రాగతత్త్వం–** ఈశ్వరనిష్ఠమయిన 'నిత్యతృప్తి' పూర్ణతృప్తి–జీవునియందు విషయపరమయిన 'రాగం'గా దిగివచ్చింది. అసంతృప్తి, అర్థతృప్తి అందువలననే కొన్నింటిమీద 'రాగం'గా అయింది.

10) **కాలతత్త్వం–**ఈశ్వరునియందలి కాలాతీతమయిన 'నిత్యత' మృత్యుంజయత్వము. జీవునిలో షడ్భావ వికారాలతో గూడిన 'కాలతత్త్వం'గా అవతరించింది.

11) **నియతి** – ఈశ్వరునిలోని "సర్వస్వాతంత్ర్యం" జీవునిలో అవిద్యాశక్తి వలన సంకుచితమయి "నియతి" అనగా "పరిమితి"గా మారింది.

***యస్య స్వతంత్రతాఖ్యా శక్తిస్సంకోచశాలినీ సైవ***
***కృత్యాకృత్యేష్వవశం నియతమమం నియమయంత్య భూన్నియతిః॥***
**–షట్త్రింశత్తత్త్వసందోహం.**

12) **జీవతత్త్వం** – విద్యనుండి నియతివఱకు గల '5' తత్త్వాలకు ఆధారమయినదే 'జీవతత్త్వము'. దీనినే 'పురుష' తత్త్వం అంటారు.

13) **ప్రకృతితత్త్వం** – 'త్రిగుణసామ్యం' అయినది ప్రకృతి. దీనికి 'చిత్తం' అని కొందఱు.

14) **మనస్తత్త్వం** – ఇది సర్వసంకల్పహేతువు. రజోగుణప్రధానమయిన అంతఃకరణం.

15) **బుద్ధితత్త్వం** – సత్త్వప్రధానమయిన అంతఃకరణం బుద్ధి. నిశ్చయహేతువు.

16) **అహంకారతత్త్వం** – తమఃప్రధానమయిన అంతఃకరణం ఇది. వికల్పకారణము. భేదజ్ఞానకారణము. ఇక మిగిలిన తత్త్వాలు 5. జ్ఞానేంద్రియాలు–5, తన్మాత్రలు–5, భూతాలు–5 స్పష్టమయినవే.

ఈ 36 తత్త్వాలకు అతీతమయిన పదార్థము ఒకటి ఉన్నది. అది విశ్వాత్మకం, విశ్వాతీతం. విశ్వోత్తీర్ణుడు అంటారు. **"విశ్వునవిశ్వున్ – పోతన.**

***సభూమిం విశ్వతోవృత్వా అత్యతిష్ఠత్ దశాంగులమ్***
***పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి॥*** – పురుషసూక్తం.

విశ్వం అంటే సదాశివునినుంచి '34' తత్త్వాలు. సృష్టి అన్నా అంతే. ఈ విశ్వోన్మేషానికి "శక్తి"తత్త్వం కారణం. అదే బీజం. దీని ఆలంబనం శివుడు.

**"శక్తేరంతర్ముఖత్వే శివః శివస్య బహిర్ముఖత్వే శక్తిః॥** - అన్నది సారాంశం. శివతత్త్వంలో శక్తి గౌణం. శక్తితత్త్వంలో శివుడు గౌణం. 'శివశక్తి' సామరస్యం లేదా సామ్యావస్థలో '2'కు ప్రాధాన్యం లేదు. అదే తత్త్వాతీతావస్థ. దీనిని 'పరమశివత్వం' అంటారు. శాక్తేయులు "పరమశక్తి" అంటారు. ఇదే పూర్ణాహంత. పూర్ణశృంగారం. ఇదే ముక్తి. ఇది 5 రకాలు.

1) **సాలోక్యం** - శివశక్తులతో ఒకే లోకంలో ఉండటం.
2) **సార్ష్టి** - వారితో సమమయిన ఐశ్వర్యం.
3) **సామీప్యం** - వారి సన్నిధి.
4) **సారూప్యం** - వారితో సమానరూపం.
5) **సాయుజ్యం** - వారితో అభేదం.

ఈ స్పందవాదము దృష్టిలో పెట్టుకొని నేను వ్రాసిన **"బిందుమాలినీస్తవము, స్పందలహరీస్తవము"** చూడదగినవి. ఈ సిద్ధాంతములను అనువదించి శాక్తముగా నేను వ్రాసిన 2 పద్యాలను ఇచ్చట ప్రస్తావిస్తాను.

నీ అంకురప్రాప్తి నిఖిలజీవోత్పత్తి కాదిస్వరూపమై అవతరింప
నీ ద్విపత్రస్థితి నిఖిలదాంపత్యాల కొజ్జయై వాగర్థముద్ధరింప
నీ కలంబస్ఫూర్తి నిఖిలానురాగమూలాధారమై ఆశలల్లి కొనగ,
నీ పల్లవ ప్రాప్తి నిఖిలభూతములుగా పదునాల్గులోకాల పరిధవిల్ల
నీవె అల్లికొనిన నీ కాయమానమే సర్వకాయమానసంజ్ఞలీయ
విశ్వగురువు నగుచు విస్తరించిన నీవె మాకు నమృత మిచ్చి "మాత" కమ్ము.

**(2)**

నీ నాదరూపమే నిఖిల వాగ్వైఖరీ వ్యక్తి కాశ్రయమయ్యె బ్రహ్మమయ్యె
నీ చంద్రరేఖయే నిఖిలశీర్షస్థిత జ్ఞానరేఖకు మూలకందమయ్యె
నీ తొలిస్పందమే నిఖిల జగత్సృష్టి కంకురార్పణమయ్యె అంబయయ్యె
నీ కంటనుదయించు నాకేకరచ్ఛాయ త్రిభువనమ్ములమ్రోల దివ్వెలయ్యె
హరుని "శివు" చేయు నీ దరహాససుషమ
కామసంజీవనౌషధిగాగ వెలిగె
నీదు 'బృహతిక' నికడీసి ఆదరింప
అమృతమును పొందువాడు "బృహత్తు" కాడె.

**-భావనాబృందావనం** (మద్విరచితముక్తకం)

**అద్వైతం-శైవం :**

ఇదంతా శంకరాచార్యులవారి అద్వైతవాదానికి సమీపమయినదే. దీనిని ఈశ్వరునితో అద్వైతం అంటారు.



1) **'స్తోత్రాణి సర్వాగిరః'** అన్నట్లు ఈ శ్లోకభావం ఉన్నది.

2) అపరిచ్ఛిన్నుడయిన భగవంతుని పట్టికొని 'ఇది అది' అని ఏవో పరిమిత గుణాలున్నట్లు స్తుతించడం అయుక్తం కనుక 'యదపి తదపి' అన్నాడు.

3) ఈ విశ్వం వాచ్యవాచక స్వరూపమయినది. భగవంతుడు విశ్వాత్ముడు. కనుక ఏ వాచ్యం అయినా ఏ వాచకమయినా ఆయనకే చెందును. కనుక స్తోత్రమంతా భగవంతుని రూపంగా స్ఫురించడం దాని ధన్యత.

**శ్లో॥ యా పన్థానం దిశతి శిశిరాద్యుత్తరం దేవయానం**
**యా వా కృష్ణం పితృపథమథో దక్షిణం ప్రావృడాద్యమ్।**
**తాభ్యామన్యా విషువదభిజిన్మధ్యమా కృత్యశూన్యా**
**ధన్యా కాచిత్ప్రకృతిపురుషావన్తరా మేఽస్తు వృత్తిః॥ 49**

**ప్రతిపదార్థము :** యా=ఏ ఉన్మనావృత్తి, ఏ ధ్రువమధ్యభాగము (సుషుమ్నానాడీగతమైనది), శిశిరాది=శిశిరఋతువు మొదలుగా, దేవయానం=దేవయానమనబడు, ఉత్తరమ్=ఉత్తరదిక్కుదయిన, పంథానమ్=మార్గమును, దిశతి=ఇచ్చునో, యావా=ఏది, ప్రావృడాద్యమ్ =వర్షం అనుపేరుగలదియు, దక్షిణమ్=దక్షిణపుదియు, పితృపథమ్=పితృయానమను పేరుగలది అగు, కృష్ణమ్=కృష్ణమయిన (నల్లని), పంథానమ్=మార్గమును, దిశతి=ఇచ్చునో, తాభ్యామ్= ఆ '2' మార్గముల కన్నా, అన్యా=భిన్నమయినదియు, విషువత్=వ్యాప్తి గలదియు (సమానవ్యాప్తి), అభిజిత్=ద్వైతమును జయించునదియు, మధ్యమా=మధ్యభాగము లోనిదియు, కృత్యశూన్యా=క్రియాశూన్యమయినదియు, ప్రకృతి పురుషౌ అంతరా=ప్రకృతి పురుషులమధ్య/ ఇడా పింగళా నాడులమధ్య నడుచు, కాచిత్=ఒకానొక, వృత్తిః=వృత్తి/ స్థితి, మే=నాకు, అస్తు=అగుగాక!

**తాత్పర్యము :** ఒక వృత్తి ఉన్నది. అది సర్వవ్యాపిని. సర్వజేత్రి. క్రియాశూన్యమయినది. అదే శిశిరఋతువు మొ॥గా గల దేవయానమయిన ఉత్తరమార్గాన్ని కల్పించింది. అదే వర్షాదిగా, కృష్ణము అయిన పితృయానాన్ని కల్పించింది. ఈ '2' మార్గముల కన్న భిన్నమయిన బ్రహ్మయానమిది. కనుకనే క్రియాశూన్యం. ఇది ప్రకృతికి పురుషునికి మధ్య ఉన్నది. వీరికతీతంగా జీవుని బ్రహ్మమునందు సమావేశము చేయు వృత్తి ఇది. ఈ ధన్యమయిన 'వృత్తి' నాకు స్థిరముగా నిలుచుగాక!

**విశేషములు-వివరములు :**

1) **హేమంతాద్యాశ్చ ఋతవః షట్చక్రే క్రమశః స్థితాః** - చక్రకౌముది.
అని మూలాధారంలో హేమంతఋతువు మొ॥ '6' చక్రాలకు 6 ఋతువులు అని యోగశాస్త్రము.

2) దేవయానం అంటే స్వర్గాదికమునకు దారి. అది పింగళానాడీమార్గం. అది

తస్మాత్=కనుక, మమ= నాకు, అదౌ=ముందుగా, తేభ్యః=వాటికొఱకు, ప్రసాదమ్= అనుగ్రహమును/నిర్మలత్వమును, దేహి=ఇమ్ము.

**తాత్పర్యము :** దేవా! నేను నీ సేవను ఇష్టపడుతున్నానని తెలిసి నా ఇంద్రియాలు -పాపం నాకు సహకరించినాయి. వాటికి సహజమయిన అల్లరిని విడిచిపెట్టినాయి. అంతేగాక తమతమ ఇష్టవిషయాలను, ఉదా॥ దృశ్యాలను, శ్రవ్యాలను, భోజ్యాలను విడిచిపెట్టి నాతో కలిసి నీ సేవ ఒక్కటే తమపనిగా పెట్టికొన్నాయి. కనుక నాకింత సహకారం, ఉపకారం చేసిన నా ఇంద్రియాలకు నాకన్నా ముందు నీ ప్రసాదమును కలిగించుము.

**విశేషములు-వివరములు :**

1) కవి వ్యంగ్యముగా తనకు ముందు ఇంద్రియ నైర్మల్యమును కల్గించుమని చెప్పుచున్నాడు. అందుకు సమర్ధనగా పై శ్లోకార్థములో కారణము చెప్పుచున్నాడు కనుక కావ్యలింగాలంకారము.

2) ఇచ్చట ఇంద్రియములకు కవికి మధ్య అన్యోన్యం ఉపకారభావన ఉన్నది కనుక అన్యోన్యాలంకారము వ్యంగ్యము.

**శ్లో॥ కిం తన్నామోచ్చరతి వచనం యస్య నోచ్చారకస్త్వం**
**కిం తద్వాచ్యం సకలవచసాం విశ్వమూర్తే న యత్త్వమ్।**
**తస్మాదుక్తం యదపి తదపి త్వన్నుతౌ భక్తియోగా-**
**దస్మాభిస్తద్భవతు భగవన్! త్వత్ప్రసాదేన ధన్యమ్॥ 48**

**ప్రతిపదార్థము :** విశ్వమూర్తే=విశ్వరూపా!, యస్య=ఏ పదంయొక్క, ఉచ్చారకః =ఉచ్చరింపజేయువాడు, త్వమ్=నీవు, న=కావో, తత్=ఆ, వచనమ్=మాట, కిం నామ=దేనిని, ఉచ్చరతి=ఉచ్చరిస్తున్నది? సకలవచసామ్=సమస్తవచనములకు, వాచ్యమ్=చెప్పదగినది, యత్=ఏదో అది, త్వమ్=నీవు, న=కాదో, తత్=ఆ, వాచ్యం= వాచ్యార్థము, కిమ్=ఏది, తస్మాత్=కనుక, అస్మాభిః=మాచేత, త్వన్నుతౌ=నీ స్తోత్రమునందు, భక్తియోగాత్=భక్తియోగం వలన, యదపితదపి=ఏదేదో, ఉక్తం=చెప్పబడినది. భగవన్= భగవంతుడా? తత్=అది, త్వత్ప్రసాదేన=నీ అనుగ్రహంతో, ధన్యమ్=కృతార్థమైనది, భవతు=అగుగాక!

**తాత్పర్యము :** భగవన్! విశ్వాత్మన్! నీవు ఉచ్చరింపజేయని వచనమేమున్నది. నీవు వాచ్యార్థముగాని అర్థము ఏమున్నది? సకల పదమూలము నీవు. పదప్రవర్తకుడవు నీవు. పద ప్రమేయమయిన విశ్వపదార్థజాలమంతయు నీవు. కనుకనే నీవు విశ్వరూపుడవు. అందువలన భక్తితో నీ గురించి స్తుతిగా ఏదేదో చెప్పాము. ఏదయినా నిన్ను చేరేటట్లు ధన్యులం అయ్యేటట్లు చేయవలసినది.

**విశేషములు-వివరములు :**



అద్వైతంలో బ్రహ్మమునకు కర్తృత్వం లేదు. శైవంలో స్వాతంత్ర్యశక్తివలన శివునకు కర్తృత్వం ఉంది. ఆయన సృష్టి, స్థితి, సంహారానుగ్రహమయ రూప పంచకృత్యకర్త.

అద్వైతంలో మాయాప్రకృతికి కారణం లేదు. ఇందులో స్వాతంత్ర్యశక్తి -కారణం, లీల-ఫలం. అవిద్య, శుద్ధవిద్య-ఇవన్నీ స్వాతంత్ర్యశక్తి విజృంభణ. పరమేశ్వరునిలో జగత్తు ప్రతిబింబించిందని ఆయన స్వాతంత్ర్యశక్తివలన అది అలా ఆభాసిస్తున్నదని వీరి మతం. ఇది **ఆభాసవాదం** లేదా **అవభాసనవాదం.**

"విశ్వందర్పణదృశ్యమాననగరీతుల్యం" అన్నదే విషయం. బింబం లేకపోయినా ప్రతిబింబం రావటానికి కారణం "స్వాతంత్ర్యశక్తి" అని త్రికదర్శనం. ప్రతిబింబంగా ఆభాసిస్తున్నాడట. అందువలన ఇది ఆభాసవాదం అని, ప్రతిబింబవాదం అని 2 పేర్లు. మన భ్రమవలన అలా ఆభాసించడం అద్వైతంలోని ఆభాసం. పరమేశ్వరశక్తివలన ఆభాసించడం త్రికదర్శనం.

**"ఆభాసరూపా ఏవ హి జడచేతనపదార్థాః"** - ప్రత్యభిజ్ఞావిమర్శనీ 3/2/1.

బ్రహ్మమే జీవజగద్రూపంగా ఆభాసిస్తుంది. శంకరాద్వైతంలో ఇదంతా మాయ. జగత్ జడం. మిధ్య. త్రికదర్శనంలో బ్రహ్మంయొక్క చితిశక్తియొక్క ఉల్లాసం ప్రపంచం. అందువలన వీరిమతంలో జగత్తు మిధ్యకాదు. అది విమర్శయే. విమర్శ శివరూపమే. అది శివాత్ అభిన్నం, ప్రపంచం శివాభిన్నం. అందుకు కారణం, ఇచ్ఛావస్థలో మనం కోరిన పదార్థాలు మనకన్నా భిన్నంగా ఉండవు. అలానే శివుడు తన పూర్ణ "అహంత" లోపల "ఇదం" అని విశ్వమును అభిన్నంగా స్మరించును.

సారాంశం ఏమంటే ప్రకాశ విమర్శాత్మకమయిన సంవిత్తు స్వభావంగా గల పరమశివుడు స్వాతంత్ర్యశక్తితో సంకోచం పొంది **"జగదాభాసం"** చేస్తాడు. తనే అలా ఆభాసిస్తాడు. సర్వాభిన్నుడయినను ప్రమాతృప్రమేయరూపంతో తనను తానే అవభాసనం చేస్తాడు. ఏమయినా అద్వైతాత్ దీనిలో చెప్పుకోదగిన తేడా లేదు. "అద్వైతమాయ" లోనే వీరి స్వాతంత్ర్యశక్తి మొ॥వి కూడి ఉంటాయి. ఆభాసకర్తృత్వం పరమశివస్థాయిలో గాని, పరబ్రహ్మస్థాయిలోగాని అగమ్యగోచరమే. ఆభాసస్థాయిలో జగత్తు అనిత్యం కాదంటే ముక్తి అసంభవం. అపుడున్ను జీవునకు నిత్యత్వం ఉంటే సాయుజ్యానికి అర్థం లేదు. "చిల్లికాదు తూటు" అన్నట్లు పదాలు, క్రమం తేడా తప్ప ఇది అద్వైతమే. కాకపోతే బ్రహ్మాద్వైతం కాదు. శివాద్వైతము. దీనికి స్వాతంత్ర్యవాదం, ఆభాస, అవభాసవాదం, ప్రతిబింబవాదం అని పేర్లు. ఈ కాశ్మీరశివాద్వైత సంబంధమయిన కొన్ని సిద్ధాంతాలు, సంకేతాలు సంగ్రహంగా సాంబపంచాశికా పాఠక సౌకర్యం కొఱకు ఇచ్చట ఇస్తున్నాను.

1) **పరమశివుడు-** స్వాతంత్ర్యశక్తి-అవభాసనం. ఇది అవరోహణలీల. సృష్టిక్రమం దీనికెదురుగా సాధకుని నడక లయక్రమం ఆరోహణలీల. ఇచ్ఛాశక్తి ప్రసారమే 36 తత్త్వాల ప్రపంచము. శక్తి స్ఫారం అంటారు.

2) **శుద్ధ అధ్వ** –

"శివశక్తి అభేదభూమిక-భేదాభేద భూమిక" –అనగా ఈశ్వరతత్త్వం దాకా.

3) **అశుద్ధ అధ్వ** – భేదభూమిక. ఇది జీవుడు, జగత్తు. ఇది జగల్లీల. అవరోహణలీల. దీనిలో బంధం ఉత్తరోత్తర వృద్ధి పొందుతుంది. ఈ దశలోనివాడే జీవుడు, పురుషుడు, మనువు. ఈ జీవుడు ప్రత్యభిజ్ఞ (సోహం/ శివోహం) దాకా ప్రయాణించాడు– ఆరోహణం. ముక్తి సోపానపరంపర అనగా భేదభూమిక అయిన జీవదశ నుండి భేదాభేదభూమికను దాటి అభేదభూమికలోకి ప్రవేశించడం. అశుద్ధాధ్వనుంచి శుద్ధాధ్వవైపు ప్రయాణం.

4) ముక్తి నిరుపాయం. సోపాయం. ఉపాయసాధన వలన నిరుపాయస్థితి వస్తుంది. గురువచనం అనుగ్రహం, శక్తిపాతం–వీటిద్వారా ఆత్మప్రత్యభిజ్ఞ కలుగుతుంది. అదే జీవన్ముక్తి. త్రిపురదహనం తర్వాత త్రిపురాతీతస్థితి అనవచ్చును.

5) జీవన్ముక్తుల కర్తవ్యం లోకానుగ్రహమే. వీరి ఆనందం స్వరూపజ్ఞానమే. ఇక వారికి కోరదగినది లేదు. అందువలననే సాంబుడు తన పంచాశికలో **"సత్యం భూయోజనన మరణే...."** అను 34వ శ్లోకంలో తనకు జగదుద్ధరణావకాశం ఇమ్మంటాడు.

6) దీనికి త్రికదర్శనం, ప్రత్యభిజ్ఞావాదం, శివాద్వైతం, త్ర్యంబకశాస్త్రం మొ॥ పేర్లు. త్రికం అనటానికి కారణం ఏమంటే ఎ) సిద్ధాతంత్రం, వామకతంత్రం, మాలినీతంత్రం– అనే 'త్రికం' ఈ శివదర్శనానికి ప్రధానతంత్రాలు. బి) అభేద, భేదాభేద, భేద–అనే త్రికం. సి) పర–అపర–పరాపర–అనే త్రికం అన్న వాటిమీద ఆధారపడినది కనుక త్రికదర్శనం అని పేరు.

**నోట్ :–** పర=శివశక్తి సంఘట్టం.
అపర=శివ, శక్తి, నర దశలు.
పరాపర='2' మధ్యస్థితి.

ఈ త్రికదర్శనానికి షడర్థశాస్త్రం, షడర్థక్రమ విజ్ఞానం అని మతో "2" పేర్లు. ప్రకాశం నుండి విమర్శ స్పందించిన క్రమాన్ని సంస్కృతవర్ణమాలతో సంకేతించారు. అవి "6" అక్షరాలు కనుక 'షడర్థశాస్త్రం' అయినది.

అ–అనుత్తరుడయిన పరమేశ్వరుని తత్త్వం. "చిత్" ఈ గ్రంథంలో చిత్సూర్యుడు.
ఆ–ఆనందశక్తి–స్వాతంత్ర్యశక్తి.
ఇ–ఇచ్ఛాశక్తి.
ఈ–ఈశనాశక్తి.
ఉ–ఉన్మేషం–జ్ఞానం.
ఊ–ఊర్మిశక్తి. స్పందశక్తి.
దీనిని స్పందశాస్త్రం అనటానికిన్ని ఇదే కారణం.

7) అంతా శివునినుంచి వచ్చినదే. అందుచేత మిథ్యకాదు. ప్రకాశవిమర్శలు శివతత్త్వము, అవినాభూతస్థితములు. ప్రపంచం విమర్శ విస్తారం. అందుచేత అది మిథ్యకాదు.



**భుక్తేర్ముక్తేరపి చ జగతాం యచ్చ పూర్ణం సుఖానాం**
**తస్యాన్యోర్కాదమృతవపుషః కో హి నామాస్తు దాతా॥ 46**

**ప్రతిపదార్థము :** భగవాన్=సూర్యభగవానుడు, సేవితః=సేవింపబడినవాడై, ఆరోగ్యమ్= ఆరోగ్యమును, దిశతి=ఇచ్చును, ఏవమ్=అని, యేపి=ఎవరయినా, ఆహుః =పలుకుచున్నారో, తే=వారు, జగతి=ప్రపంచమున, తత్త్వజ్ఞాః=తత్త్వవేత్తలు, సుభగాః =భగవంతులు, భోగయోగ=భోగము, యోగము, ప్రధానాః=ముఖ్యముగా గలవారు, జగతామ్=లోకముల యొక్క, భుక్తేః=భుక్తికి, ముక్తేః=ముక్తికి, సుఖానామ్=సుఖములకు, పూర్ణమ్=నిండినది, యచ్చ= ఏది ఉన్నదో, తస్య=ఆ, అమృతవపుషః=అమృతమయ శరీరముయొక్క, దాతా=ఇచ్చువాడు, అమృతవపుషః=అమృతశరీరుడయిన, అర్కాత్=సూర్యునికన్న, అన్యః=ఇతరుడు, కో హి నామ =ఎవడుగాని, అస్తు=ఉండును?.

**తాత్పర్యము :** నిర్విమర్శమయిన ప్రకాశస్వరూపమయిన ఆనందసమావేశమును అనుభవింపదలచిన యోగులు సూర్యభగవానుడు ఆరోగ్యమును ప్రసాదించునని శెలవిచ్చారు. వారు సూర్యతత్త్వవేత్తలు. భగము అనగా ఐశ్వర్యము గలవారు. భోగము యోగము '2' ప్రధాన లక్ష్యముగా గలవారు. ఎందుకంటే లోకంలో భుక్తిముక్తులకు సర్వసుఖములకు పూర్ణస్థానమయిన అమృతశరీరమును మనకు ఇవ్వటానికి అమృత మండలుడయిన ఆదిత్యుడు తప్ప ఎవరు ఉన్నారు?

**విశేషములు–వివరములు :**

1) భోగానికి యోగానికి కావలసినది ఆరోగ్యం కదా! ఆరోగ్యం అంటే పూర్ణ సుఖం. రోగాలు లేకపోవటం. రోగాలు అంటే అజ్ఞానం, దానివలన వచ్చే కామక్రోధాదులు. అట్టి ఆరోగ్యాన్ని ఇవ్వాలంటే అమృతమండలుడయిన భాస్కరుని వలననే తప్ప ఇతరుల వలన కాదు. అమృతం అంటే జ్ఞానం. ఔషధం.

2) **ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్**–అని ఆర్యోక్తిలో ఆరోగ్యపదానికి తాత్త్వికంగా అర్థాంతరం గూడా తీసికొనబడినది.

**శ్లో॥ హిత్వా హిత్వా గురుచపలతామప్యనేకాన్ నిజార్థాన్**
**యైరేకార్థీకృతమివ భవత్సేవనం మత్ప్రియార్థమ్।**
**తేషామిచ్ఛామ్యుపకృతిమహం స్వేంద్రియాణాం ప్రియాణా–**
**మాదౌ తస్మాన్మమ దినపతే! దేహి తేభ్యః ప్రసాదమ్॥ 47**

**ప్రతిపదార్థము :** దినపతే!=జ్ఞానసూర్య!, యైః=ఏ ఇంద్రియములచేత, గురు=పెద్దదయిన, చపలతామ్=చాపల్యమును, అనేకాన్=అనేకమయిన, నిజ=తమ, అర్థాన్ అపి= విషయము లను గూడా, హిత్వా హిత్వా=వదలి వదలి, మత్=నాకు, ప్రియార్థమ్= ప్రియవిషయ మయిన, భవత్సేవనమ్=నీ సేవ, ఏకార్థీకృతమివ=ఒకే ప్రయోజనముగా చేయబడినదో, తేషామ్=ఆ, ప్రియాణామ్=నాకు ప్రియమయిన, స్వ+ఇంద్రియాణామ్=నా ఇంద్రియాలకు, ఉపకృతిమ్= ఉపకారమును, అహమ్=నేను, ఇచ్ఛామి=చేయగోరు చున్నాను.

**ప్రత్యక్షస్త్వం సకలజగతాం యత్సమక్షం ఫలం మే**
**యుష్మద్భక్తేః సముచితమతస్తత్తు యాచే యథా త్వామ్॥ 45**

**ప్రతిపదార్థము :** పుంసామ్=పురుషులకు, అప్రత్యక్ష=అదృశ్యమయిన, త్రిదశ=దేవతలయొక్క, భజనాత్=సేవవలన, పరోక్షమ్=అదృశ్యమయిన, ఫలమ్=ఫలితం, యత్=ఏది కలుగునో, తత్=అది, యుక్తం భవతి=యుక్తమగును. కార్యమ్=కార్యము, కారణేన=కారణంతో, సమమేవ హి=సమానమే గదా! త్వమ్=నీవు, సకల=సమస్తమయిన, జగతామ్=లోకములకు, ప్రత్యక్షః=ఆత్మరూపంగా ప్రత్యక్షుడవు. సూర్యుడుగా ప్రత్యక్ష నారాయణుడవు. (అసియత్=అయినందువలన), యుష్మద్భక్తేః=మీ ఆత్మానుసంధానానికి/ మీ సేవకు, మే=నాకు, సమక్షమ్=ప్రత్యక్షమయిన, ఫలమ్=ఫలితము (ఆత్మ సమావేశము), సముచితమ్=తగినది, అతః=అందువలన, తత్తు=అదే, త్వామ్= నిన్ను, యథా= యోగ్యముగా (నీకు తగినట్లు), యాచే= ప్రార్థించుచుంటిని.

**తాత్పర్యము :** చిదర్కా! పరోక్ష దేవతలను కొలిచినవానికి పరోక్షఫలితం (స్వర్గాదికం) రావచ్చును. కాని నీవు 2 విధముల ప్రత్యక్షదేవతవు. భౌతికంగా నిత్యదర్శనదాతవు. ఆత్మరూపంగా మాకెప్పుడూ నీవు తెలిసినవాడవే. 'నేను' అంటే నీవే గదా! "నేను" అనుకొనకుండా, తెలియకుండా ఎవరూ ఉండదు. కనుక నీవు ఉభయవిధాల ప్రత్యక్షదేవతవు. కనుక నీ సేవకు అనగా ఆత్మానుసంధానానికి లేదా చిదర్కస్వప్రకాశ సామరస్యరూప పరమసమావేశ సాధనకు ఫలితం ప్రత్యక్షంగా ఆత్మజ్ఞానం/ ఆనందము కలగాలి. అదే సముచితం. కారణానురూపంగా కార్యం కార్యానురూపంగా కారణం (మట్టి-కుండ) ఉండాలి కదా! అందువలన నీకు తగిన విధంగా నాకు ఫలితం ఇవ్వమని కోరుచున్నాను.

**విశేషములు-వివరములు :**

1) సమాలంకారము? అప్రత్యక్షదేవతాపూజకు ఫలం అప్రత్యక్షం. ప్రత్యక్షదేవతా పూజకు ఫలం ప్రత్యక్షం. ఇలా కారణకార్యాలమధ్య అనురూపఫలం ఉన్నదని చెప్పటం వలన ఇది 'సమాలంకారము'. **'సారూప్యమపి కార్యస్య కారణేన సమం విదుః'** అని లక్షణము.

2) **'త్వద్భక్తేః హేతోర్మమ నిత్యోదితతత్త్వసమావేశాత్మఫలం సముచితమ్'** - వ్యాఖ్యాత.

3) **'చిదర్కః సర్వేషాం ప్రత్యక్షః స్వప్రకాశః, చిదర్కస్వప్రకాశాత్మతాం వినా కస్యాప్య-ప్రకాశాదితి'** - వ్యాఖ్యాత.

4) **నిర్వ్యుత్థానసమావేశాత్మైవ ఫలం** - వ్యాఖ్యాత. (నిర్వ్యుత్థానం=నిర్వికల్పం) వ్యుత్థానం-అనగా వివిధ వికల్పములతో ఉద్రేకించటం. అది లేనిది నిర్వ్యుత్థానము.

**శ్లో॥ యే చారోగ్యం దిశతి భగవాన్ సేవితోఽప్యేవమాహు-**
**స్తే తత్త్వజ్ఞా జగతి సుభగా భోగయోగప్రధానాః॥**



దర్పణనగరన్యాయంగా పరమేశ్వరుడు తనలోనే అభిన్నంగా ఉన్న దృశ్యమును తనకన్న భిన్నంగా ఉన్నట్లే అవభాసనం, ఆభాసనం చేస్తాడు. అది పరమాత్మయొక్క స్వతంత్రేచ్ఛ. ఆ చిదాత్మయే విశ్వోల్లాస కారణము. తన కోరికతో తనయందే ప్రకాశం చేస్తాడు. ప్రకాశానికి ఆధారం తనేనని అర్థం. తననుంచియే అది వచ్చింది కనుక తనే సాధనం, తనే ఉపాదానం. అందుకే **ఆచార్య వసుగుప్తుడు** అన్నాడు.

**నిరుపాదానసంభారమభిత్తావేవ తన్వతే**
**జగచ్చిత్రం నమస్తస్మై కలానాథాయ శూలినే॥ - శాక్తదర్శనం.**
**స్వేచ్ఛయైవ స్వాత్మభిత్తౌ - శివసూత్రం.**

8) స్వాతంత్ర్యశక్తిలోనిదే ఇచ్ఛాశక్తి. అందువలన దీనిని ఇచ్ఛాశక్తి అని పిలువవచ్చును. ఇదే ప్రథమస్పందం. కార్యభేదాన్ని బట్టి ఇది 5 రకాలు.

1) చిత్ శక్తి - ప్రకాశం, శుద్ధసంవిత్, శివ
2) ఆనందశక్తి - నిరపేక్షపరిపూర్ణస్థితి, శక్తి.

నోట్ ః ఈ '2' సామరస్యం పరాసంవిత్, పరమశివత్వం.

3) ఇచ్ఛాశక్తి - విశ్వసృష్టికి ఉన్ముఖత.
4) జ్ఞానశక్తి - ఇదం అనే జ్ఞానం. విశ్వప్రకాశం తెలిసికొనటం.
5) క్రియాశక్తి - విశ్వమును భాసింపజేయటం.

ఇందులో "3"వది ఇచ్ఛాశక్తి.

పరమశివుడు స్వరూప పరామర్శ రూపమయిన స్వాతంత్ర్య స్వభావంవలన విశ్వాత్మభావమునకు విముఖంగా ఉంటాడు. అంటే నిర్వికారుడు. హిమాలయంలో తపస్సులో ఉన్న దక్షిణామూర్తితత్త్వము. కాని ఆ స్థితిలో కొద్ది "ఉన్ముఖత్వం" వంటిది ఏర్పడుతుంది. అదే ఇచ్ఛయొక్క **ప్రథమ తుటి.** అదే ప్రథమ స్పందం. అదే **"హరస్తు కించిత్పరిలుప్తధైర్యః"** కావటం, అందుకు కామబాణం కారణం కావటం, శృంగార సంబంధం అయిన 'కామం' అంటే అది ఎవరికయినా సృష్టికామమే. అదే కామేశ్వరుని తత్త్వం. ఎదురుగా ఉన్న **'బింబఫలాధరోష్ఠం'** కామేశ్వరీతత్త్వం. కురువిందమణిప్రభ. ఈ ప్రథమతుటి చెరువునీటిలో "అల" పుట్టబోయే ముందరి కదలిక. దీనినే కాళిదాసు ఎంతో చక్కగా వర్ణించాడు.

**"అసామివాధారమనుత్తరంగం"**
**"చంద్రోదయారంభ ఇవాంబురాశిః"**

ఈ చలనానికి కారణం చిదాత్మయొక్క ఆనందస్వభావ క్రీడ. దీనిలోనికి ఇంకా క్రియ రాలేదు. ఇది ఒక పల్లవస్థితి. శ్రీ పరాశరభట్టరు అనుగ్రహించినట్లు

**ఉల్లాసపల్లవితపాలితసప్తలోకీ**
**నిర్వాహకోరకితనేమకటాక్షలీలాం॥** -ఇది ఇచ్ఛలోని '2'వ తుటి.

'బహిరుల్లిలాసయిష' - జగదుల్లాసన వాంఛ. **దీని తర్వాత తుటి** "జ్ఞానశక్తి" అంటే

ఇచ్ఛాశక్తి ముదిరితే జ్ఞానశక్తి, అది ముదిరితే క్రియాశక్తి. ఇచ్ఛాశక్తి ముదిరి జ్ఞానశక్తిగా మారటమే సదాశివతత్త్వం. దీనిలో 'ఇదం' అస్ఫుటంగా ఉంటుంది. ఇక విశ్వభాసనం క్రియాశక్తి. అది భాసనా, నానారూపధారిణి, విశ్వస్ఫారా అని ప్రసిద్ధి.

9) **"అహం, ఇదం"**–ఇది అవరోహణ క్రీడ. ఇదం–అహం అని 'ఇదం'ను అహంలో కలిపివేయటం ఆరోహణక్రీడ.

**"యథోర్ణనాభిః సృజతే గృహ్యతే చ"** వీటినే ఉన్మేష నిమేషా లంటారు. ఆరోహణంలో ప్రకాశం ఉన్మేషం అవుతుంది. విమర్శ నిమేషం అవుతుంది. అవరోహణలో ప్రకాశం నిమేషం చెందుతుంది. విమర్శ ఉన్మేషం చెందుతుంది. దీనినే ల।స।నా లో

**"ఉన్మేషనిమిషోత్పన్నవిపన్నభువనావళిః"** అన్నారు.

10) అవరోహణ లీలను బంధనలీల అంటారు. ఏమంటే, శివుడు తనను "జీవభావమున" సంసారంలో బంధిస్తాడు కనుక.

11) ఒక రచయిత ఎన్ని రచనలు చేసినా తాను అతీతంగా తటస్థంగా ఉంటాడు. కాని రచనలో అంతటా అతని శక్తి ప్రతిబింబిస్తూనే ఉంటుంది. అలానే ఈశ్వరుడున్ను ప్రపంచం విషయంలో ఉంటాడు. రచనలు లేనపుడు 'రచయిత' కానట్లు, సృష్టి లేనపుడు పరమేశ్వరుడు "స్వాతంత్ర్యశక్తి"తో కల్సి ఉంటాడు. స్వతంత్రుడు అని అర్థము.

12) తత్త్వవివరణలో మరికొన్ని విశేషాలు–వివరాలు ః

**ఎ) పరమశివతత్త్వం**

పరమశివతత్త్వము–ఇది పూర్ణం. ఉదా ః 0 (మఱ్ఱి విత్తనం వంటిది.) ఇది శివుడు కాదు, శక్తికాదు, విశ్వోత్తీర్ణుడు కాడు. విశ్వమయుడు కాడు. శక్తి–శక్తుడు అన్న భేదం లేదు. ఇది అవేద్యం. అంతఃస్వానందగోచరం. అవాచ్యం అనిర్వచనీయం, అనాది–అనంతం. ఒక **"విత్తనం" ఇటువంటిదే.** దానిలోని బీజశక్తి, అంకురరేఖ ఎక్కడా కనబడవు.

**బి) శివతత్త్వం–0̸**

పరమశివునిలో ఆనందచలనం వస్తుంది. అది "ప్రకాశవిమర్శలు" అను "2" భేదములకు భూమిక అవుతుంది. ఇది **విత్తనం ఉబ్బటం** వంటిది. ఇందులో ఈ "2" అన్యోన్యం ప్రభావితం అవుతాయి. ఇందులోని "శివ" భాగం ప్రధానం. శక్తిభాగం అప్రధానం. ఇది అభినవగుప్తుని మాటలలో **ప్రథమతుటి.** దీనినే ప్రథమస్పందము అంటారు. దీనిలో శివతత్త్వం ప్రకాశం, జ్ఞానం, విశ్వోత్తీర్ణం. ఇందలి 'శక్తి' భాగం విమర్శరూపం. విశ్వమయం. శివతత్త్వంలో ప్రమేయం ఉండదు. శుద్ధ "అహం" మాత్రమే ఉండును. ఇదం గాని అస్మి గాని స్ఫురించదు.

**సి) శక్తితత్త్వం–0́**

బీజం అంకురోన్ముఖమయిన స్థితి. **గింజకొన విచ్చుకొనే స్థితి.** ఉన్మేషంవైపు ఉన్ముఖమయిన స్వతంత్రేచ్ఛయే శక్తితత్త్వం. దీనిలో ప్రమేయమయిన సమస్త విశ్వతత్త్వం



**ప్రతిపదార్థము :** భాస్వన్=సూర్యుడా!, జన్మప్రభృతి=జననమునుంచి, భవతః=నీయొక్క, సేవనమ్=సేవ, అస్తామ్=ఉండుగాక!, వా=ఎందుకంటే, తత్=ఆ సేవనము, అపరిమిత= అనంతమయిన అమేయమైన, ఫలమ్=ఫలముగలది, భుక్తి=విషయభోగము అనబడే ఆత్మానందప్రదమయిన, ముక్తి=ముక్తిని, ప్రకాశమ్=ప్రకాశింపజేయునది, లోకే=లోకమున, కేన=ఎవనిచేత, వాచ్యమ్=చెప్పశక్యమయినది? (కాదని అర్థం), సతామ్=సత్పురుషులకు, జీవితాంతేపి=ప్రాణసమాప్తియందున్ను, స్మృతిపథమ్=స్మృతిని, ఇతః=పొందినవాడవై, జ్యోతిర్మాత్రమ్='జ్యోతి'రూపుడవై, నిర్వాణాయ=ముక్తికి, ప్రభవసి=పనికివచ్చుచున్నావు, తేన=అందుచేత, తే=నీకు, సమః=సమానుడైన, అన్యః=మఱొక దేవుడు, కః=ఎవడుగలడు?

**తాత్పర్యము :** జననం ఆదిగా నీ సేవ మాకు లభించవలెను. అది జీవన్ముక్తునికి విషయభోగరూప ముక్తిని కలిగిస్తుంది. అమితమయిన ఫలాన్ని అందిస్తుంది. చివఱకు యోగులకు ప్రాణోత్క్రమణ సమయమున నీవు 'జ్యోతి' రూపముగా ప్రత్యక్షమయి 'నిర్వాణం' కలిగిస్తావు. కనుక జీవితకాలములో భోగరూపమోక్షమును, మరణకాలమున నిర్వాణరూప మోక్షమును దయచేసే నీవంటి దేవుడు మఱొకడు లేడు.

**విశేషములు–వివరములు :**

1) భుక్తిముక్తిప్రకాశమ్. ఇందులో భుక్తిని, ముక్తిని–అని అర్థం చెప్పవచ్చును. కాని 'నిర్వాణాయ' అన్న అపరార్థానికి అవకాశం పోతుంది. అందువలన వ్యాఖ్యాత క్షేమరాజు **"భుక్తిర్విషయభోగ ఏవ స్వాత్మానందవిశ్రాంతిదత్వేన జీవచ్ఛివత్వాభివ్యక్తాత్మా, ముక్తిరేవ చ చిచ్చమత్కారావేశరూపా భుక్తిః, న తు విషయాసక్తిరూపా"** అని అర్థం ప్రసాదించారు. దీని భావం ఏమనగా –

**జీవన్ముక్తుడు అంటే జీవచ్ఛివుడు.** జంగమపరమేశ్వరుడు. అతనికి ఆ స్థితి జ్ఞానంతో లభిస్తుంది. అతని విషయభాగాలన్నీ ఈశ్వరానుసంధానంతోనే ఉంటాయి. **"ఆత్మాత్వం గిరిజామతిః"**–అన్నట్లు అతని విషయోపభోగరచన అంతయును, పూజయే. పూజ అంటే జ్ఞానకాండలో అద్వైతభావనయే. కనుక ఇచ్చట సూర్యసేవ జననాదిగా చేసిన సత్పురుషులు **జీవచ్ఛివులు**. వారి భుక్తి, విషయములనన్నింటిని ఈశ్వరార్పణగా భుజించటమే. కనుక భుక్తిగూడా ముక్తిగా మారింది. కనుకనే వారు జీవన్ముక్తులు అని అర్థం. ఆ 'సేవ' లేనివారు **జీవచ్ఛవులు**. వారి విషయసేవ విషయాసక్తితో ఉంటుంది కనుక అది ముక్తి కాదు. భుక్తియే–అని వ్యాఖ్యాత భావం. కవి భావము అదే.

2) దీపం 'నిర్వాణానికి' పనికి వస్తుందనటం విచిత్రం. కనుక విరోధాభాసం.

3) జీవచ్ఛివుడుగా ఉండి చిదానందానుభవాన్ని పొందటమే ఇందులో 'భుక్తి' అని కొందరు విద్వాంసుల అభిప్రాయము.

**శ్లో॥ అప్రత్యక్షత్రిదశభజనాద్యత్పరోక్షం ఫలం తత్**
**పుంసాం యుక్తం భవతి హి సమం కారణేనైవ కార్యమ్।**

**తాత్పర్యము :** మా పాదములను శరణుగొన్నవారిని దేవతలు పీడించినను వారిని మఱల వృద్ధి పొందిస్తానని తెల్లని కీర్తిని ప్రకటిస్తున్నట్లుగా, నిత్యము దేవతాగ్రాసంగా అయిన చంద్రుని నీలోని అమాకల ద్వారా దివ్యకిరణ తేజముతో మఱల వృద్ధి పొందిస్తున్నావు. శుక్లపక్షాన్ని సృష్టిస్తున్నావు. ఇందులో రహస్యార్థమేమంటే–

దేవతలు=ఇంద్రియాలు. సోముడు అంటే అపానంతో కల్సి. లోపల ప్రవేశించిన షోడశకలారూపమయిన సమస్త మేయవర్గము. దీనిని ఇంద్రియాదులు నిత్యం గ్రసించడం= అనుభవించటం వలన కలాక్షీణం అవుతుంది. అపుడు మధ్యధామమయిన "శుభ" అను పేరుగల తురీయమయిన "ప్రభ" వలన అమా అనబడు ఊర్ధ్వతుటి/ అంత్యతుటి యొక్క అర్ధభాగములో ఉన్న శక్తిగర్భంలో వృద్ధినొందించి, చిదేకఘనంగా (శుక్లంగా) చేయుచున్నావు అని అర్థము. అనగా సమస్తమేయవర్గమును జ్ఞానైకరూపంగా తేల్చుచున్నావు. "అన్నం బ్రహ్మ అహం చ బ్రహ్మ" అన్న జ్ఞానం కలుగుతుంది. దానివలన విషయవర్గము, దాని క్షీణత మొ॥ పోయి జ్ఞానైకరూపత వలన అనాది–అనంతమయిన స్థితి కలుగును.

**విశేషములు–వివరములు :**

1) సోముడు– అగ్నీషోమాత్మకమయిన విశ్వములో ప్రాణం అగ్నిరూపం. అపానం సోమరూపం. ప్రాణం జ్ఞానరూపం. అపానం జ్ఞేయరూపం, మేయరూపం. "మాత" వలన మేయం ఖర్చు అవుతుంటుంది. దాన్ని సూర్యుడు మఱల తన కిరణశక్తితో భౌతికంగా సృష్టించినట్లు తన జ్ఞానశక్తితో సమస్త మేయమును మఱల సృష్టించి దాన్ని జ్ఞానపూర్ణం చేస్తాడు. దానికి అమా/సాదా–అనబడే మూలకళ అవసరం. అంటే ఎంత చిక్కిపోయిన వానినయినను ప్రాణకల ఉంటే మఱల బ్రతికించితే ఆ ప్రాణమే శరీరంలోకి కావలసిన రక్తాదులను వృద్ధి చేసికొంటుంది. అలా అమా–కళ సహాయంతో సుషుమ్నా స్థిత మరీచిచక్రంతో మఱల 'సోముడు' అనబడే మేయసమూహం వృద్ధి అవుతుంది.

2) శ్వాస అపానవాయువుగా అయి హృదయాకాశమునుండి బాహ్యద్వాదశాంతందాకా పోగా ఇంద్రియవృత్తులు క్షీణం అవుతాయి. అక్కడ బాహ్యద్వాదశాంతంలో ప్రాణంతో అనగా సూర్యునితో కలసి అనగా సూర్యుని శరణువేడి మఱల ప్రాణవాయువుగా అయి బాహ్యద్వాదశాంతమునుండి హృదయాకాశంలో ప్రవేశిస్తుంది. ఇంద్రియ వృత్తులు బలపడుతాయి. ఈ ప్రాణాపానసంధిలో చిత్సూర్యుడు తన ప్రభావంతో శ్వాసకు మఱల ప్రాణత్వం ఇస్తాడు.

**శ్లో॥ అస్తాం జన్మప్రభృతి భవతస్సేవనం తద్ధి లోకే**
**వాచ్యం కేనాపరిమితఫలం భుక్తిముక్తిప్రకాశమ్।**
**జ్యోతిర్మాత్రం స్మృతిపథమితో జీవితాన్తేఽపి భాస్వన్!**
**నిర్వాణాయ ప్రభవసి సతాం తేన తే కస్సమోఽన్యః॥ 44**



సూక్ష్మంగా ఉండును. నిజానికి శివుడే తనలోని అర్థతత్త్వాన్ని ప్రకాశింపజేయుటకు ఇలా బహిర్ముఖుడవుతాడు గనుక ఇది గూడా శివతత్త్వంలో భాగమే. అందువలననే కొందరు శక్తితత్త్వాన్ని కొందరు శివతత్త్వాన్ని ప్రథమస్పందంగా చెప్పారు. క్షేమరాజు శక్తితత్త్వాన్ని ప్రథమస్పందంగా చెప్పాడు. ఇందులో 'అహం–ఇదం/అస్మి' ఉంటాయి. ఇందులో చివరివి ప్రధానం. ఇదిగూడా అభేదభూమికలోనిది.

**డి. సదాశివతత్త్వము**

ఇది భేదాభేద భూమికలోనిది. జ్ఞానక్రియాద్వయరూపం. శివుని ఇచ్ఛాశక్తినుండి వచ్చినదిది. ఇచ్ఛయొక్క అంతర్ముఖస్పందం. సదాశివతత్త్వం–జ్ఞానశక్తి. ఇది ప్రధానం. బహిర్ముఖస్పందం క్రియాశక్తి. ఇది ఇందులో అప్రధానం. ఈ తత్త్వంలో "అహం ఇదం" ఉన్నా "అహంత" ప్రధానం. అంటే విశ్వసత్త 'అహంత' క్రింద మిణుకు మిణుకుమంటుంది. అహంత ఒక పలక అయితే దానిలోని "విశ్వం" ఒక అస్పష్టరేఖాచిత్రం వంటిది. **అర్ధనిమీలిత నేత్రస్థితి.** ఒంటరి "శివుని" బొమ్మలో అర్ధనిమీలిత నేత్రస్థితికి ఇదే హేతువు.

**ఇ. ఈశ్వరతత్త్వం**

ఇచ్ఛాశక్తియొక్క అంతర్ముఖస్పందం సదాశివుడయితే బహిర్ముఖస్పందం ఈశ్వరుడు. క్రియాశక్తిరూపం. సదాశివునిలో అంకురారంభస్థితిలో ఉన్న విశ్వం ఇందులో **అంకురించిన అవస్థ**లో ఉంటుంది. దీనిలో 'ఇదం' ప్రధానం. అందువలన 'ఇదం అహం' అన్నది భావన. సదాశివునిలో 'అహమిదం' అన్నది భావన. **పిల్లవాడు ఆటలో తనను మరచి గిలక్కాయను చూస్తున్నట్లు** దీనిని ఉన్మేషతత్త్వం అంటారు.

**ఎఫ్. శుద్ధవిద్య**

దీనిని 'సద్విద్య' అని గూడా అంటారు. ఇది సదాశివునిలోని 'అహమిదం' అనే అభేద భావన. అలానే ఈశ్వరునిలో ఉన్న 'ఇదమహం' అనే అభేదభావన. '2'న్ను ఏ విధంగానయినా అభేదభావనలే కనుక ఇది శుద్ధవిద్య.

1) వేద్యశక్తి–ఉన్మేషం–ఈశ్వరుడు. బాహ్యం.

2) వేదకశక్తి–నిమేషం–సదాశివ –ఆంతరం.

ఇవి అన్నియు చిత్తులోనివే కనుక అభేదం. ఇదే పరాపరదశ. (పర–అహం. అపర–ఇదం). Note : పరమశివుని బహిర్ముఖత్వం శక్తితత్త్వం. సదాశివ ఈశ్వరుల బహిర్ముఖత్వం శుద్ధవిద్యాతత్త్వం. మొత్తం ఈ **5 తత్త్వాల సమూహం శుద్ధ–అధ్వ.** అభేదభూమిక.

'మాయ' నుండి అశుద్ధ–అధ్వ, భేద భూమిక.

6) **"మాయ" – అంకురం మారాకు వేయటం** వంటిది. దీనినుంచి అవిద్య, జీవుడు మొ॥ మిగిలిన తత్త్వాలు వస్తాయి. సమస్తజడాభాసకు మూలం ఇది. విశ్వమునకు ఇది ఉపాదాన కారణం. కనుక వ్యాపిని. ఇది శుద్ధ ప్రకాశానికి "తిరోధాన"కారిణి.

13) **శివశక్తులు** **జీవగుణాలు సంకుచితం కావటం**

| | |
|---|---|
| ఎ) సర్వకర్తృత | కల |
| బి) సర్వజ్ఞత | విద్య |
| సి) నిత్యత | కాలం |
| డి) పూర్ణత | రాగం |
| ఇ) స్వతంత్రత | నియతి |

14) జీవుడు పై పంచకంచుకములు గలవాడు. అవి మాయా కంచుకములు. పాశబద్ధుడు కనుక 'పశువు'. ఇంకా పురుషుడు, అణువు, పుమాన్, మితాత్మ, పుద్గల మొ॥ పేర్లు గలవు. వీరు అసంఖ్యాకులు.

15) స్వతంత్రేశ్వరుడు జీవాత్మలయొక్క కర్మలనుబట్టి ప్రకృతిని క్షుబ్ధం చేస్తాడు. దానితో జగత్కార్యం. ఈ మతంలో అనేక పురుషులు–అనేక ప్రకృతులు.

16) **మలం**–పాపం అజ్ఞానం. ఇది 3 రకాలు.
ఆణవం–జీవుని అవివేకం–జ్ఞాన సంకోచం.
మాయీయం–భేదదృష్టి, 36 తత్త్వాలు.
కార్మం–జన్మమరణరూప సంసారకారణం పుణ్యాపాపాలు.

17) **ఉపాయభేదాలు :**

ఎ) **ఆణవం**– ప్రాణవ్యాపారరూపమయిన 'ఉచ్చారం' మొదలైన బాహ్యవస్తువులాధారంగా సాధన ద్వారా తన శివభావాన్ని గ్రహించడం ఆణవోపాసన. ఉచ్చారం మొ॥ బుద్ధిక్రియాజన్యములు కనుక 'క్రియోపాయం' అంటారు.

బి) **శాక్తం**–ఇది జ్ఞానోపాయం. ఇందులో వికల్పబుద్ధి ఉంటుంది. కాని 'ఉచ్చారాది' బాహ్యక్రియలుండవు. శుద్ధవికల్పం ఉంటుంది. 'సర్వం అహం' అన్నదే అది. ఈ భావనయే వికల్పజ్ఞానం. క్రమంగా తనను "శివోహం"గా చేసికొంటాడు. ఇదే శాక్తసమావేశం.

సి) **శాంభవం, ఇచ్ఛోపాయం** – ఇది నిర్వికల్పం. తీవ్ర జిజ్ఞాసతో అతనిలోని "స్పందరూప–ఇచ్ఛాశక్తి" వ్యక్తమవుతుంది. అనేకసాధనలతో అతనిలో అంతకుముందే శివభావం వ్యక్తం అవుతుంది. అట్టిస్థితిలో నిర్మలసంవిత్సాధకు డయిన ఏ సిద్ధుని అనుగ్రహంతోనో శక్తిపాతంతోనో ఇతనికి ప్రహ్లాదునికి లాగా పరిశుద్ధ శివభావం ఏర్పడును. ముక్తికి సాక్షాత్తు ఉపాయం ఇది.

18) **వాక్కు–భేదాలు :**

ఎ) **పరా** – యాసాంతరోహరూపా 'పరా' మహేశీ విభావితా సైవ॥

**– కామకలావిలాసం.**

పరా–అనగా **'సాంతరోహ'** రూపమయినది. అంతఃకరణములో ఏర్పడిన "వితర్కం"



వియదివ=ఆకాశమువలె వ్యాపకము, అపి చ=ఇంతే గాక, సప్త=ఏడు, ఛందాంసి=ఛందస్సులు, తురగాః=గుఱ్ఱములు, మండలం చ=మండలమున్ను, ఋఙ్మయమ్=ఋగ్వేదమయము, ఏవం=ఈ విధముగా, సర్వశ్రుతిమయతయా=సర్వవేదమయం కావటం వలన/అంతటా చెవులతో నిండి ఉండుటవలన, మత్=నాయందు నీకున్న, దయానుగ్రహోద్వా=దయాపూర్వకమయిన అనుగ్రహమువలనగాని, మత్తః=నానుండి వచ్చిన, కృపణ=దీనమయిన, ఇమమ్=ఈ, కరుణాక్రందమ్=శోకాక్రోశమును, క్షిప్రమ్=శీఘ్రముగా, ఆకర్ణయ=వినుము.

**తాత్పర్యము :** ఓ భగవంతుడా! నీవు సామవేద స్వరూపుడవు. నీ శరీరము యజుర్వేదము. ఆకాశమువలె సర్వవ్యాపకమయిన శబ్దశరీరము గలవాడవు. నీ మండలము ఋగ్వేదము. నీ గుఱ్ఱములు, సప్తచ్ఛందములు. ఈ విధంగా సర్వశ్రుతులు అనగా వేదములు, శబ్దములు, చెవులుగల నీవు నా మీద దయతో అనుగ్రహంతో నా దీనశోకాక్రోశమును వెంటనే వినగలవు. వెంటనే విని ఉద్ధరింపుము.

**విశేషములు–వివరములు :**

1) తన స్తోత్రములు సర్వశ్రుతి సమానములు, శ్రుతి మూలములు, శబ్దరూపములు అని ధ్వని.

2) 'శ్రుతి' అనగా చెవులు. ఒంటినిండా చెవులు అని అర్థం. కనుక శ్లేష. దీనివలన తన 'ఆర్తనాదము' వినుట సులభ సాధ్యమని సమర్థించుట–వలన కావ్యలింగం.

3) భగవంతుడు ద్వైతంలో నాదరూపం అని 'శబ్దాకారం' అని చెప్పారు. అంతేగాక ప్రణవం వేదత్రయాత్మకం. అట్లే సూర్యశరీరం వేదత్రయాత్మకం కనుక 'ప్రణవరూపుడు' అని చెప్పినట్లు వ్యంగ్యము.

**శ్లో॥ నాశం నాస్మచ్చరణశరణా యాంత్యపి గ్రస్యమానా**
**దేవైరిత్థం సితమివ యశో దర్శయన్ స్వం త్రిలోక్యామ్।**
**మన్యే సోమం క్షతతనుమమాగర్భవృద్ధ్యా వివస్వన్**
**శుక్లచ్ఛాయాం నయసి శనకైః స్వాం సుషుమ్ణాంశుభాసా॥ 43**

**ప్రతిపదార్థము :** వివస్వన్=సూర్యనారాయణా!, అస్మత్=మాయొక్క, చరణ=పాదములు/కిరణములు, శరణాః=శరణుగా గలవారు, దేవైః=దేవతలచేత/ ఇంద్రియాలచేత, గ్రస్యమానాః అపి=మ్రింగబడుచున్నను, నాశమ్=ధ్వంసమును, న యాంతి=పొందరు. ఇత్థమ్=అని, త్రిలోక్యామ్=లోకత్రయమునందు, సితం=తెల్లని, స్వమ్=తన(నీ), యశః=కీర్తిని, దర్శయన్నివ=చూపుచున్నట్లు, క్షతతనుమ్=గ్రస్తశరీరుడయిన, సోమమ్=చంద్రుని/అపానమును మేయవర్గమును, సుషుమ్ణా=సుషుమ్నా నాడియొక్క (మంచి కాంతిగల), అంశుభాసా=కిరణకాంతితో, అమా=అమావాస్యయొక్క/అమాకల యొక్క, గర్భ=లోపలి, వృద్ధ్యా=వృద్ధితో, శనకైః=మెల్లగా, స్వామ్=తనదయిన, శుక్లచ్ఛాయామ్=తెల్లని కాంతిని, నయసి ఇతి=పొందించుచున్నావని, మన్యే=భావించెదను.

2) ప్రసీద-అంటే "దేహాది కాలుష్యప్రశమనేన నిర్మలీభవ" - వ్యాఖ్యాత. అనగా నిర్వ్యుత్థాన-అనగా వివిధోత్థానములు లేని ప్రకాశానంద ఘన పరమరససమావేశము కలిగింపుమని శాక్తతంత్రసిద్ధమయిన అర్థము.

**శ్లో॥ విశ్వప్రాణగ్రసనరసనాటోపకోపప్రగల్భం**
**మృత్యోర్వక్త్రం దహననయనోద్దామదంష్ట్రాకరాళమ్।**
**యావద్ దృష్ట్వా వ్రజతి న భియా పఞ్చతామేష కాయ-**
**స్తావన్నిత్యామృతమయ! రవే! పాహి నః కాన్దిశీకాన్॥ 41**

**ప్రతిపదార్థము :** విశ్వామృతమయ=విశ్వామృతస్వరూపా!, రవే=సూర్యా!, విశ్వ=ప్రపంచము యొక్క, ప్రాణ=ప్రాణవాయువులయొక్క, గ్రసన=మ్రింగునట్టి, రసనా=నాలుకయొక్క, ఆటోప=ఆడంబరమునందు, కోప=కోపమునందును, ప్రగల్భమ్=ప్రౌఢమయినదియు, దహన=అగ్నిరూపమైన, నయన=కన్నులచేత, ఉద్దామ=పెద్దదయిన, దంష్ట్రా=కోఱలచేత, కరాలమ్=భీకరమయినది అగు, మృత్యోః=మృత్యుదేవతయొక్క వక్త్రమ్=నోటిని, దృష్ట్వా= చూచి, భియా=భయంతో, ఏషః=ఈ, కాయః=శరీరం, పంచతామ్=మరణమును (5గా విడిపోవుట), యావత్ న వ్రజతి=ఎంతలో పొందదో, తావత్=అంతలో, కాందిశీకాన్= శరీరం తప్ప వేరే దిక్కులేదని అల్లాడు, నః=మమ్ములను, పాహి=రక్షించుము.

**తాత్పర్యము :** నిత్యామృతమయా! పరమానందఘనరూపా!, చిదర్కా! కాయంతప్ప మఱొక దిక్కున్నదని, ఉన్నా, తెలిసినా దాన్ని పొందే తీరు తెలియనివారము. అందుచే కాందిశీకులము. విశ్వమును మ్రింగివేయగల కోపాటోపములతో తెఱచిన మృత్యువు నోటిని చూచినంతనే, దాని అగ్నినేత్రములను, దంష్ట్రాకరాళమయిన ముఖమును చూడగానే వణికి చచ్చిపోవు ఈ 'కాయం' అలా పోకముందుగానే అమృతమయమయిన జ్ఞానస్వరూపముతో నీవు మాయందు సమావేశమయి స్ఫురించి మా భయములు తొలగించి ఉద్ధరింపుము.

**విశేషములు-వివరములు :**

1) సామాన్యమయిన అమృతం దేవతలది. వారికి చావు తప్పదు. కనుక ఆ అమృతం నిత్యామృతం కాదు. పరమాత్మసాక్షాత్కారజాతమయిన స్వస్వరూప జ్ఞానానందామృతం నిత్యం. ఇది నిత్యామృతం. అదే చిదర్కుని తత్త్వం.

**శ్లో॥ శబ్దాకారం వియదివ వపుస్తే యజుఃసామధామ్నః**
**సప్తచ్ఛన్దాంస్యపి చ తురగా ఋఙ్మయం మణ్డలం చ।**
**ఏవం సర్వశ్రుతిమయతయా మద్దయానుగ్రహాద్వా**
**క్షిప్రం మత్తః కృపణకరుణాక్రన్దమాకర్ణయేమమ్॥ 42**

**ప్రతిపదార్థము :** భగవన్=భగవంతుడా!, సామధామ్నః=సామవేదస్వరూపుడవైన, తే=నీ, యజుః=యజుర్వేదరూపమయిన, శబ్దాకారం=శబ్దస్వరూపమయిన, వపుః=శరీరము,



లేదా వికల్పం లేదా 'వాక్'కు సంబంధించిన ఒక అవ్యక్తమయిన కోరిక వంటి కదలిక. మాయ 'నిష్పంద'.

బి) **పశ్యంతి** - "వివక్షా" రూపమయినది "పర"కన్నా స్పష్టంగా వచ్చిన **"వచనవాంఛ"** జ్ఞానరూపం. ఏది వక్తవ్యమో అది రూపం తీసికొన్న స్థితి. సామాన్యస్పంద రూప. మూలాధారాదులందు వ్యక్తం అవుతుంది.

సి) **మధ్యమ-వచన ప్రయత్నం.** నాభివద్ద కదలిక వంటిది. నాభినుండి హృదయం దాకా వస్తుంది. శబ్దసంబంధమయినది. ఇది క్రియాశక్తరూపము. కాని అంతర్గతము.

డి) వైఖరి-ఇదియు క్రియాశక్తియే. కాని బహిర్గతం. **మాటలు**-శబ్దరూపం.

**"వివక్షావ్యవసాయోక్తి రూపాః ఏతాః త్రిమాతరః"** - కామకలావిలాసం.

**వామకేశ్వరం** వీటిని ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తిస్వరూపాలుగా చెప్పింది.

**ఇచ్ఛాశక్తి స్తథాసేయం పశ్యంతీ వపుషాస్థితా**
**జ్ఞానశక్తిః తథాజ్యేష్ఠా మధ్యమా వాగుదీరితా**
**క్రియాశక్తిస్తు రౌద్రీయం వైఖరీ విశ్వవిగ్రహా॥** - వామకేశ్వరతంత్రం.

'పరా' గురించి- **ఆత్మనః స్ఫురణం పశ్యేత్ యదా సా పరమాకలా**
**అంబికారూపమాపన్నా పరావాక్ సముదీరితా॥**

ఈ 'వాక్' మనకు అందనిది. సమాధి వేద్య. శారదాతిలకంగూడా వీటిని గూర్చి వివరించింది. కావలసినవారు వివరాలను అచ్చట గమనించవచ్చును.

19) **షడధ్వలు**-ఇవి తంత్రంలో క్లిష్టమయిన అంశం. సంక్షిప్తవివరణ నిరుపయోగం. తంత్రాలోకం మొ॥ వాటిలో చూడదగును. చూ. కైవల్యనవనీతం.

**ఆదిత్యబ్రహ్మోపాసన**

మనదేశంలో శల్యావశిష్టమయిన ఉపాసనాపద్ధతి 'సౌరం'. ఇది స్మార్త పంచాయతనంలో స్ఫటికశిలారూపంలో ఇప్పటికీ ఉన్నది. దీని మూలరూపం సంధ్యావందనంలో ఇప్పటికీ సజీవమే.

**ఉద్యంతమస్తంయంతమాదిత్య-మభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణో**
**విద్వాన్ సతతం భద్రమశ్నుతే అసావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవసన్**
**బ్రహ్మాప్యేతి, య ఏవం వేద, అసావాదిత్యో బ్రహ్మ॥**

అన్న మంత్రంలో ఆదిత్యుని బ్రహ్మభావంతో ధ్యానించిన విద్వద్బ్రాహ్మణుడు అనగా బ్రహ్మజ్ఞాని "ఆదిత్య బ్రహ్మరూపుడవుతాడ"ని చెప్పబడింది. సౌర తేజస్సు బ్రహ్మతేజస్సే. సవితా అంటే పరబ్రహ్మకు వాచకం. పరబ్రహ్మ లక్షణాలకు సూర్యుడే సంకేతము. ప్రాచీనకాలంనుంచీ సౌరతేజస్సును కొలవటం ఉన్నట్లే. గాయత్రీ మంత్రార్థం అదే.

**"తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్"॥**

ఇందులో ఆరాధన సూర్యునికి కాదు. సౌరతేజస్సునకే. సూర్యుడే భగవంతుడయితే

ఆయనకే నమస్కరించాలి కాని ఆయనను వదలి ఆయన తేజస్సును ధ్యానించడం, పూజించటం ఎందుకు? అంటే సూర్యబింబం భౌతికం-మన శరీరం లాగా!. అందలి తేజమే ఆత్మ. అదే బ్రహ్మం-మన ఆత్మలాగా! **అందువలన పూజ సృష్టికర్తకే గాని, సృష్టికి గాదని హిందూమత విమర్శకులు గ్రహించాలి.** గీతలో భగవంతుడు చెప్పినదదే-

**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలం**
**యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజోవిద్ధి మామకమ్॥**

కృష్ణగీతనుబట్టి కృష్ణపుత్రుడు సాంబుడు చిత్సూర్యారాధనను చేశాడు. శ్రుతి గూడా **"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకాః"** అన్నది. కనుకనే వేదఋషులు అన్నారు-

**"ఇంద్రం మిత్రం వరుణమగ్నిమాహుః అథో దివ్యస్స సుపర్ణో గరుత్మాన్**
**ఏకం సద్విప్రాబహుధా వదంతి అగ్నిం యమం మాతరిశ్వాన మాహుః"॥**

-మహాసౌరం.

దృశ్యమాన కాంతిపదార్థాలలో మనకు సూర్యుని మించినది లేదు. అందువలన

**"యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా**
**తత్తదే వావగచ్ఛత్వం మమతేజోంశసంభవం॥** - అన్న, గీతారీతిలో, గ్రహములలో ఆదిత్యుడనని చెప్పిన కృష్ణభణితిలో, సర్వోత్తమమయిన తమోహారమయిన జ్యోతిగా సూర్యుని, సూర్యునిలోని తేజస్సును ధ్యానించుచున్నాము.

**ఇదం శ్రేష్ఠం జ్యోతిషాం జ్యోతిరుత్తమం విశ్వజిద్ధనజిదుచ్యతే బృహత్**
**విశ్వభ్రాట్ భ్రాజో మహి సూర్యో దృశ ఉరు పప్రథే సహ ఓజో అచ్యుతమ్॥** -మహాసౌరం.

ఇంతేగాక,

**యః ప్రణవస్స ఉద్గీథ ఇత్యసా వాదిత్య ఉద్గీథ ఏష ప్రణవః॥** - ఛాందోగ్యం

అని ఆదిత్యుడు ప్రణవస్వరూపం. అని,

**అథ యదేతదాదిత్యస్య శుక్లం భాః సై వర్గథయన్నీలా పరం కృష్ణం యత్సామ॥** -ఛాందోగ్యం.

అని ఆదిత్యుడు వేదత్రయ స్వరూపుడని,

**యశ్చాసావాదిత్యే హిరణ్మయః పురుషో, దృశ్యతే హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః**
**ఆప్రణఖాత్సర్వ ఏవ హిరణ్యః"** - ఛాందోగ్యం.

అని ఆదిత్యుడు ఆత్మస్వరూపుడని,

**"ఆదిత్యో బ్రహ్మేత్యాదేశః"......** - ఛాందోగ్యం

అని ఆదిత్యుడు బ్రహ్మరూపంగా ఉపాస్యుడని, ఉపనిషత్తులు చెప్పినవి.

సూర్యోపనిషత్తు సూర్యుని సర్వరూపవైభవాన్ని సరళవచనాలతో చెప్పింది. "అసా వాదిత్యో బ్రహ్మ" అన్నది.

**నేమా విద్యుతోభాంతి కుతోయమగ్నిః తమేవ భాంతమనుభాతి సర్వం**
**తస్య భాసా సర్వమిదం విభాతి** - అన్నది. బ్రహ్మకాంతియే సర్వవ్యాపకం,



**తాత్పర్యము :** అయ్యా!, నీవు తండ్రివి. మేము భోగచంచలులమయిన పుత్రులము, అందున అర్భకులము. కనుకనే సత్యాసత్యాలు పలుకుతాము. మాటలు పొల్లు పోతుంటాయి. మానసిక, శారీరక శౌచాలుండవు. సిగ్గుపడవలసినచోట సిగ్గుపడము. జ్ఞానం లేదు. భవిష్యత్తు తెలియదు. కోరిక తీరకపోతే బాధ. కోరికతీరితే దాని స్థిరత్వం విషయంలోనూ చింత. విషయానుభవం మీద మాత్రం ఎక్కడా లేని కుతూహలము. మా యీ పిల్లల ప్రవర్తనను క్షమించి అన్ని దశలలోను నీవు మమ్ములను కాపాడుచుండుము.

**విశేషములు-వివరములు :**

1) లజ్జ-అంటే విచక్షణ. **"హ్రీరకార్యనివర్తనమ్"** అని భారతం. అంటే అధర్మాచరణ వైముఖ్యం అని తాత్పర్యము.

**శ్లో॥ యావద్దేహం జరయతి జరా నాన్తకాదేత్య దూతీ**
**నో వా భీమస్త్రిఫణభుజగాకారదుర్వారపాశః**
**గాఢం కణ్ఠే లగతి సహసా జీవితం లేలిహాన-**
**స్తావద్భక్తాభయద! సదయం శ్రేయసే నః ప్రసీద॥** **40**

**ప్రతిపదార్థము :** భక్తాభయద=భక్తులకు అభయమిచ్చువాడా!, దూతీ=మరణదూత అయిన, జరా=ముసలితనము, అంతకాత్=యమునినుండి, ఏత్య=వచ్చి, దేహమ్=దేహమును, యావత్=ఎంతలో, న జరయతి=శిథిలం చేయదో, భీమః=భయంకరమైనదియు, త్రిఫణ=మూడుతలలుగల, భుజగాకార=పామువంటి, దుర్వార=నివారింపశక్యముకాని, పాశః=యమపాశము, జీవితమ్=మా ప్రాణమును, లేలిహానః=నాకుచున్నదై, సహసా=హఠాత్తుగా, కంఠే=మా కంఠమున, గాఢమ్=బిర్రుగా, యావత్ న లగతి=ఎంతలో తగుల్కొనదో, తావత్=అంతలోనే, సదయమ్=దయతో, నః=మాయొక్క, శ్రేయసే=శ్రేయస్సుకొఱకు, ప్రసీద=ప్రసన్నుడవు/ నిర్మలుడవు కమ్ము.

**తాత్పర్యము : 'ద్వితీయాద్వైభయం భవతి'** అని ద్వైతంవలన భయం కలుగుతున్నది. ద్వైతంవలననే కామక్రోధాది మాలిన్యములు పేరుకొంటాయి. ఆత్మను కప్పిన మలములు అవే. వాటివలననే శరీర అభిమానం. వాటివలననే "నైర్మల్యం" నష్టపోయినాము. అట్టి శరీరమునకు అట్టి జీవులకు మృత్యుభయం ఉంటుంది. కనుక మృత్యుదూత అయిన 'జర' వస్తుంది. యమపాశము మూడుఉచ్చులతో కంఠానికి బిగుస్తుంది. పాములాగా మా ప్రాణవాయువును ఆరగిస్తుంది. ఈ స్థితిలో మేము చేయగలిగినది లేదు. కనుక భగవన్! మాయందు దయయుంచి ఇట్టి ఘోరచరమకష్టం రాకమునుపే నీవు జ్ఞానరూపుడవై వెలిగి మాలోని కల్మషములను తొలగించి ప్రసన్నుడవు కమ్ము.

**విశేషములు-వివరములు :**

1) **యావద్ వ్యుత్థితాః మరణావసానాం దుర్దశాం నాప్నుమః** - అని వ్యాఖ్య. వ్యుత్థానం అంటే వివిధముగా విషయముల మీదికి వికల్పములతో పోవటం. అది మరణానికి దారి తీస్తుంది. జ్ఞానానికి మోక్షానికి నడపదు.

3) నక్తందినములు అంటే ప్రతిరోజూ ఉండే జ్ఞానాజ్ఞానదశలు. లోకదృష్టి జ్ఞానదృష్టి.

**శ్లో॥ ఆసంసారోపచితసదసత్కర్మబంధాశ్రితానా-**
**మాధివ్యాధిప్రజననమరణక్షుత్పిపాసార్దితానామ్।**
**మిథ్యాజ్ఞానప్రబలతమసా నాథ! చాన్ధీకృతానాం**
**త్వం నస్త్రాతా భవ కరుణయా యత్రతత్రస్థితానామ్॥ 38**

**ప్రతిపదార్థము :** నాథ=ప్రభూ!, ఆ సంసార=సంసారాదినుండి, ఉపచిత=ప్రోగయిన, సదసత్=మంచిచెడు/పుణ్యపాప, కర్మ=కర్మలవలన ఏర్పడిన, బంధ=బంధములచే, ఆశ్రితానామ్=ఆశ్రయింపబడినవారము, ఆధి=మానసికరోగములు, వ్యాధి=శారీరక రోగములు, ప్రజన=జననము, మరణ=చావు, క్షుత్పిపాసా=ఆకలిదప్పికలచేత, అర్దితానామ్ =పీడింపబడినవారమును, మిథ్యాజ్ఞాన=తప్పుడు జ్ఞానమువలన, ప్రబల=బలిసిన, తమసా=అజ్ఞానముచేత/ కామక్రోధాదులచేత, అంధీకృతానాం చ=గుడ్డిగా చేయబడిన వారమున్ను, యత్రతత్ర=ఎక్కడో అక్కడ, స్థితానామ్=ఉన్నవారమున్ను అయిన, నః=మాకు, త్వమ్=నీవు, కరుణయా=దయతో, త్రాతా=రక్షకుడవు, భవ=కమ్ము.

**తాత్పర్యము :** నాథా! సృష్టి-ఆదినుండి ఏర్పడుచున్న రకరకాల పాపపుణ్య కర్మబంధాల సాలెగూటిలో ఇరుక్కొని మానసిక శారీరక క్లేశములతోను, జన్మమరణాలతోను, ఆకలి దప్పికలతోను, పనికిమాలిన జ్ఞానాభాసాలతో వచ్చిన రకరకాల అజ్ఞానాలతో అంధులమయి బాధపడుచున్న మమ్ము ఏ దేశంలో, ఏ కాలంలో ఏ దశలో ఉన్నా రక్షింపుము.

**విశేషములు-వివరములు :**

1) యత్రతత్ర=దేశకాల-అవస్థా భేదాలలో.

2) ప్రజన=అంటే 'ఋతుకాలం' అనియు అర్థము గలదు.

**శ్లో॥ సత్యాసత్యస్ఖలితవచసాం శౌచలజ్జోజ్ఝితానా-**
**మజ్ఞానానామఫలసఫలప్రార్థనాకాతరాణామ్।**
**సర్వావస్థాస్వఖిలవిషయాభ్యస్తకౌతూహలానాం**
**త్వం నస్త్రాతా భవ పితృతయా, భోగలోలార్భకాణామ్॥ 39**

**ప్రతిపదార్థము :** సత్య=సత్యమున్ను, అసత్య=అసత్యమున్ను అయి, స్ఖలిత=తొట్రుపడిన, వచసామ్=వాక్యములుగలవారము, శౌచ=మానసిక, శారీరక శుభ్రతలచే, లజ్జా=కర్తవ్యా కర్తవ్య విచక్షణచే, ఉజ్ఝితానామ్=విడువబడినవారమును, అజ్ఞానానామ్= జ్ఞానరహితులము, అఫల=విఫలమయిన, సఫల=సఫలమయిన, ప్రార్థనా=కోరికలచే, కాతరాణామ్=నిలుకడ లేనివారమును, అఖిలవిషయ=సర్వవిషయములందు, అభ్యస్త= అలవాటయిన, కౌతూహలానామ్=కుతూహలం(గుల) గలవారమును, భోగలోల= భోగచంచలులమయిన, అర్భకాణామ్=నీ పిల్లలమయిన, నః=మాకు, పితృతయా=తండ్రివి కనుక, సర్వావస్థాసు=సకల దశలయందు, త్వమ్=నీవు, త్రాతా=రక్షకుడవు, భవ=కమ్ము.



సర్వపూరకం. **సౌరపాఠం** గూడా **"సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ"**-అని సూర్యుని జగదాత్మ గానే చెప్పినది. మఱియు సర్వస్వరూపంగా ఆయనను చెప్పింది.

**"హంసశ్శుచిషద్వసురంతరిక్షసత్ హోతా వేదిషదతిథిర్దురోణసత్ నృషద్వరసదృతసత్, వ్యోమసదబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతమ్ బృహత్"**

ఈ మంత్రానికి వ్యాఖ్యగా **శ్రీ ఈశ్వరసత్యనారాయణశర్మగారు** (శ్రీకాకుళం) వ్రాసిన సీసపద్యం ఉదహరిస్తాను.

గమనస్వభావుడై కాయునీ సూర్యుడే తనుకునట్టి ద్యులోకమున వసించు
వింటసమీరుడౌ వేల్మలన్ సురల నాహ్వానించు మఱి వైదికాగ్నియగును.
అతిథివలెంబూజ్యుడౌను పాకాది సాధన లౌకికాగ్నియై తనరుచుండు
చైతన్యరూపియై జనములలో నుండు సద్బింబమున నుండు సత్యమందు
నుండు, నభమున మెఱపించు నుదకములను,
బడబయైయుండు రశ్ములబ్రబలియుండు
ఆతడింద్రాదులటు చాటునందునిలడు
ప్రాగ్గిరినిదోచు బ్రహ్మతత్త్వంబతండె" - **అంతేగాక, సమస్త దేవతలు సృష్టికర్త యొక్క సృష్టిలోభాగం. అయినా వీరిలో ఆ సృష్టికర్తమహిమ నిండి నిబిడీభూతమైనది. అందువలన మనం మనగురువుల రచనలను గౌరవించినట్లు సృష్టికర్త శిల్పాలయిన గురువులను ప్రవక్తలను ఆదరించినట్లు దర్గాలను దర్శించినట్లు, సమాధులను సన్మానించినట్లు సృష్టికర్త సృష్టిశిల్పాలయిన సూర్యచంద్రాదులను సృష్టికర్త వైభవ నిలయములుగా గౌరవించటం కర్తవ్యమే గాని అపరాధంగానే కాదు.**

దేహగత సర్వవిషయాలు ఆదిత్యుడే అని చెప్పింది సూర్యోపనిషత్.

**ఆదిత్యోంతః కరణమనోబుద్ధి చిత్తాహంకారాః, ఆదిత్యోవై వ్యానః, సమానోదానా పానః ప్రాణః......॥**

అంతేగాక సమస్త సృష్టి ఆదిత్యమూలకమని చెప్పింది.

**"సూర్యాద్వైఖల్విమాని భూతాని జాయంతే॥"**

ఇదంతా సమన్వయం కావాలంటే ఆదిత్యుణ్ణి భౌతిక సూర్యమండలంగా గ్రహిస్తే కుదరదు. కనుక "చిత్సూర్యుడు"గా గ్రహించాలి. అపుడే "సౌరం" ముక్తిదాయకం అవుతుంది. అనగా సూర్యుడు సృష్టిశిల్పంగా కాక సృష్టికర్తకు ప్రత్యక్షరూపంగా గ్రహించాలి. అదే శ్రుతి చెప్పినది.

**త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి**
**త్వమేవ ప్రత్యక్షం విష్ణురసి**
**త్వమేవ ప్రత్యక్షం రుద్రోసి॥** - సూర్యోపనిషత్.

ఇదే భావనతో మన **కృష్ణపుత్రుడు సాంబుడు** అంతస్సూర్యబహిస్సూర్యులను

ధ్యానిస్తూ భుక్తిముక్తిప్రదాయకమయిన యీ **'సాంబపంచాశిక'** అను స్తోత్రాన్ని రచించాడు. ఇదొక ఆదిత్యహృదయం. ఈ సూర్యోపాసకులలో ప్రథముడు **ఆంజనేయుడు**. శిష్యుడు గూడా ఆయనయే. సూర్యపుత్రుడయిన **సుగ్రీవుని** కొలిచినవాడు. తరువాత సూర్యమండల నిష్ఠుడయిన అనగా సూర్యవంశీయుడయిన నారాయణుని అనగా రాముని చేరుకొన్నాడు. తర్వాత సూర్యతేజస్సును గాయత్రీగా మలచినవాడు **'విశ్వామిత్రుడు'**. **అగస్త్యుడు** రామచంద్రుడు సూర్యోపాసకులు. **ధర్మరాజు** సూర్యోపాసనతో అక్షయపాత్రను పొందినవాడు. ద్వాపరంలో మన **సాంబుడు.** ఇతడు తన మంత్రతంత్రోపాసనా జ్ఞానకాండల అంతస్సారమంతటిని అంతర్లీనంగా ప్రతిక్షేపించినాడు. సర్వవ్యాప్తమయిన బ్రహ్మాము జ్ఞానసూర్యుడుగాను (చిత్సూర్యుడు) బహిర్వ్యాప్తమయిన సూర్యమండలమును బ్రహ్మరూపంగాను, అంతర్వ్యాప్తుడయిన చిచ్చక్రేశ్వరుని, చిన్మూర్తిని అంతర్గతసూర్యునిగాను వర్ణించినాడు. ఈ స్తోత్రంవలన ఉపనిషత్తులను, ఆదిత్యహృదయాన్ని, సౌరపాఠాన్ని, మంత్ర–ముఖ్యంగా తంత్రగ్రంథాలను చదివిన ఒక 'జ్ఞానం' లభిస్తుంది. ఈ మొత్తం విషయాలను నా బుద్ధికి సాధ్యమయినంతవఱకు వివరించాను. నా యీ వ్యాఖ్యకు పేరు **"మయూఖమాలిని"**. ఇది **"మిత్రస్య చర్షణీ"**యే. దీనిని **"మిత్రోదాధార".** నా యీ కృతిసారం **"సత్యాయ హవ్యం ఘృతవద్విధేమ"** ఆయనయే నన్ను **"శిక్షతివ్రతే"**. నా **మయూఖమాలిని**కి అవసరమయిన ఉప్పందించిన వివృతికర్త క్షేమరాజునకు, అభినవగుప్తమహేశ్వరునకు, తంత్రసార, కామకలాతంత్ర, షట్చక్రనిరూపణ, చక్రకౌముది, శాక్తదర్శన, శైవదర్శనకర్తలకు కృతజ్ఞతలు. ఇది నాచే వ్రాయించిన స్వామి **శ్రీశ్రీశ్రీ అరుళానందసరస్వతి**కి, **శ్రీ రావిమోహనరావు**గార్కి ధన్యవాదములు.

**జగన్నాథాత్మజస్సాంబః**
**సాంబపంచాశికాం వ్యధాత్**
**మయూఖమాలినీం టీకాం**
**జగన్నాథాత్మజోప్యహమ్॥**



ఇట్లు

మేళ్ళచెర్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి
విశ్రాంత సంస్కృతాధ్యాపకుడు



**సూచ్యార్థసూచనం ముద్రా ప్రకృతార్థ పరైః పదైః. – చంద్రా.**

2) అజ్ఞానం/ చీకటి అంటే 'పరబ్రహ్మముతో/ చిదర్కునితో 'అభేదం' తెలియకపోవటం. అనగా స్వస్వరూపాజ్ఞానం.

3) పద్మిని–పద్మములు గలది. తామర తీగె. శరీరములో సుషుమ్నానాడి. దానిలో '6' పద్మములు ఉంటాయని యోగశాస్త్రం.

**శ్లో॥ యేన గ్రాసీకృతమివ జగత్ సర్వమాసీత్తదస్తం**
**ధ్వాన్తం నీత్వా పునరపి విభో! తద్దయాఘ్రాతచిత్తః।**
**ధత్సే నక్తందినమపి గతీ శుక్లకృష్ణే విభజ్య**
**త్రాతా తస్మాద్భవ పరిభవే దుష్కృతే మేఽపి భానో॥ 37**

**ప్రతిపదార్థము :** విభో!=సర్వవ్యాపీ!, భానో!=సూర్యనారాయణా! చిదర్కా!, యేన=ఏ అజ్ఞానం చేత/చీకటిచేత, సర్వం=సమస్తమయిన, జగత్=ప్రపంచము, గ్రాసీకృతమివ= మ్రింగివేయ బడినదిగా, ఆసీత్=అయ్యెనో, తత్=ఆ, ధ్వాన్తం=అజ్ఞానమును/చీకటిని, అస్తంనీత్వా=అస్తమింపజేసి, పునరపి=మరల, తత్=ఆ అజ్ఞానముపై/చీకటిపై, దయా =దయచేత, ఘ్రాత= స్పృశింపబడిన, చిత్తః=మనస్సుగలవాడవై, శుక్ల=జ్యోతిరూపమయిన/ శుక్లపక్షమయిన, కృష్ణే=ధూమరూపమయిన/కృష్ణపక్షమయిన, గతీ=మార్గములను, నక్తందినమపి=రాత్రి, పగలును, విభజ్య=పంచి (ఇచ్చి), ధత్సే=పోషించుచుంటివి. తస్మాత్=దుష్టులందును అంత దయగలవాడవగుట వలన, మేఽపి=నాకుగూడ, దుష్కృతే=దుష్టమయిన, పరిభవే= సంసారక్లేశమునందు, త్రాతా=రక్షకుడవు, భవ=కమ్ము!

**తాత్పర్యము :** ప్రభూ! చిదాదిత్యా! ప్రపంచమంతటిని ఆక్రమించిన చీకటిని నిర్మూలించిన బాహ్యసూర్యుడు తరువాత దానిమీద జాలితలచి నెలకు 15రోజులు కృష్ణపక్షంగా, అట్లే ప్రతిరోజు రాత్రిని, చీకటికి కేటాయించి పోషించినట్లు, నీవు అంతస్సూర్యుడవై ప్రపంచము నంతటిని ఆక్రమించిన అజ్ఞానమును నిర్మూలించితివి. కాని మఱల దానిమీద గూడా దయతలచి జ్యోతిర్మార్గముతో బాటు సంసారపరమయిన తమోమయమగు ధూమ మార్గమును సృజించితివి. అది చాలదని జ్ఞాన–అజ్ఞానస్థితులను గూడా పంచి యిచ్చితివి. ప్రపంచ ప్రతీపమయిన 'తమోద్వయం' మీద గూడా ఇలా దయతలచిన నీవు నావంటి ముముక్షువు మీద దయతలచి నిర్వికల్పసమాధిని ప్రసాదించి సంసారక్లేశపరాభవములను నివారించి రక్షింపుము.

**విశేషములు–వివరములు :**

1) అర్చిరాది మార్గము, దేవయానము అని ముక్తిమార్గము. ధూమమార్గము, పితృయానము మొ॥ పేర్లతో సంసారమార్గము. అజ్ఞానాంతకుడయిన భగవంతుడే సంసారమార్గమునుగూడా సృష్టించెను.

2) వ్యుత్థానం అనగా సంసార వికల్పసమయం–అందులో ప్రాణాపానమార్గరూపంతో భగవంతుడే అజ్ఞానాన్ని పోషిస్తున్నాడు. అంటే ఆయనదే మాయ. ఆయనదే విద్య.

అమృతమయిన పరబ్రహ్మమును చేరు మార్గము. అట్లే ఆ పరబ్రహ్మముయొక్క చిత్కళలను ప్రసరించు నాడిగూడా అదే.

2) చంద్రుని అమృతకళలను దేవతలు పితృదేవతలే కాక నరులుగూడా వెన్నెలరూపంలో ఆస్వాదించటం లోకసిద్ధం. శరీరంలోనూ అంతే.

3) అంభః అంటే లోకసృష్టిహేతువయిన 'అంభస్సు' కావచ్చును. "అంభో మరీచీర్మర-మాపః" అని ఉపనిషత్తు (ఐ. 1. 2). కనుక "అంభః" ఇతి బహిః ప్రసరప్రవృత్తాన్ సర్వవాహాన్ విశసి-అని క్షేమరాజు. సాధారణసూర్యార్థంలో దక్షిణాయనంలో వర్షరూపంగా వస్తాడని అర్థం.

4) వివిధ ఓషధులు అంటే -"స్థావరాది సర్వబాహ్యాభాసము" లని వ్యాఖ్యాత క్షేమరాజు.

5) సుషుమ్నా మార్గేణ అమృతసంక్రమణయుక్త్యా చంద్రత్వమేత్య-?

6) నిరుక్తి-అలంకారం సూర్యుని 'మిత్ర' నామమునకు స్నేహితుడని అర్థము చెప్పబడింది. **"నిరుక్తిర్యోగతో నామ్నాం అన్యార్థత్వప్రకల్పనమ్" -చంద్రా**

**శ్లో॥ మన్దాక్రాన్తే తమసి భవతా నాథ! దోషావసానే**
**నాన్తర్లీనా మమ మతిరియం గాఢనిద్రాం జహాతి।**
**తస్మాదస్తంగమితతమసా పద్మినీవాత్మభాసా**
**సౌరీత్యేషా దినకర! పరం నీయతామాశు బోధమ్॥ 36**

**ప్రతిపదార్థము :** నాథ=ప్రభూ!, భవతా=నీచేత, దోషావసానే=రాగద్వేషాది దోషాంతమున /చీకటి చివఱ, తమసి=అజ్ఞానము/ చీకటి, మంద=కొద్దిగా, ఆక్రాంతే=ఆక్రమింపబడగా, అంతర్లీనా=అంతర్ముఖం అయినను, మమ=నా, మతిః=బుద్ధి, గాఢనిద్రామ్=గాఢమయిన అజ్ఞానమును/ నిద్రను, నజహాతి=వదలుటలేదు. తస్మాత్=కనుక, దినకర!=సూర్యదేవా!, అస్తంగమిత=నిర్మూలింపబడిన, తమసా=అజ్ఞానం/ చీకటిగల, ఆత్మ=నీయొక్క/ ఆత్మసంబంధమయిన, భాసా=కాంతితో, అశు=వెంటనే, పద్మినీవ=తామరతీగవలె సుషుమ్న వలె, సౌరీతి=సూర్యసంబంధమైనదని/దైవి అని, ఏషా=ఈ బుద్ధి, పరమ్=పరమమయిన, బోధమ్=జ్ఞానమును, నీయతామ్=పొందింపబడుగాక!

**తాత్పర్యము :** దేవా! దినకర! మా కామక్రోధాది దోషములు కఱిగిపోతున్నవేళ, నీ జ్ఞానతేజస్సు మా అజ్ఞాన తిమిరాన్ని కొద్దిగా ఆక్రమించిన వేళ గూడా నా బుద్ధి అంతర్ముఖమయినను, ఇంకా తన అజ్ఞానపు చీకటిని వదలలేదు. నా బుద్ధి సౌరి. అనగా సూర్యసంబంధమయినది లేదా సుర=దైవసంపదగలిగినది కనుక సర్వ తిమిరాన్ని నిర్మూలించిన నీ ఆత్మకాంతితో 'పద్మిని'ని/ సుషుమ్నను వికసింపజేసినట్లు నీ కాంతి నా బుద్ధిని వికసింపజేయుగాక!

**విశేషములు-వివరములు :**

1) మందాక్రాంతే-ముద్రాలంకారం. ఈ గ్రంథము అంతా మందాక్రాంతాచ్ఛందంలో ఉంది. ఆ విషయాన్ని 'మందాక్రాంతే' అన్న పదంతో సూచించాడు.

శ్రీః

సాంబమహాకవివిరచిత

# సామ్బపఞ్చాశికా

## వ్యాఖ్య-మయూఖమాలిని

## వ్యాఖ్యాత-శ్రీ మేళ్ళచెర్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

**శ్లో॥ శబ్దార్థత్వవివర్తమానపరమజ్యోతీరుచో గోపతే-**
**రుద్గీథోఽభ్యుదితః పురోఽరుణతయా యస్య త్రయీమణ్డలమ్।**
**భాస్వద్వర్ణపదక్రమేరితతమః సప్తస్వరాశ్వైర్వియత్**
**విద్యాస్యన్దనమున్నయన్నివ నమస్తస్మై పరబ్రహ్మణే॥ 1**

**ప్రతిపదార్థము-1(పరబ్రహ్మ। జ్ఞానసూర్యుని విషయంలో):** గోపతేః=(గో=వాక్కు, కిరణములు) గోపాలుడు, పరాదివాక్కులకు ప్రభువు, మరీచిచక్రమయిన మహోలోకమునకు ప్రభువు-అయినవాడును, శబ్దార్థత్వ=శబ్ద-అర్థరూపంగా, వివర్తమాన=మారుచు, విచిత్రముగా ఉన్న, పరమ=పరస్వరూపమయిన, జ్యోతిః =శాక్తవీర్యసంబంధమయిన, రుచః=కాంతిగల, యస్య=ఏ పరబ్రహ్మయొక్క, పురః=ఎదుట, త్రయీ=వేదత్రయమే, మండలమ్= అధికారపరిధిగా గలదియు, విద్యా=మంత్రాది విద్యలకు, స్యందనమ్=స్థానము, ప్రసవ ప్రసరణ కారణమయినదియు, భాస్వత్=(ఓంకారపు అరుణవర్ణంతో) మెఱయుచున్న, వర్ణపదక్రమ=అక్షరపదాది క్రమముచేత, ఈరిత=నాశనము చేయబడిన/కదలింపబడిన, తమః=అజ్ఞానంగలదియు అగు, వియత్=శరీరంలోని పరాకాశమును, ఆకాశమును, సప్తస్వర=సప్తస్వరములనెడు/ స్వయంగా ప్రకాశించెడు, అశ్వైః=ఏడు గుఱ్ఱములచేత, ఉన్నయన్నివ=పైకి లేపుచున్నట్లు/ చీకటినుండి వెలుగులోనికి తెచ్చుచున్నట్లు (భూమిని లేపు వరాహవృత్తాంతమునకు ఇది సామ్యము) ఆకాశమును అరుణకాంతిమయము చేయుచున్నట్లుగా, అరుణతయా= అరుణవర్ణంగా/అనూరు సమానంగా, ఉద్గీథః=ఓంకారము, అభ్యుదితః=ఉదయించెనో, తస్మై=ఆ, పరబ్రహ్మణే=పరబ్రహ్మకు, నమః=నమస్కారము!

**తాత్పర్యము :** ప్రపంచము 2 రకాలు. శబ్దము-అర్థము. అనగా నాదము-ఇతరవస్తువులు. ఈ '2'గా వివర్తం చెందినది పరబ్రహ్మస్వరూపమే. అది కిరణరూపం, వాగ్రూపం, శక్తిరూపం. పరబ్రహ్మశక్తియే నాదరూపం. సృష్టిప్రారంభమున పరబ్రహ్మమునుంచి "ఓంకారం" ముందు వచ్చిందని సంప్రదాయం. 'అథ' గూడ వచ్చింది. అది కాలరూపం. ఈ నాదం-ఓంకారం-మనలో దిగిన ప్రాణనాదం. అది కాంతిరూపం. తమస్సును చీలుస్తుంది. అదే ఉద్గీథం అనగా ఊర్ధ్వగానరూపమయిన 'ఓం'కారము. అది వర్ణమాలా స్వరూపం. మన శరీరములోని షట్చక్రాలలో వర్ణమాల పంచబడియున్నది. దాని రూపంలోనే వేదాలు, మంత్రతంత్రాది విద్యలు ఉన్నవి. ఇవన్నీ ప్రాణ, మనోమయ, విజ్ఞానమయకోశాలలో ఉంటాయి. వాటిలో లీనమయిన ఈ వేదాది విద్యలకు నిలయమయినది మనలోని సుషుమ్నాకాశము. దానిలో ఈ విద్యలను ఉన్నయనం చేయటానికి వచ్చినది శక్తి ప్రథమస్పందము, విమర్శరూపము అయిన 'పరా'వాక్కు. దాని గుర్రాలు సప్తస్వరాలు. అవి స్వయంగా వెలిగేవి. అనగా ప్రాణాక్షరాలు. హల్లులు ప్రాణ్యక్షరాలు. అవి అచ్చులను (స్వర) ఆధారంగా చేసికొని ప్రవర్తిస్తాయి. ఈ శక్తి ప్రథమస్పందము సృష్టిరాగ పూర్ణము. 'సోకామయత' అన్న శ్రుతివాక్యం వలన అది కామస్వరూపం. కామం-రాగం-అది ఎఱుపు. అందువలన ఆమె ఇచ్ఛాశక్తి-కామేశ్వరి, అరుణ-కరుణ. ఆమె నడిచే వరస అరుణ వర్ణములు, అరుణ పదములు. వీటితో దేహంలోను, ప్రపంచంలోను మన అజ్ఞానాన్ని పరిహరిస్తుంది. ఇట్టి 'ఉద్గీథం' అనే శాక్తవీర్యం ఆ పరబ్రహ్మయందే పాదరూపంగా ఉన్నది. అది సృష్టికామంతో ఆయన ముందర "ఇచ్ఛాశక్తి"గా ఉదయించి జ్ఞానశక్తిగా క్రియాశక్తిగా విజృంభిస్తుంది. ఆ విజృంభణలో ప్రథమారుణరాగోదయం ఏ బ్రహ్మం ముందర జరుగుచున్నదో ఆ బ్రహ్మసూర్యునికి నమస్కారం అని స్తోత్రాదిలో సృష్ట్యాది స్పందాన్ని వర్ణించటమే యీ సాంబప్రథమస్పందము/ప్రథమశ్లోకము.

**ప్రతిపదార్థము-2(బాహ్యసూర్యుడు) :** గోపతేః=కిరణములకు అనగా మరీచి చక్రమునకు అధిపతియు, శబ్దార్థత్వ=శబ్ద-అర్థ స్వరూపంగా, వివర్తమాన=విచిత్రముగా ఉన్న, పరమజ్యోతిః=పరమదీప స్వరూపమైన, రుచః=కాంతులుగల, యస్య=ఏ ఆదిత్యునియొక్క పురః=ముందు, త్రయీమండలమ్=బ్రహ్మవిష్ణుశివులు మొ॥ త్రయమునకు పరిధి అయిన, విద్యా=సకల విద్యలకు, స్యందనమ్=వాహనమయినదియు, భాస్వద్వర్ణ=సూర్యునియొక్క అరుణకాంతిగల, పదక్రమ=పాదములు అనగా కిరణములయొక్క క్రమంచేత, ఈరిత=కదలింపబడిన, తమః=చీకటిగల, వియత్=బాహ్యాకాశమును, సప్తస్వర=సప్తస్వరముల వ్యాప్తిగల, అశ్వైః=గుఱ్ఱములచేత, ఉన్నయన్నివ=చీకటిలో మునిగిన దానిని ఉద్ధరించు చున్నట్లుగా, అరుణతయా=అనూరురూపంగా ఎఱ్ఱగా, ఉద్గీథః=కీర్తి, అభ్యుదితః =ఉదయించెనో, తస్మై=ఆ, పరబ్రహ్మణే=ఆదిత్యరూపపరబ్రహ్మకు, నమః=నమస్కారము.

**తాత్పర్యము :** ప్రపంచంలోని సర్వగ్రహ తేజస్సుకు సూర్యుడు అధిపతి. సర్వసృష్టి ముఖ్యంగా భూలోకంలో సృష్టి అంతా సూర్యకిరణజన్యం. పదాలు, అర్థాలు అన్ని



ఉంచమని కోరిక. చూ॥ **"యథా భవదవమర్శాత్మచమత్కారాధాయి ఏతన్మాగాత్" -** వ్యాఖ్య

3) శమః-శామ్యతి అస్మిన్ విశ్వమితి- దేనియందు ఈ విశ్వము శమించునో ఆ 'లయ'కారి అయిన శివుడే/ సూర్యుడే 'శమః'.

4) 1) తస్యైవతు ప్రసాదేన భక్తిరుత్పద్యతే నృణాం
2) తత్రైతత్ప్రథమం చిహ్నం రుద్రే భక్తిస్సునిశ్చలా
3) దదామి బుద్ధియోగం తం యేన మామనుయాంతి తే
ఇలా భగవద్భక్తి భగవత్ప్రసాద లభ్యమేనని శాస్త్రప్రమాణాలు.
**ఏష హ్యేవైనం సాధు కర్మకారయతి**-అని కౌషీతకం గూడా చెప్తున్నది.

**శ్లో॥ సౌషుమ్ణేన త్వమమృతపథేనైత్య శీతాంశుభావం**
**పుష్ణాస్యగ్రే సురనరపితౄన్ శాన్తభాభిః కలాభిః।**
**పశ్చాదమ్భో విశసి వివిధాశ్చౌషధీస్తద్గతోఽపి**
**ప్రీణాస్యేవం త్రిభువనమతస్తే జగన్మిత్రతార్క!॥ 35**

**ప్రతిపదార్థము :** అర్క=ఓ భాస్కరా!, త్వమ్=నీవు, సౌషుమ్ణేన=సుషుమ్నా సంబంధమయిన/ కాంతిమంతమైన, అమృతపథేన=అమృతమార్గముతో, శీతాంశుభావమ్=చంద్రత్వమును, అపానత్వమును, ఇడా నాడీత్వమును, ఏత్య=పొంది, అగ్రే=ముందుగా, శాంత=చల్లని/ బాహ్యభావములు శమించిన, భాభిః=కాంతులుగల, కలాభిః=అకారాది విసర్గాంతంగా ఉన్న విమర్శశక్తులచేత, సుర=దేవతలను, నర=మనుష్యులను, పితౄన్=పితృదేవతలను, పుష్ణాసి=పోషించుచున్నావు/ నిలుపుచున్నావు. పశ్చాత్=తరువాత, బహిః=బాహ్య లోకమును, విశసి=ప్రవేశించుచున్నావు. వివిధాః=అనేకములయిన, ఓషధీశ్చ= ఓషధులనుగూడా, విశసి=ప్రవేశించుచున్నావు. తద్గతోపి=ఈ ప్రమేయ ప్రపంచము నందుండినను, ఏవమ్=ఈ విధముగా, త్రిభువనమ్=ముల్లోకములను, ప్రీణాసి= సంతోషపెట్టుచున్నావు. అతః=అందు వలన, తే=నీయొక్క, జగన్మిత్రతా= ప్రపంచమునకు మిత్రుడగుట సార్థకమయినది.

**తాత్పర్యము :** ఓ సూర్యదేవా! సుషుమ్న అమృతమార్గము. దానిద్వారా వచ్చిన నీ ప్రాణశక్తి ఇడారూపంగా అపానచంద్రరూపంగా మారి శరీరగతమయి సురనర పితృదేవతలను నీ ప్రశాంత శీతల చంద్రికలద్వారా ఆహ్లాదపఱుచును. తర్వాత సర్వవాహము లయిన జలాదులలోకి ప్రవేశించి వివిధ ఔషధులలోకిన్ని చేరుచున్నావు. అందుండి ఈ లోకత్రయమును పోషించుచున్నావు. కనుక నీవు 'మిత్రుడవు', జగన్మిత్రుడవు.

**విశేషములు-వివరములు :**

1) సుషుమ్ణ=మంచితేజస్సుగల ఆకాశము. శరీరంలో అటువంటి నాడి. అది

4) నందిశిఖాతంత్రం(33) – క్షేమరాజు ఉదహరించినది.

**యదా శివాభిలాషో వై జాయతే చ నృణాం సదా।**
**తదా శివాభిమానాస్తే జాయంతే పరమాణవః॥**
**ముక్తాస్తదైవ తే దీక్షాం।**
**ప్రాప్నువంతి గురోస్తతః॥**

– అనగా మనిషిలో 'శివానురాగం' పుట్టటమే మోక్షహేతువు. వీరు అనగా అణుస్వరూపులయిన యీ జీవులు శివాభిమానులయిన పరమాణువులుగా ముక్తిపొంది గురువువద్ద దీక్ష స్వీకరిస్తారు. ముక్తి అంటే కర్మబంధములనుంచి అని అర్థం. అదేవిధంగా 'అభినవనం' వలన 'సాంబమహాకవిగూడా' శివాభిమానపరమాణువయి పాపపుణ్య విముక్తుడయినట్లు తనను ఈ శ్లోకంలో సమర్పించికొన్నాడు.

**శ్లో॥ సత్యం భూయో జననమరణే త్వత్ప్రపన్నేషు న స్త–**
**స్తత్రాప్యేకం తవ నుతిఫలం జన్మ యాచే తదిత్థమ్।**
**త్రైలోక్యేశశ్శమ ఇవ పరః పుణ్యకాయోప్యయోనిః**
**సంసారాబ్ధౌ ప్లవ ఇవ జగత్తారణాయ స్థిరః స్యామ్॥ 34**

**ప్రతిపదార్థము :** త్వత్ప్రపన్నేషు=నిన్ను పొందినవారియందు, భూయః=మరల, జననమరణే =జన్మమృత్యువులు, నస్తః=ఉండవు. సత్యమ్=నిజమే. తత్రాపి=అట్టి సందర్భము నందయినను, తవ=నీయొక్క, నుతిఫలమ్=స్తుతియే ఫలంగాగల, ఏకం=ఒక, జన్మ=ఈ జన్మను, యాచే=కోరెదను. తదిత్థమ్=ఇదే ప్రకారంగా ఈ దేహమునందే ఉండి, త్రైలోక్య= త్రిలోకములకు అనగా జాగరస్వప్నసుషుప్తులకు, ఈశః=ప్రభువయిన, శమ ఇవ= విశ్వశామకుడయిన శంకరునివలె, పరః=అతీతుడనయి, పుణ్యకాయోపి=పుణ్యశరీరుడ నైనను, అయోనిః=జన్మలేనివాడనై, సంసారాబ్ధౌ=సంసారసముద్రమున, ప్లవ ఇవ=పడవ వలె, జగత్తారణాయ=విశ్వోద్ధరణకు, స్థిరః=స్థిరుడనుగా, స్యామ్=ఉండెదనుగాక!

**తాత్పర్యము :** 'జ్ఞానసూర్య'! నిన్ను అనగా స్వస్వరూపజ్ఞానమును పొందినవారికి జన్మ మరణములు లేవు. నిజమే. అయినా నీ స్తోత్రము చేయుచు నిన్ను పరామర్శించుచు, బ్రతికే ఒక్క జన్మను కోరుచున్నాను. ఎందుకంటే, ఈలాగానే నేను జ్ఞానదీపమునై చైతన్యరూపంతో జాగరణాదిదశాత్రయములోను నిలిచిన చిన్మూర్తివలె పుణ్యకాయుడ నయినను నిత్యచిదానందఘనరూపుడనై ఈ ప్రపంచమునకు 'సంసారసముద్రనావనై' ఉద్ధారకుడుగా స్థిరంగా ఇలా ఉండిపోవలెనని తలచుచున్నాను.

**విశేషములు–వివరములు :**

1) జ్ఞానరూప పరమాదిత్యుని పొందిన వారికి సంసారకారణమయిన సమస్తవాసనలు దహించుటవలన జన్మజరామృత్యువులుండవు.

2) పరంధామ పరామర్శ చమత్కారాన్ని పొందిన ప్రస్తుత చరమజన్మనే స్థిరంగా



సూర్యసంభవములు. అర్థాలు అంటే పదాలకు అర్థాలుగా ఉండే వస్తువులు. వస్తువులన్ని సూర్యసృష్టి. కనుక వాటి నామములు అయిన పదాలు వాటికి మూలమయిన నాదములు ప్రాణములన్ని సూర్యునివలన వచ్చినవే.

**"మిత్రస్య చర్షణీః"** అన్న మంత్రములో సూర్యకిరణములు గోవులుగా చెప్పబడినవి. **"మిత్రో జనాన్యాదయతి"** అన్న మంత్రంలో ప్రజలకు మిత్రుడు పోషకుడు. **"మిత్రో దాధార పృథివీముతద్యాం"** అన్న మంత్రం ప్రకారం మిత్రుడే భూలోక స్వర్గలోకములకు ఆధారం. **"ఆ కృష్ణేన రజసా వర్తమానో నివేశయన్న మృతం మర్త్యం చ, హిరణ్మయేన సవితా రథేనా దేవో యాతి భువనాని పశ్యన్"**–అన్న మంత్రం ప్రకారం ఈ స్తోత్రంలో సూర్యుని "భాస్వద్వర్ణ పదక్రమం, 'అమృత–మృతులకు' సూర్యజ్యోతియే ఆధారం కావటం, ఆయనగారి స్యందనం "భువనాని పశ్యన్" అనడం ద్వారా లోకం చీకటిని చీల్చటం మొ॥నవి వర్ణింపబడినవి. ఈ విధంగా బ్రహ్మవిష్ణుశివాత్మకము సృష్టిస్థితిలయాత్మకము, ఋతుద్వంద్వ త్రయాత్మకము, ప్రణవస్వరూపము అయిన ఆదిత్యమండలము తన కిరణచరణవిన్యాసంతో భువన భవనాంధకారమును చీలుస్తూ చీకటిలో మూసికొని ఉన్న లోకమును ఆదివరాహమువలె వెలుగులోకి ఎత్తి తెచ్చుచున్నది. అట్టి ఆదిత్యరూప పరబ్రహ్మకు నమస్కారము.

**ప్రతిపదార్థము–3 (చిచ్చక్రేశ్వరుడు (అంతస్సూర్యుడు) :** గోపతేః=విచిత్ర వాచ్యవాచక, వ్యంగ్యవ్యంజక స్వరూపంగల, జగత్తుకు పతి అనగా చిచ్చక్రేశ్వరుడును, మరీచి చక్రేశ్వరుడును, శబ్దార్థత్వ=శబ్దములుగా అర్థములుగా, వివర్తమాన=మారుచున్న, పరమజ్యోతిః=శాక్తజ్యోతి/నాదదీపముయొక్క రుచః=కాంతులుగలవాడును అగు, యస్య= ఏ అంతరాదిత్యుడయిన చిచ్చక్రేశ్వరునియొక్క/జ్ఞానసూర్యునియొక్క, పురః=ఎదుట, త్రయీమండలమ్=త్రిమూర్తులు త్రిదశలు, త్రిపుటి, నాడీత్రయం మొ॥ వాటికి పరిధి అయినదియు, వియత్=వ్యాపకమయినదియు అగు, భాస్వద్వర్ణ=అకారాది మంత్రాలతో, పద=బిందువు మొ॥ విశ్రాంతి స్థానాలతోను, క్రమ=అన్వయాది క్రమముతోను, ఈరిత=పోగొట్టబడిన, తమః=అజ్ఞానంగల/'సమనా' వఱకు పాశసమూహం గల, విద్యా= 'ఉన్మనీ' శక్తియొక్క, స్యందనం=రథమును/ సుషుమ్నానాడిలోని ఊర్ధ్వభాగమును, సప్తస్వర= సప్తస్వరయుక్తములయిన మంత్రములు అను, అశ్వైః=వ్యాపనశీలమయిన నాదములచేత, ఉన్నయన్నివ=పైకి ఎత్తుచున్నట్లుగా, అరుణతయా=అరుణవర్ణముగా/ అనూరునిలాగా, ఉద్గీథః=**"శక్తి–అంకురోన్మేష"** రూపమయిన నాదము, అభ్యుదితః=ఉదయించెనో, తస్మై=ఆ, పరబ్రహ్మణే=అంతర్వ్యాపి అయిన జ్ఞానరూపపరబ్రహ్మకు, నమః=నమస్కారము.

**తాత్పర్యము :** మనదేహంలో కాంతిచక్రం ఉంది. అదే జ్ఞానచక్రం. అదే చిచ్చక్రం. అదే సహస్రారం. అచ్చటనుంచి వచ్చే వెలుగు మన శరీరాన్ని నడిపిస్తుంది. మన జ్ఞానాన్ని పుట్టిస్తుంది. అది విద్యారథం. అదే చక్రరాజరథం. అదే శ్రీచక్ర కాంతిపూరం. అది ఉన్మనితో మొదలవుతుంది. **సమన** వరకు పాశజాలం, బంధాలు ఉంటాయి.

సమన అంటే మనస్సుతో గూడిన స్థితి. ఉన్మని అంటే మనస్సుకు పై స్థితి. విద్యాస్యందనం అంటే మంత్రాది విద్యామయిన సహస్రారం. అది వ్యాపకం. శరీరంలో ఉన్న అంతరాత్మ అనబడే అక్షరమాల సహాయంతో సర్వమంత్రాలను అది సచేతనం చేస్తుంది. శరీరవ్యాపిని అయిన ప్రాణశక్తి పరాదివాగ్రూపంతో యోగలక్ష్యమయిన అక్షరసముదాయంతో ఉంటుంది. ఈ మొత్తం సచేతనం చేసేది ప్రణవం. అదే ఉద్గీథం. అదే నాదశక్తి. అదే శక్తియొక్క స్పందం, అంకురోన్మేషం. దాని ప్రథమస్థితి అరుణవర్ణం. మనయందున్న రాగమే ఆ రూపంగా మనలను ఉద్ధరిస్తుంది. చీకటితో కప్పి ఉన్న సుషుమ్నాంతర్గత చిదాకాశమును ఈ శక్తి తన అరుణవర్ణకాంతితో వెలుగులోకి దెస్తుంది. అది వరాహస్వామి భూమిని ఉద్ధరించడం వంటిది. వరాహం అనగా మంచి "పగలు" అని అంతరార్థం. వరాహదంష్ట్ర జ్ఞానాంకురం. సంసార అజ్ఞాన తిమిరంలో కప్పబడి ఉన్న భూలోకాన్ని ఆ అజ్ఞానసాగర తిమిర గర్భమునుండి బయటకు తీసి పైకి ఎత్తిన వరాహదంష్ట్ర యీ నాదశక్తి.

**అవిద్యానామన్తస్తిమిరమిహిరద్వీపనగరీ**
**జడానాం చైతన్యస్తబకమకరన్దస్రుతిఝరీ**
**దరిద్రాణాం చిన్తామణిగుణనికా జన్మజలధౌ**
**నిమగ్నానాం దంష్ట్రా మురరిపు వరాహస్య భవతీ॥**

– అన్న సౌందర్యలహరీశ్లోకాన్ని ఇచ్చట అనుసంధానం చేయాలి.

కాగా ఈ అంతర్యామి జ్యోతివలన శరీరస్థితవర్ణమాల, మంత్రవిద్యావిజ్ఞానమయ కోశము, వేదమండలము, నాడీత్రయము–అన్ని దీప్తం అవుతాయి. ఆ విధంగా చిచ్చక్రేశ్వరుడై స్వధామంతో సకలదీపకుడైన ఆ పరంధామునకు అంతరాదిత్యునకు నమస్కారము.

***వ్యాఖ్యానవిశేషాలు, ఇతర వివరాలు (3 అర్థాలకు సంబంధించినవి)***

1) బ్రహ్మ–బృహిధాతువు. వ్యాప్తి అర్థం. వ్యాపి, విభువు.

2) నమః అంటే దేహాదులయందున్న ప్రమాత అనగా నేను మొ॥ అహంకార మమకారములను పరిహరించి 'అహం'ను పరమబ్రహ్మమునందు సమరసం చేయటం.

3) ఉద్గీథం–అంటే ఊర్ధ్వగతిలో గానం చేయబడేది. దీని మహిమ గూర్చి ఛాందోగ్యంలో చూడాలి. ఇందులో ఇది ప్రథమనాదరూపం. ప్రథమస్పందం. శక్తిస్పందం.

4) త్రయి అంటే దేవతాగానరూపమయిన సామం, స్తోత్రరూపమయిన ఋక్కు, కర్మ బోధకమయిన యజుస్సు. అదే మండలం. సర్వసిద్ధాంతాలు సర్వమంత్రాలు ఇందులోకి వచ్చి చేరును. ఇది గాక, సృష్టిలోని త్రయములు అన్ని ఇందులోనికి వచ్చును. ప్రణవం అన్ని రకాల త్రయాలకు సంకేతం. త్రిలోకములు, త్రిమూర్తులు, సృష్టిస్థితిలయాలు, త్రిపుటి మొ॥వి.



**ప్రతిపదార్థము :** త్వత్=నీయొక్క, అభినవనాత్=అభిముఖంగా చేసిన స్తుతివలన, మే=నాయొక్క, సంకల్ప=స్థూలేచ్ఛ, ఇచ్ఛా=సంకల్పకారణమయిన సూక్ష్మేచ్ఛ, ఆది=మొదలగు ప్రయత్నములు, అఖిలకరణ=సమస్త సాధనములు లేదా ఇంద్రియములు, ప్రాణ=వీటితో కల్సి ఉండే ప్రాణములు, వాణ్యః=వీటితో సహా సూక్ష్మ పరామర్శగా ఉండే నాదము–ఇవన్నియు, వరేణ్యాః=పరానుగ్రహసాధకములుగా, సంపన్నాః=అయినవి. ఇదమ్=ఈ, జన్మచ=ప్రస్తుత జన్మగూడా, శరణ్యమ్='శరణు' ఇవ్వదగినదిగా, సంపన్నం= అయినది. తత్=ఆ, పుణ్యపాప=సంచిత ఆగాములయిన పుణ్యపాపముల యొక్క, ద్వయమ్=జంట, శనైః=మెల్లగా, అస్తం జిగమిషు=అస్తమించుచున్నది అని, మన్యేచ= అనుకొందును. అన్యథా=అలా సంచిత ఆగాములు నశించకపోతే, తవ=నీ, చరణయోః =పాదములయందు, భక్తిశ్రద్ధే=భక్తిశ్రద్ధలు, నో భవేతామ్=కలగవు.

**తాత్పర్యము :** దేవా! నీకు అభిముఖుడనై నేను చేయుచున్న యీ స్తోత్రం వలన నా సంకల్పము, నా ఇచ్ఛ, నా ప్రయత్నము, నా ఇంద్రియాది కరణసముదాయము ప్రాణములు, నాదము/వాక్కులు అన్నియు వరగ్రహణయోగ్యమయినవి. ప్రస్తుత జన్మకూడా వరదానయోగ్యమయినది. ఈ మహిమలను బట్టి ఈ యోగ్యతలనుబట్టి నా పుణ్య పాపములు ధ్వంసమయిపోతున్నాయని, మంచులా కరిగిపోతున్నాయని భావించుచున్నాను. అలాకాక నా పాపపుణ్యములు అలానే ఉంటే నాకు భగవచ్చరణముల మీద ఇంతటి భక్తిశ్రద్ధలు కలుగనేరవు. మోక్షానికి సంసిద్ధుడను కాలేను. పుణ్యం మిగిలినా మోక్షానికి అర్హత రాదన్నది శాస్త్రనియమం. ఎందుకంటే పుణ్యఫలం అనుభవించటానికి మఱల శరీరం దాల్చవలసిన అవసరం ఉంటుంది.

**విశేషములు–వివరములు :**

1) అలంకారము=ఇది కావ్యలింగము. ఇందులో తన సంచితాగామికర్మలు నశించినవన్న విషయానికి సమర్థనగా భక్తిశ్రద్ధలు కలగటాన్ని చూపటం జరిగింది.

2) అభినవనం– అంటే క్షేమరాజు 'వివృతి' ఇది. చిదాత్మత్వదాభిముఖ్య ప్రవృత్తత్వ పరామర్శాత్మ స్తుతి వశాత్" అని. అనగా జ్ఞానరూపుడయిన భగవంతునికి అభిముఖముగా చేయు పరామర్శ అనగా శ్రవణమనన, ధ్యానోపాసనాదులు–అవే స్తోత్రాలు. స్తోత్రం గూడా 'మననం'లో భాగమే. కనుక "స్వస్వరూపానుసంధానమే" స్తోత్రం. అదే 'అభినవనం' అని పిండితార్థము.

3) ఇచ్ఛా=సంకల్పకారణభూతా సూక్ష్మవికల్పపరామర్శాత్మా.
వాణీ=సర్వత్రాత్ర సూక్ష్మపరామర్శరూపతయా వ్యాపకత్వేన స్థితా
వరేణ్యాః=వరణే పరానుగ్రహే సాధవః
శరణ్యం=శరణే సాధు అనుగ్రాహ్యానుగ్రహైకపరం

*–ఇది వ్యాఖ్యానంలో క్షేమరాజోక్తవివరణం.*

**ప్రతిపదార్థము :** భగవన్=సూర్యనారాయణా!, విశ్వహేతోః=ప్రపంచకారణ బీజమయిన, తే=నీయొక్క, వపుషి=స్వరూపమునందు (చిద్రూపం), నియతమ్=ధ్రువముగా, సర్వే=సమస్తమయిన, లోకాః=లోకములు, స్థితాః=ఉండిరి. తేషామ్=ఆ లోకములయొక్క, ఏకైకస్మిన్=ప్రత్యేకమయిన, వపుషి=శరీరమునందు, త్వం=నీవు, నియతం=తప్పక, స్థితః=ఉన్నావు. విశ్వహేతోః=ప్రపంచకారణంగా, యుగపత్=ఏకకాలములోనే, అగుణః=గుణరహితుడవయిన నీవు, గుణీవ=గుణసహితునివలె భాసించుచున్నావు. భవతి=నీవు, ఇత్థంభూతే=ప్రపంచ జీవులయందు ఓతప్రోతముగా నుండగా, అస్మి=నేను, త్వదన్యః=నీకన్న భిన్నమయినవాడను, న=కాను, సత్యమ్=నిజము. కింతు=కాని, త్వం=నీవు, జ్ఞః=సర్వజ్ఞుడవు. పరమపురుషః=పూర్ణపురుషుడవు, అహం చ=నేనయితే, ప్రకృత్యైవ=స్వభావముచేతనే, అజ్ఞః=అజ్ఞానిని.

**తాత్పర్యము :** భగవన్! పరమానందస్వరూపా! చిద్రూపా! స్వాతంత్ర్యశక్తి స్వరూపమయిన 'పరావాక్కు'తో కల్పిన పరంధామా! నీవు విశ్వకారణుడవు. కనుక తప్పక 'మట్టిలో కుండ ఉన్నట్లు' ఈ లోకములు అనగా దృశ్యపదార్థములు, ద్రష్టలయిన రుద్రాదిక్షేత్రజ్ఞులు, ప్రమాతలయిన మావంటి జీవులు నీ చిదానంద ఘనమయిన శరీరంలో ఉన్నారు. అట్లే 'ప్రతికుండలో మట్టి' ఉన్నట్లు ఈ లోక శరీరమునందు నీవున్ను తప్పక ఉన్నావు. నీ సత్త లేనిదే వీటికి సత్త, ప్రకాశము–2 లేవు. నిర్గుణుడవయిన నీవు విశ్వకారణముగా విశ్వముగా ఆభాసించటంవలన సగుణుడవుగా కనబడుచున్నావు. ప్రపంచమే లేని స్థితిలో నీవు సచ్చిదానందాది గుణములు గూడా లేనివాడవు. విశ్వదశలో సగుణుడవుగా కనబడటం మా దృష్టివలన ఏర్పడినది. ఈ స్థితిలో 'నేను' అంటూ ఏ దశలోనూ విడిగా లేను. కనుక నేనే నీవు. నీవే నేను. అయినా దేవా! నీవు సర్వజ్ఞుడవు. పరమపురుషుడవు. నేను స్వభావరీత్యా (ప్రకృతి–మాయవలన) అజ్ఞుడను. ఈ విధంగా చెప్పటంవలన సూచన ఏమంటే,

మాయందు దేహాది–అభిమానమును అజ్ఞానమును, తొలగించి నిత్యం స్వాత్మ సామరస్యం చేకూర్చి మా "చిత్స్వరూపజ్ఞానమును" గలిగించి నన్నుద్ధరింపుము అని.

**విశేషములు–వివరములు :**

1) లోకాః=లోకములు, లోకయితలు అని '2' అర్థాలు. కర్మార్థం, కర్త్రర్థంలో ఘఞ్ ప్రత్యయం అనుకొంటే దృశ్యం, ద్రష్టలయిన జీవులు అని అర్థం వస్తుంది. జడమయిన /ప్రమేయమయిన/దృశ్యమయిన ప్రపంచం దేహపదార్థాదికం. ద్రష్టలు–జీవులు. చేతనులు ప్రమాతలు.

2) ప్రకృతి–అంటే స్వభావం, భగవంతుని మాయ అని అర్థము.

**శ్లో॥ సంకల్పేచ్ఛాద్యఖిలకరణప్రాణవాణ్యో వరేణ్యాః**
**సంపన్నా మే త్వదభినవనాజ్ఞన్మ చేదం శరణ్యమ్।**
**మన్యే చాస్తం జిగమిషు శనైః పుణ్యపాపద్వయం తత్**
**భక్తిశ్రద్ధే తవ చరణయోరన్యథా నో భవేతామ్॥ 33**



5) అరుణుడు/ అరుణవర్ణము. బ్రహ్మమునుండి పాదరూపమయిన మాయాశక్తియొక్క విమర్శరూపస్పందము సృష్టికామరూపం. అది సిందూరారుణం, కుంకుమతామ్రం, కురువిందసమప్రభం. దానినే **"సంవిత్స్వరూపబిసకందలకందరూపా"** అన్నది మహావిద్య. **"అరుణాం కరుణాతరంగితాక్షీం"** అన్నారు పెద్దలు. **అరుణకిరణజాలైరం జితాశావకాశా** అన్నది మంత్రధ్యానం. దుంపలనుంచి పిలకలు వచ్చేటపుడు ఆ పిలకల మొలక రక్తవర్ణంగా ఉంటుంది. ముఖ్యంగా "కందదుంప" విషయం అంతే. కందదుంప పరబ్రహ్మకు సంకేతం. దానినుంచి వచ్చే పిలక మాయాశక్తికి సంకేతం. అది ఎఱుపు. అందుకే గౌరీ పూజలో వధువుచేత పిలకలున్న కందదుంపకు పూజ చేయిస్తారు. అది రాబోయే సంసారానికి సంతానసృష్టికి గుర్తు. ఆ కందలోని చైతన్యం గూడా పరమాత్మయే. పిలక రావటం చైతన్యసంకల్పం. పిలక శక్తిస్పందం. అది అరుణం.

6) తమస్సును చీల్చటం అంటే– అజ్ఞానమును, బయట చీకటిని తొలగించి సర్వాన్ని జ్ఞానమయం, కాంతిమయం చేయటం. ఉచ్చారణవలన పదార్థ, వాక్యార్థములవలన వచ్చిన వ్యష్టిజ్ఞానాన్ని సమష్టి జ్ఞానమయిన పరమాత్మలో లీనం చేయటం. సమనాశక్తి వఱకు పాశజాలం, బంధవలయం, సంసారబంధం–తమస్సు. దానిని ఉన్మనీశక్తియొక్క కాంతిరేఖలతో చీల్చడం జరగాలి.

7) స్వరములు– అనగా స్వయంగా ప్రకాశించేవి. అచ్చులు. హల్లులకు ఇవి ఆధారం. అచ్చులకు ఆధారం అవసరం లేదు. ఇవి సంగీతరీత్యా '7' –'సరిగమపదని', అలానే **అఇఉఋఌఒంః** ఇవి సప్తస్వరాలు. మిగిలిన అచ్చులు సంయోగవర్ణములు. అచ్చులు స్వరాలు పశ్యంతి మొదలుకొని చివఱకు వైఖరిగా షడ్జాదిస్వరరూపంగా ప్రకాశించుతాయి.

8) అశ్వము –అశూ–వ్యాప్తి అర్థం. ఆశువుగా వ్యాపించేవి కనుక అచ్చులు అశ్వాలు.

9) గోపతి–గోవులు అంటే కిరణాలు, వాక్కులు, కళ్లు–ఇలా చాలా అర్థాలున్నాయి. సూర్యకిరణాలను "మిత్రస్య చర్షణీః" అని ధేనువులుగానూ శ్రుతులు చెప్పినాయి. ఇది శరీరంలో, ఖగోళంలో కిరణరూపంగా మహాలోకంగాను, గోలోకంగానూ ఉన్నవి.

**"యత్ర గావో భూరి శృంగా అయాసః"** అని ఖగోళ విష్ణులోకవర్ణన. హృదయప్రాంతం మహాలోకం. అది కృష్ణస్థానం. వాక్కులు అనుకొంటే ప్రణవం మొ॥ నాదములు ఎవని నుంచి వచ్చినాయో ఆ పరబ్రహ్మము.

10) జ్ఞానశక్తియే సూర్యరూపం దాల్చినదని ఆమ్నాయాలు చెప్తున్నాయి.

**"జ్ఞానశక్తిః పరా హ్యేషా తపత్యాదిత్యవిగ్రహా"**–క్షేమరాజు.

కనుక పరబ్రహ్మమే ఆదిత్యరూపం. అందుకే **"అసావాదిత్యో బ్రహ్మేతి"** అని శ్రుతి. భౌతిక సూర్యశక్తి చీకటిని చీల్చి వెలుగునిస్తుంది. మన బుద్ధులను ప్రేరణ చేస్తుంది. "ధియో యో నః ప్రచోదయాత్" అని గదా మంత్రం. పరబ్రహ్మ ప్రతిబింబమయిన సూర్యునికి ముందు వెలుగులీను అనూరుడు/అరుణుడు ప్రణవం వంటివాడు.

11) వివిధ విచిత్ర శబ్దార్థ రూపమయిన జగత్తులో ఉండే ఈశ్వరుడు "చిచ్ఛక్రేశ్వరుడు" అన్నాడు వ్యాఖ్యాత క్షేమరాజు. అతనినుంచి వచ్చిన శక్త్యంకురపు మొలక "ఉద్గీథము".

12) విద్య అంటే ఉన్మనాశక్తి. దాని లక్షణం **"వేదనానాదిధర్మస్య-పరమాత్మత్వబోధనా"** కనుక అదే "జ్ఞానశక్తి".

13) అగ్ని-అసలు మూలపదం **'అగ్రి'** అని హరివారి "భారతీనిరుక్తి". 'అగ్రం'గా పూజింపబడేవాడు కనుక అగ్రి-అగ్ని. అయితే 'అగ్ని' అనేది మూలతత్త్వమయిన బ్రహ్మమని, అది లోకత్రయంలో వివిధరూపాలతో ఉందని బృహద్దేవతలో శౌనకముని నిరుక్తి.

**జాతో యదగ్రే భూతానాం అగ్రణీరధ్వరే చ యత్**
**నామ్నా సంనయతే మార్గం స్తుతోఽగ్నిరితి సూరిభిః**

ఇంద్రవరుణవాయురుద్రాది నామములు ఆయా కర్మలను బట్టి 'అగ్ని'కే వచ్చినాయని చెప్పాడు.

14) వియత్ -అంటే ఆకాశం. అవకాశం. సుషుమ్నా సుషిరంలోని 'ఖాళీ' ప్రదేశం.
**"వియత్సమానరూపత్వాత్ ఆకాశాఖ్యం చ తద్భవేత్"**- ఏకాదశరుద్రసంహిత.
**దహరం పుండరీకం, వేశ్మ, దహరేస్మిన్నంతరాకాశః**- ఛాందోగ్యం. ఈ హృదయాకాశమును 'మనస్సు' అనుకొనవచ్చును. దీనిలో '5' ఆకాశాలున్నాయి.

1) నిరాకారమయిన గుణరహితాకాశం/ చిత్తాకాశము.
2) గాఢాంధకారమయిన పరాకాశము.
3) అగ్నిగోళమయిన మహాకాశము.
4) విచిత్రవర్ణమయిన తత్త్వాకాశము.
5) కోటిసూర్యనిభమయిన సూర్యాకాశము. (సీతారామాంజనేయసంవాదం).

ఇంకా హృదయకోశం -అనాహతం
మహదాకాశం-విశుద్ధం.
మహాశూన్యం - బ్రహ్మరంధ్రం
రామాయణంలో హనుమంతుడు ప్రయాణించిన "చారణాచరితే పథి" ఇదే.

పరవ్యోమ అనగా

**ద్వాదశార్ణం లలాటోర్ధ్వం రూపేణార్థావసానకమ్**
**ద్వ్యంగులోర్ధ్వం శిరోదేశం పరం వ్యోమప్రకీర్తితమ్॥**

- స్వచ్ఛందసంగ్రహం.

15) ఉన్మనా-సమనా :

**అకారశ్చ ఉకారశ్చ మకారో బిందురేవ చ**
**అర్ధచంద్రా నిరోధీ చ నాదోనాదాంత ఏవ చ॥**



ద్వారా నీలోకి మఱల ఉపసంహరిస్తున్నావు. "చిదైక్యం"లోకి తెస్తున్నావు. ఈ విధంగా సంసారంయొక్క ఆద్యంతాలలో నీ కిరణలీలామహిమను ప్రదర్శించుచుంటివి.

**శ్లో॥ శ్రిత్వా నిత్యోపచితముచితం బ్రహ్మతేజఃప్రకాశమ్**
**రూపం సర్గస్థితిలయముచా సర్వభూతేషు మధ్యే।**
**అన్తేవాసిష్వివ సుగురుణా యః పరోక్షః ప్రకృత్యా**
**ప్రత్యక్షోఽసౌ జగతి భవతా దర్శితః స్వాత్మనాత్మా॥ 31**

**ప్రతిపదార్థము :** సర్గస్థితిలయముచా=సృష్టి మొ॥ లేని, భవతా=నీచేత, నిత్యోపచితమ్=నిత్య పూర్ణమయినదియు, ఉచితమ్=చిదానంద ఘనమైనదియు, బ్రహ్మ=సర్వవ్యాపి అయినదియు, తేజః=ద్వైతదాహకమయినదియు, అగు, ప్రకాశమ్=వెలుగుగల, రూపమ్= రూపమును, శ్రిత్వా=గ్రహించి, సర్వభూతేషుమధ్యే=సర్వభూతములందు, సుగురుణా=మంచి గురువుచేత, అంతేవాసిష్వివ=శిష్యులయందువలె, ప్రకృత్యా=సహజముగానే, యః=ఏ ఆత్మ, పరోక్షః= ప్రత్యక్షముగాదో, అసౌ=ఆ, ఆత్మా=ఆత్మ, ప్రత్యక్షః=ప్రత్యక్షముగా, స్వాత్మనా=స్వయంగా, దర్శితః=ప్రకటింపబడెను.

**తాత్పర్యము :** భగవన్! ఆత్మ సహజంగా అప్రత్యక్షము. కాని నీవు మాయందు దయతో ఆ ఆత్మను దర్శింపజేశావు. ఎలా అంటే, సృష్టిస్థితిలయరహితుడవయిన నీవు పరిపూర్ణమయిన చిదానంద సంపన్నమయిన సర్వవ్యాపి అయిన జ్ఞానకాంతి జ్వలితమయిన రూపమును స్వీకరించి ''గురువు శిష్యులకు చూపినట్లు'' నీ ఆత్మరూపముతోనే ఆత్మగా మాయందు ప్రత్యక్షమయినావు.

**విశేషములు-వివరములు :**

1) దర్శింపజేయటం, రూపం స్వీకరించటం అంటే దేహాద్యభిమానములను నిమజ్జనం చేయటంద్వారా వస్తురూపం ఉన్మజ్జనం చేయటం-అనగా దృశ్యపదార్థములను నిషేధిస్తే 'దృక్' మిగిలినట్లు మిగలటం-అదే రూపం స్వీకరించటం, దర్శనం ఇవ్వటం.

2) తేజస్సు అని ఎందుకన్నారంటే ద్వైతాన్ని దహిస్తుంది కనుక.

3) భాస్కరుడు లోపల పరమాత్మగా, బయట తేజస్సుగాను, ప్రపంచంగాను 'ఆత్మ'గా ప్రకటించుకొన్నాడు.

4) ప్రత్యక్షః అంటే మామూలు చర్మచక్షువులకు కనబడటం కాదు. జ్ఞానప్రత్యక్షం అనగా అపరోక్షానుభవం అని అర్థం.

**శ్లో॥ లోకాస్సర్వే వపుషి నియతం తే స్థితాస్త్వం చ తేషా-**
**మేకైకస్మిన్ యుగపదగుణో విశ్వహేతోర్గుణీవ।**
**ఇత్థంభూతే భవతి భగవన్న త్వదన్యోఽస్మి సత్యం**
**కిన్తు జ్ఞస్త్వం పరమపురుషోఽహం ప్రకృత్యైవ చాజ్ఞః॥ 32**

విమర్శయుక్తివలన తత్త్వం తెలిసికొని ఆ వెలుగులో మేల్కొందురు. యోగులు ప్రాణాయామాదులతో చిత్తోపశాంతిని పొంది అమనస్కులయి ఒక చీకటివంటి సర్వకర్మాభావదశలో యోగనిద్రలో విశ్రమిస్తారు. ఆ ప్రబుద్ధులు, ఈ నిద్రితులు గూడా, అహోరాత్ర, ప్రాణాపాన రూపమయిన యీ సంసారము అస్తమించిన వేళ ఏర్పడే శివశక్తి సామరస్యసంధ్యావేళలో స్థూలసూర్యకాంతిని భేదించి కరగించి నిర్వాణమను పరమపదమును పొందెదరు.

**విశేషములు-వివరములు :**

1) **యా నిశా సర్వభూతానాం-** అన్నట్లు ఇక్కడ పగలు అంటే జ్ఞానకాంతి సమయం. చీకటి అంటే సర్వవికల్పాలు కనబడక అంతా ప్రపంచమంతా శూన్యమయిన క్షణము. వెరసి '2' స్థితులు ఒకటే. విమర్శతో గాని, అష్టాంగయోగంతోగాని మనస్సు, దాని వికల్పాలు చావగా మిగిలినది తత్త్వాలోకం. పరమభూమికలో విశ్రాంతి. అదే పగలు. ఇదే నిద్ర.

2) అహోరాత్రములు కాలానికి సంసారానికి గుర్తు. సూర్యసంకుచిత భౌతికకాంతికి గుర్తు. ఇవి '2' లేని క్షణము 'సంధ్య' అంటే కలయిక. అది శివశక్తుల కలయిక. శక్తి తన విక్షేపావరణలు వదలి 'శివుని'లో నిమజ్జనం/సమరసం కావటం/లయం కావటం అదే నిర్వాణం.

**శ్లో॥ ఆబ్రహ్మేదం నవమివ జగజ్జఙ్గమస్థావరాన్తం**
**సర్గే సర్గే విసృజసి రవే! గోభిరుద్రిక్తసోమైః।**
**దీప్తైః ప్రత్యాహరసి చ లయే తద్యథాయోని భూయః**
**సర్గాన్తాదౌ ప్రకటవిభవాం దర్శయన్ రశ్మిలీలామ్॥ 30**

**ప్రతిపదార్థము :** రవే=సూర్యదేవా!, ఆ బ్రహ్మ=శాక్తబ్రహ్మదాక (ఆయనను మినహా), జంగమ స్థావర=చరాచరములు, అంతం=భాగములుగా గల, ఇదమ్=ఈ, జగత్=ప్రపంచమును, ఉద్రిక్త=ఉద్రేకించిన, సోమైః=శాక్తామృతముగల, గోభిః=కిరణములతో, సర్గేసర్గే= ప్రతిసృష్టిలో, నవమివ=క్రొత్తదానివలె, సృజసి=సృష్టిచేయుచున్నావు. భూయః =మఱల, లయే=లయ కాలమున, తత్=ఆ సృష్టిని, దీప్తైః=అగ్నిప్రధానములయిన, గోభిః =కిరణములతో, యథాయోని=ఆయా కారణపదార్థాల ప్రకారము (అంటే పంచ భూతములలో భూమిని నీటిలో నీటిని అగ్నిలో ఇలా మొ॥), ప్రత్యాహరసి చ= ఉపసంహరించుచుంటివి. రశ్మిలీలామ్=నీ కిరణ విలాసమహిమను, సర్గాంతాదౌ= సృష్టిలయము లందు, ప్రకట=స్పష్టమయిన, విభవామ్=మహిమగలదానినిగా, దర్శయన్= చూపుచు (అసి=ఉన్నావు).

**తాత్పర్యము :** సర్వచరాచరప్రపంచమును ప్రతిసృష్టి సమయంలోనూ అపానరూప శాక్తామృతభరితమయిన (సోమ) కిరణాలతో క్రొత్తగా సృజించినట్లు చూపుతున్నావు. అలాగే అగ్నిభరితకిరణాలతో ఆ ప్రపంచాన్ని తమతమ కారణ పదార్థాలతో లయించటం



**శక్తిశ్చ వ్యాపినీ చైవ సమనైకాదశీ స్మృతా**
**ఉన్మనా తు తతోతీతా తదతీతం నిరామయమ్॥**

ఇవి ఓంకార కళలు. లేదా ప్రణవభాగాలు. ప్రణవధ్యానంలో ప్రణవం యోగికి సాక్షాత్కరించే స్థితి. ఇందులో అకార, ఉకార, మకార బిందువుల వఱకు మామూలే. ఇక అర్ధచంద్రనుంచి యోగికి భ్రూమధ్యంలో రకరకాల ఆకారాలతో దర్శనమిస్తాయి. అందులో సమన ఉపోత్తమం. ఉన్మనా చివరిది. **వీటి ఆకారాలను నేను "వరివస్యా రహస్యానికి" వ్రాసిన పీఠికలో గ్రహించగలరు.** (సాధనగ్రంథమండలి, తెనాలి వారివద్ద ఆ పుస్తకం దొరకును).

**"ఉన్మనీ చ తదూర్ధ్వే చ యద్గత్వా న నివర్తతే"**-సమ్మోహనతంత్రం.

సమనలో మనస్సు కాస్త సంస్కారరూపంగా ఉంటుంది. "ఉన్మన"లో అదీ ఉండదు. అందుకే దానిద్వారా నిరామయ బ్రహ్మస్థానానికి చేరుతాడు యోగి.

**శ్లో॥ ఓమిత్యన్తర్నదతి నియతం యః ప్రతిప్రాణి శబ్దో**
**వాణీ యస్మాత్ ప్రసరతి పరా శబ్దతన్మాత్రగర్భా।**
**ప్రాణాపానౌ వహతి చ సమౌ యో మిథోగ్రాససక్తౌ**
**దేహస్థం తం సపది పరమాదిత్యమాద్యం ప్రపద్యే॥ 2**

**ప్రతిపదార్థము :** యః=ఏ, శబ్దః=పరానాదము/నాదస్వరూపుడైన ఆదిత్యుడు, ప్రతిప్రాణి=ప్రతి జీవునిలోను, నియతమ్=నియమంగా, అంతః=శరీరాంతమున, ఓమితి="ఓం" అని, నదతి=మ్రోగుచుండునో, శబ్ద=శబ్దములయొక్క, తన్మాత్ర=అణురూపములతో, గర్భా=నిండిన గర్భముగలదై, పరావాణీ=తరువాతదైన "పశ్యంతి", యస్మాత్=ఎవరినుండి, ప్రసరతి= ప్రసరించునో, యశ్చ=ఏ నాదము, మిథః=అన్యోన్యమును, గ్రాస=మ్రింగుట యందు, సక్తౌ=ఆసక్తిగల, సమౌ=సమానభూమికలోనున్న, ప్రాణాపానౌ=ప్రాణాపాన వాయువులను, వహతి=ప్రవహించునో, తమ్=ఆ, దేహస్థం=దేహాంతర్యామియైన, ఆద్యమ్=ఆద్యుడున్ను అయిన, పరమాదిత్యమ్=పరమభాస్కరుని, సపది=వెంటనే, ప్రపద్యే=శరణు వేడెదను.

**తాత్పర్యము :** సామాన్యంగా మొదటిశ్లోకములో పరమార్కుని శ్లాఘించి దీనిలో దేహస్థమయిన మధ్యనాడి / సుషుమ్నానాడిలో వ్యాపించిన అంతరాదిత్యుని శ్లాఘించు చున్నాడు. ప్రతిజీవునిలో ప్రాణనాదరూపంగా ఓంకారంగా ప్రతిధ్వనిస్తున్న "పరావాక్కు" ఆ పరమాదిత్యుని రూపమే. శబ్దతన్మాత్రగర్భంగా ఉన్న "పశ్యంతి" గూడా ఈ పరమాదిత్యుని నుండి ప్రసరించును. అన్యోన్యమును మ్రింగబోవుచు సమాన భూమికలో నున్న ప్రాణాపానములను జాగ్రత్తగా శరీరమున నిర్వహించువాడు ఈ పరమాదిత్యుడే. దేహాంతర్యామి అయిన అనాది అయిన ఆ పరమాదిత్యునికి నమస్కారము.

**విశేషములు, వివరణలు :**

1) పరబ్రహ్మస్వరూపుడైన పరమాదిత్యుడే దేహగత మధ్యనాడిలోనున్న ప్రాణబ్రహ్మ/నాదబ్రహ్మలోనూ ఉన్నాడు. ప్రపంచచిత్రానికి ఆధారకుడ్యం ఆయనయే.

2) మహాప్రణవము. అది సకలశబ్దరాశిని తనయందు ఇమిడ్చికొన్నది. అదే ప్రాణనాద రూపమయిన పరావాక్కు. అది నిత్యప్రవాహి. అది లేనిదే ప్రపంచమే లేదు. ఇది ఆత్మ స్వరూప విమర్శరూపమయిన అణుస్వరూపమయిన నాదము.

3) 'పశ్యంతి' అనునది 'పర'కు పరమయినది. దీనియందు శబ్దములు తన్మాత్ర రూపంగా ఉంటాయి. అకారం నుండి క్షకారంవఱకు ఉన్న అక్షరసామాన్య స్వరూపం అవిభక్తంగా జ్యోతిర్మయంగా ఉంటుంది. అదే **"పశ్యంతి"**.

4) ప్రాణాపానములు ఒకదానితో ఒకటి కలసి ఉంటాయి. ప్రాణం పైకి లాగుతుంటే అపానం క్రిందకు లాగుతుంది అని శ్రుతి. ప్రాణమనే పక్షి ఎగిరిపోకుండా అపానమనే త్రాడు దాని కాలికి సంకెలలాగా ఉంటుంది. **"అపానః కర్షతి ప్రాణం ప్రాణోఽపానం చ కర్షతి"** అని సంప్రదాయం. ప్రాణాపానాలను ఐక్యం చేయటం ద్వారా యోగి ఊర్ధ్వగతిని సాధిస్తాడు. నాభిస్థానంలో/సుషుమ్నలో ప్రాణాపానాలు ఐక్యం అయి పైకి లేవడం ద్వారా జీవులు మరణం పొందుతారు. అదే **'నాభిశ్వాస'** అంటారు. ఈ ప్రాణాపానములను ఉపాసకులు "ఉదానవహ్ని" రూపమయిన ఆ మహాజ్యోతిలో లీనం చేస్తారు. పరమాదిత్యానుభవం పొందుతారు.

5) పరా మొ॥. ఇది మూలవాణి. స్పందరూపం. **పరా వాక్ మూలచక్రస్థా పశ్యంతీ నాభిమధ్యగా మధ్యమా హృదయస్థా చ కంఠస్థా వైఖరీ మతా"** – **చక్రకౌముదీ.**

ఈ 'పరా' మొ॥ వానివలన వచ్చేవి 'ఇచ్ఛ' మొదలయినవి

**"పరాతో జాయతే చేచ్ఛా...., ఇచ్ఛాతో జాయతే జ్ఞానా...**

6) **"అంతశ్చరతి రోచనాస్య ప్రాణాదపానతీ వ్యఖ్యన్మహిషోదివమ్"** – సౌరపాఠం. ఈ శ్లోకంలో ఈ మంత్రభావం కనబడుతున్నది.

7) ప్రాణ మొ॥ వాయువులు.

| | | |
|---|---|---|
| ప్రాణము | – | లోపలికి పీల్చేది–నాభినుంచి కంఠంవఱకు. |
| అపానము | – | బయటకు వదలేది, నెట్టేది–నాభినుంచి కాళ్లదాకా. |
| వ్యానము | – | సర్వశరీరవ్యాపి–ప్రాణాయామం దీని క్రియ. |
| ఉత్క్రమణం | – | ఉత్క్రమణం మొ॥ |
| ఉదానము | – | కంఠంలో ఉండేది |
| సమానము | – | నాభివద్ద ఉండునది–వహ్నితో శరీరవ్యాపి. |
| నాగము | – | వాగ్ద్వారము |
| కూర్మము | – | కంటిరెప్పలు స్థానం |
| కృకరము | – | కన్నులు |



5) ప్రతివానికొక అహోరాత్రం, అందలి ప్రాణచారంలో దాని అంశలలో స్వచ్ఛందతంత్రం చెప్పినట్లు–మానోదయంనుంచి షష్టి, (60సం॥) ఉదయందాకా, యోగి జ్ఞానాన్ని బట్టి పరిమితంగా భగవంతుడు భాసింపజేయును. – వ్యాఖ్యాత క్షేమరాజు.

6) అయితే ఈ కాలకలనలు అన్నీ ఆభాసలే కాని వాస్తవం కాదు. వాస్తవం చిద్రూపం మాత్రమే. అందుకే శ్లోకంలో 'ఇవ' వాడబడింది. చూ॥

**"ఆభాసమానోఽయం కాలో న త్వస్య వాస్తవం కించిత్తత్త్వమస్తి. అత ఏవ కుర్వన్నివేతీవ– శబ్దేనాయమేవార్థః స్పష్టః. వస్తుతో హ్యేతావద్విశ్వోదయావస్థాన విలాపనాద్యాత్మా పరమేశ్వర ఏవేతి స్ఫురతి. న తు చిదేకవపుషః తతోఽతిరిక్తం కిమప్యస్తి"**– వ్యాఖ్యాత.

7) ఇట్లు అహోరాత్రకర్తగా భగవంతుడు ప్రపంచమును 'త్రిప్పుచుండు"నని సూచన.

8) స్వచ్ఛందతంత్రం మొ॥ వానిలో అహోరాత్రవ్యవస్థ ఇలా ఉన్నది.

మానుష్యమానంలో దినరాత్రులు 30 ముహూర్తములు. సంవత్సరానికి 2 అయనాలు. దక్షిణాయనం దేవతలకు పితరులకు ఒకరాత్రి. ఉత్తరాయణం వారికి ఒక పగలు. 4వేల యుగాలు ఒక కల్పం. ఇది బ్రహ్మకు ఒక దినం. ఇలా బ్రహ్మ ఆయువు 100 సంవత్సరాలు. ఇదంతా చిత్సూర్యుడు అనగా పరమాత్మ చేసిన వ్యవస్థయే.

9) బ్రహ్మాదుల కాలప్రమాణాలు వ్యాఖ్యానంలో చెప్పబడినవి. (పీఠిక).

**శ్లో॥ తత్త్వాలోకే తపన! సుదినే యే పరం సంప్రబుద్ధా**
**యే వా చిత్తోపశమరజనీయోగనిద్రాముపేతాః**
**తేఽహోరాత్రోపరమపరమానన్దసంధ్యాసు సౌరం**
**భిత్త్వా జ్యోతిః పరమపరమం యాన్తి నిర్వాణసంజ్ఞమ్॥ 29**

**ప్రతిపదార్థము :** తపన=సూర్యదేవా! మహాప్రకాశ రూపా, యే=ఏ జ్ఞానులు, తత్త్వాలోకే=తత్త్వ జ్ఞానరూపమయిన, సుదినే=మంచిదినమున (జ్ఞానక్షణమున), పరం=మిక్కిలి, సమ్=బాగా అనగా ప్రాణాయామాది శ్రమ లేకుండా విమర్శతో, ప్రబుద్ధాః=జ్ఞానము పొందిరో, భగవంతుని విషయంలో అజ్ఞానం (అఖ్యాతి) అను చీకటినుంచి మేల్కొన్నారో, వా=లేదా, యే=ఏ యోగులు, చిత్తోపశమ=మనోనాశం అనే, రజనీ=చీకటియందు, యోగనిద్రామ్=యోగనిద్రను అనగా నిర్వికల్పమయిన ప్రకాశంతో ఐక్యమును, ఉపేతాః=పొందిరో, తే=వారు ఇరువురున్ను, అహోరాత్ర=ప్రాణాపానరూపమయిన కాలవ్యవస్థయొక్క ఉపరమ=నివృత్తిరూపమయిన, పరమానంద=పరమానందమనెడు, సంధ్యాసు=శివసామరస్య వేళలందు, అపరమమ్=స్థూలమయిన, సౌరమ్=సూర్యసంబంధమయిన, జ్యోతిః=తేజస్సును (సంకుచిత), భిత్త్వా=భేదించి (సంస్కారంగూడా లేకుండా కరగించి), నిర్వాణసంజ్ఞమ్= నిర్వాణమను పేరుగల, పరమ్=అతీతవస్తువును, యాంతి=పొందెదరు.

**తాత్పర్యము :** మహాప్రకాశ స్వరూపా! జ్ఞానులు ప్రాణాయామాది అభ్యాస శ్రమ లేకుండగ,

అల్పమల్పమ్=తక్కువ తక్కువగా, కుర్వన్ కుర్వన్=చేయుచు చేయుచూ, జగత్=ఈ ప్రపంచమును, పంచధా=5 విధాలుగా (జాగర మొ॥) ఆవర్తనాభిః=మార్పులు త్రిప్పుటద్వారా, కలయసి=రక్షించుచున్నావు.

**తాత్పర్యము :** దినం అనగా విశ్వోదయం. అస్తమయం అనగా విశ్వప్రలయం. మేల్కొనటం-విశ్వోదయం. నిద్ర-విశ్వప్రలయం. జననం=విశ్వోదయం. మరణం-విశ్వ ప్రలయం. ఇలా శాస్త్రంలో తంత్రంలో సమాన కక్ష కలవి. దినకరుడు అంటే విశ్వానికి సృష్టి, జీవునకు పుట్టుక, మెలకువ, కాలానికి పగలు-చేసేవాడని అర్థం. అట్టి సూర్యుడు ఒక పెద్ద 'కాలస్వరూపాన్ని' సృష్టించాడు. అది 'అహోరాత్రం' వంటిది. అంటే జనన మరణాలు, సృష్టిప్రళయాలు వంటి దశలు గలది. ఈ కాలమే జగద్బీజము. జగత్తుకు కర్త అయిన మాయలోను, ప్రకృతిలోను, బ్రహ్మకు కార్యమయిన దేవపితృమనుష్యాది జీవులకు ఈ కాలము క్రమముగా అల్ప పరిమాణాలతో అహోరాత్ర, ఉదయాస్తమయ, జననమరణ సృష్టిలయరూపముతో వారివారి స్థాయికి తగినట్లు అంతర్విభాగంతో ఉన్నది. ఈ విధంగా జాగరాది పంచావస్థలతో ఈ ప్రపంచాన్ని మార్చి మార్చి త్రిప్పుచున్నావు. అనగా 1) లోపలున్న ప్రపంచాన్ని బయటకు భాసింపజేయటం, 2) భాసించిన దానిని 'ఇది ఇది, ఇది ఇలా" అని స్థాపించటం 3) దీనిని లోపలకు ఉపసంహరించటం 4) ఉపసంహరించిన దానిని సంస్కారరూపంగా వడియగట్టటం 5) దీనిని ఆత్మాభిన్నంగా దర్శించటం-అను పంచవిధానాలలో పంచదశలతో ప్రపంచాన్ని గమనిస్తున్నావు అని అర్థము.

**విశేషములు-వివరములు :**

1) ప్రపంచం-2 రకాలు. శుద్ధాధ్వం-అశుద్ధాధ్వం.

**అధ్వః- సదాశివాంతంగా శుద్ధాధ్వ.**
**కలాది క్షిత్యంతం అశుద్ధాధ్వ.** చూ॥ పీఠిక.

2) వితత పరార్ధ స్వరూపమయిన కాలము అదే అహోరాత్రం. ఇది జగద్బీజము. ఆరంభావసానములకు ఉదయాపవర్గములకు కారణం. విततం అంటే ప్రాణచారంలో మొదటి ఘడియ పుట్టిన క్షణం నుంచి '60'వ సంవత్సరం పుట్టు వరకు విశాలమయిన కాలము. రోజుకు 60 ఘడియలు కనుక 60 సంవత్సరాలకు ఒక లెక్క చెప్పటం జరిగింది.

3) అశుద్ధాధ్వరూపమయిన జగత్తుకు బీజమయిన అహోరాత్రం మాయాసంబంధి.

4) పంచవిధ -ఆవర్తనం జాగరం మొ॥ దశా పంచకం.

1) జాగరం 2) స్థితి స్థాపన 3) సంహారం 4) సంస్కారపూర్వక విమర్శ 5) అభేదకలన బహుశః జాగ్రత్-2రకాలు-సృష్టి స్థితి. స్వప్నం 2 రకాలు-సంహారం, విమర్శ. సుషుప్తి 1 రకం-అభేదస్థితి. కాగా సర్గ, స్థితి, సంహార, విలాపన, ఆత్మైక్యములు ఇచ్చటి లీలలు.



దేవదత్తము - కంఠద్వారము
ధనంజయము- హృదయము.

నోట్ ః శివగీతలో 9వ అధ్యాయంలో ఈ విషయాలు కొంచెం భిన్నంగా ఉన్నాయి.

**అవః-** మహావ్యాప్తితో పరబ్రహ్మరూపాదిత్యుని, సూక్ష్మవ్యాప్తితో దేహమధ్యగతుడయిన అంతరాదిత్యుని/ చిదర్కుని స్తుతించి ఇపుడు ప్రపంచ వ్యాప్తుడయిన ద్వాదశాత్ముడయిన భాస్కరుని స్తుతించుచున్నాడు.

**శ్లో॥ యస్త్వక్చక్షుఃశ్రవణరసనాఘ్రాణపాణ్యంఘ్రివాణీ-**
**పాయూపస్థస్థితిరపి మనోబుద్ధ్యహఙ్కారమూర్తిః।**
**తిష్ఠత్యన్తర్బహిరపి జగద్భాసయన్ ద్వాదశాత్మా**
**మార్తణ్డం తం సకలకరణాధారమేకం ప్రపద్యే॥ 3**

**ప్రతిపదార్థము :** యః=ఎవడు, త్వక్=చర్మము, చక్షుః=నేత్రములు, శ్రవణ=చెవులు, రసనా= నాలుక, ఘ్రాణ=ముక్కు, పాణి=చేతులు, అంఘ్రి=పాదములు, వాణీ=వాక్కు, పాయు=ముడ్డి, ఉపస్థ=స్త్రీపుంలింగములు-వీనియందు, స్థితిరపి=చైతన్యరూపముగా నుండియు, మనః=మనస్సు, బుద్ధి=బుద్ధి, అహంకార=అహంకారములే, మూర్తిః =శరీరముగా గలవాడై, ద్వాదశాత్మా=పైన చెప్పిన '12' ఇంద్రియాది స్వరూపుడై, అంతః =లోపల, బహిరపి= బయటనూ, జగత్=గ్రాహ్యగ్రాహకరూపము/వేద్యవేదకరూపము అయిన ప్రపంచమును, భాసయన్=తన చైతన్యముతో వెలిగించుచు, తిష్ఠతి=ఉండునో, తమ్=ఆ, సకలకరణ= సకలేంద్రియములకు, ఆధారమ్=అధిష్ఠానము అయిన, ఏకమ్=అఖండాకారుడైన, మార్తండమ్=పరమమార్తండుని, ప్రపద్యే=పొందెదను.

**తాత్పర్యము :** ప్రపంచం 2 రకాలు. 1) వేద్యం-అనగా తెలియబడేది. 2) వేదకం-తెలిసికొనేది. లేదా గ్రాహ్యం గ్రాహకం అనవచ్చును. ఇదే దృక్-దృశ్యం అనవచ్చును. సర్వత్ర వ్యాపించిన చైతన్యమే ఈ '2' విధాలుగా ఉంది. శరీరం లోపల 12 ఇంద్రియాలుగా గ్రాహక/వేదక, దృక్‌గా ఉన్నది. అదే బయట ప్రపంచంలో పదార్థరూపంగా దృశ్యంగా ఉన్నది. లేదా లోపల అహంకారరూపంగా గ్రాహకంగానూ, మిగిలిన చర్మం మొ॥ బుద్ధి వఱకు శ్లోకక్రమంలో ఉన్న 12 కరణాల రూపంగా గ్రాహ్యంగానూ ఉండి, "ద్వాదశాత్మ" అయినవాడు. అట్టి సకలకరణాధారరూపుడైన మార్తండునకు నమస్కారము.

**విశేషములు-వివరణలు:**

1) వేదకం చైతన్యం. వేద్యం-చైతన్యం కాదు. జడం. కనుక బ్రహ్మాండములు, దేహప్రాణాది పిండములు జడములు. మృతప్రాయములు. వీటిని చైతన్యపఱుచువాడు జ్ఞానరూపసూర్యుడు చిచ్చక్రేశ్వరుడు. బాహ్యప్రపంచములో సూర్యుడు. మృతప్రాయ మయిన అండములను సచేతనము చేయువాడు కనుక మార్తండుడు.

2) భగవంతుడు జ్ఞానసూర్యుడు ఒకడే. కాని ప్రపంచవ్యాప్తివలన ప్రమాత మొ॥ ఉపాధి భేదం వలన, ఇంద్రియ (కరణ) భేదంవలన '12' భేదాలున్నట్లు కనబడుతున్నాడు.

3) సర్వేంద్రియస్వరూపం ధరించినా, సృష్టి మొ॥ మరీచి చక్రములలో వైవిధ్యంతో సంచరించుటవలన ద్వాదశాత్మగా కనబడుచున్నాడు. కాలంనుండి వ్యోమకలదాకా ఈ ప్రపంచాన్ని ప్రకాశింపజేస్తున్నవాడు పరబ్రహ్మమే.

4) ఆధారమయిన తనకాంతి వహ్నితో సమస్తకరణాలను వెలిగించి వాటిని ఆశ్రయించి వెలుగువాడు. ఈ జ్ఞానమార్తాండుడు.

| | | |
|---|---|---|
| 5) | అహంకారం | - 1 |
| | బుద్ధి, మనస్సు | - 2 |
| | చర్మ, నేత్ర, కర్ణ, జిహ్వా, నాసిక-జ్ఞానేంద్రియాలు | - 5 |
| | హస్త, పాద, పాయు, లింగ, వాణి-కర్మేంద్రియాలు | - 5 |
| | **మొత్తం** | **- 13** |

**అవః-** ప్రపంచవ్యాప్తివలన అఖిలేంద్రియాధారంగా భగవంతుని స్తుతించి ప్రకాశ విమర్శ స్వరూపుడయిన ఆయనయొక్క 'విమర్శ' ప్రసార పద్ధతిని స్తుతించుచున్నాడు.

**శ్లో॥ యా సా మిత్రావరుణసదనాదుచ్చరన్తీ త్రిషష్టిం**
**వర్ణానత్ర ప్రకటకరణైః ప్రాణసఙ్గాత్ ప్రసూతాన్।**
**తాం పశ్యన్తీం ప్రథమముదితాం మధ్యమాం బుద్ధిసంస్థాం**
**వాచం వక్త్రే కరణవిశదాం వైఖరీం చ ప్రపద్యే॥ 4**

**ప్రతిపదార్థము :** యా(సా)=ఏదయితే, మిత్రావరుణ=అగ్నీషోములయొక్క, సదనాత్=స్థానమయిన సుషుమ్నానుండి, ప్రాణసంగాత్=ప్రాణవాయుస్పర్శవలన, ప్రసూతాన్=ప్రసరింపబడిన, త్రిషష్టిమ్="63", వర్ణాన్=అక్షరములను, అత్ర=ఈ శరీరమునందు, ప్రకట=ప్రసిద్ధమయిన, కరణైః=ఇంద్రియాలచేత, ఉచ్చరంతీ=ఉచ్చరించు చున్నదో, తామ్=ఆ, ప్రథమం=పరావాక్కునుండి ముందుగా, ఉదితామ్=ఉదయించిన, పశ్యంతీమ్=పశ్యంతీవాక్కును, బుద్ధిసంస్థామ్=బుద్ధి గతమయిన, మధ్యమామ్=మధ్యమా వాక్కును, వక్త్రే=ముఖమునందు, కరణ=జిహ్వాది సాధనములచే, విశదామ్=స్పష్టముగా వచ్చిన, వైఖరీమ్='వైఖరి' అనబడు, వాచం చ=వాక్కును గూడా, ప్రపద్యే=భజింతును.

**తాత్పర్యము :** మిత్రావరుణులు అథవా అగ్నీషోములకు ఆధారమయిన సుషుమ్నా మధ్యమునుంచి ప్రాణవాయు సహాయంతో ఇంద్రియాలద్వారా ప్రసరించబడిన '63' అక్షరాలను ఉచ్చరించుచు ఆవిర్భవించునది పశ్యంతి. బుద్ధిరూపంగా అక్షరాలను భావించేది మధ్యమావాక్కు. చివరకు ముఖయంత్ర సహాయముతో స్పష్టముగా వినబడునది "వైఖరీ" వాక్కు. విమర్శస్వరూపమయిన యీ వాగ్రూపశక్తిధారలకు నా నమస్కారము.



11) **అంతర్ద్వాదశాంతం-బహిర్ద్వాదశాంతం :** లోపలి చంద్రుడు అపానవాయురూపము (బయటకు పోవు నిట్టూర్పు) దాల్చి బాహ్యాద్వాదశాంతం దాకా పయనిస్తాడు. అనగా మన నిట్టూర్పు బయటకు '12' అంగుళాలు ప్రసరించటం సహజనియమమని స్వరశాస్త్రం, స్వరప్రశ్న శాస్త్రములు చెప్తుతాయి. ఇది బాహ్యాద్వాదశాంతం. ఇలా పయనిస్తూ అపానవాయువు 15 తుటులుగా 15రోజుల శుక్లపక్షానికి సంకేతం అవుతుంది. మఱల హృదయాకాశంలో ఉన్న 'అంతర్ద్వాదశాంతం మీద బాహ్యాచంద్రుని అనగా ప్రాణకళతో కలిసి తుట్యర్థరూపమయిన అంతఃపూర్ణిమామృతాన్ని ఆస్వాదిస్తుంది. ఈ చంద్రుడు ఇలా ప్రాణరూపాన్నిపొంది అంతర్ద్వాదశాంతంనుండి బయలుదేరి 15 తుటుల రూపమయిన కృష్ణపక్షంలో క్రమంగా క్షీణం అవుతాడు. క్షీణించి, బాహ్యాద్వాదశాంతము నందున్న తుట్యర్థ రూపమయిన అంతరమావాస్యలోని 'అమాకలను' ఆస్వాదించును. ఇలా యోగులు అంతఃపూర్ణిమావాస్యలను ఆస్వాదించుచూ, 'ఆత్మయాగం' చేస్తారు. వారి దర్శపూర్ణమాసయాగం ఇదే. వారి వైశ్వదేవం ఇదే.

12) ప్రాణం/అపానం హృదయాకాశం నుండి బాహ్యాద్వాదశాంతం దాకా ప్రసరించటానికి 36 అంగుళాల దూరం పడ్తుంది. 2 1/2 అంగుళాల సమయం=తుటి. ఇందులో హృదయాకాశ బాహ్యాద్వాదశాంతాలమీద ఒక 1/2 తుటి నిలుస్తాయి. కాగా మొత్తం 14+1=15 తుటులు. ఇవే 15 రోజులతో సమానం. బయటకు వెళ్లే గాలి కృష్ణపక్షం, లోపలికి వెళ్లే గాలి శుక్లపక్షం అవుతాయి. బాహ్యావాయువును లోపలికి పీలిస్తే అది ప్రాణం. దీనివలన శరీరంలో ప్రాణకలలు చంద్రకలలలాగా వృద్ధి పొందుతాయి. అది శుక్లపక్షం. బయటకు వదలేటపుడు అది అపానం. ఇది ప్రాణకళాక్షయం. ఇది కృష్ణపక్షానికి గుర్తు.

**శ్లో॥ కృత్వా నక్తందినమివ జగద్బీజమావ్యక్తికం యత్**
**తత్రైవాన్తర్దినకర! తథా బ్రాహ్మమన్యత్తతోఽల్పమ్।**
**దైవం పిత్ర్యం క్రమపరిగతం మానుషం చాల్పమల్పం**
**కుర్వన్ కుర్వన్ కలయసి జగత్ పఞ్చధావర్తనాభిః॥ 28**

**ప్రతిపదార్థము :** దినకర!=సూర్యదేవా! జ్ఞానసూర్యా! విశ్వోదయరూపమయిన 'దినమును' చేయువాడా!, నక్తందినమివ=అహోరాత్ర స్వరూపమయిన, యత్=ఏ, జగత్=సదాశివాంత విశ్వమునకు, బీజమ్=ఆరంభావసానకారణమయిన కాలముగలదో దానిని, కృత్వా=ఆభాసింపజేసి, తత్రైవ=ఆ కాలమునందే, అంతః=అంతర్గతంగా, జగత్='కల' నుంచి 'క్షితి'వఱకున్న అశుద్ధాధ్వ రూపమయిన ప్రపంచమునకు, బీజమ్=కారణమయిన 'మాయాసంబంధి-అథోరాత్రమును, దానిలో, ఆవ్యక్తికమ్=ప్రకృతి సంబంధమయిన కాలమును, అందులో, అన్యత్=అందుకు భిన్నమయిన, బ్రాహ్మం=బ్రహ్మసంబంధి కాలమును, అల్పమ్=అల్పముగాను, దైవమ్=దేవతలకాలమును, పిత్ర్యమ్=పితృదేవతా కాలమును, మానుషం చ=మనుష్యసంబంధ కాలమును, క్రమపరిగతం=క్రమముగా,

5) చరువు పూర్ణమయిన 'అమృతం' కావటం అంటే, దానియందు విశ్వతత్త్వములు 36 సూక్ష్మరూపంగా ఉండటం.

**"ఏకైకత్ర చ తత్త్వేఽపి షట్త్రింశత్తత్త్వరూపతా"** అని ఆగమం (వ్యాఖ్యాత). కనుక ఈ చరువు ప్రపంచరూపమయిన శాక్తామృతంలాగా ఆభాసించును. అందుకే "పూర్ణామృతమివ" అన్నాడు. కారణం ఏమంటే "ఆత్మ" తప్ప ప్రపంచంలో అమృతం అంటూ ఏదీ లేదు. కనుక అంతా **ఆభాస** మాత్రమే.

6) అనలముఖ-అనలం=ఉదానవహ్ని. ఇది ఊర్ధ్వగామి, దేవతాప్రతినిధి. అపానం= అధోగామి. 'అగ్నిముఖావై దేవాః' అని దేవతలకు 'అగ్ని' ముఖరూపుడు. మఱియు **'ప్రథమాం పిబతే వహ్నిః'** అని చంద్రకలాపాన క్రమంలో అగ్నిముఖస్థానంలో ముందుగా త్రాగుతాడు. 'ఇడారూపచంద్రకళ' ముందు అగ్నిస్థానమయిన మూలాధారమునుంచి మొదలు అవుతుంది. అగ్నీషోములు కల్సియే ప్రపంచము. ప్రాణాపానములు కలిసియే జీవం. కనుక సోమకలాసాధనకు మొదటివాడు అగ్ని. తర్వాత ఆయన ద్వారా మిగిలిన దేవతలు.

7) ప్రపంచం అంటే 'బ్రహ్మం' నుంచి అనాశ్రితునివఱకు కారణశరీరమున్నందున 'ధర' మొ॥ శివతత్త్వరూపమయిన 'అధ్వ' విస్తార స్వరూపము.

8) వైశ్వదేవము-దీనినే పాకయాగం అని అంటారు. ఇది సర్వగృహస్థులు చేయాలి. రోజూ దీనికి సంబంధించిన అగ్నిపూజ, ఆహుతులు ఉంటాయి. దీనివలన అన్నంకోసం తప్పనిసరిగాగాని, తెలియకగాని చేసే హింసల వలన వచ్చే పాపాలు నశిస్తాయి. సూర్యుడు ఒక గృహస్థులాగా వైశ్వదేవరూపమయిన 'చరు' హోమం చేసినట్లు వర్ణన. అంతః పాకయాజిగాను, బహిఃపాకయాజిగాను సూర్యుని వర్ణించిన 'సౌర' మతం ఇది.

9) చంద్రకళలు 15 మనకు కనబడేవి. అవి శుక్లపక్షంలో సూర్యకాంతివలన పెరుగుతాయి. కృష్ణపక్షంలో తరుగుతాయి. తరగటానికి కారణం ఆయా దేవలోకాలవారు ఆ చంద్రామృతాన్ని సేవించటమే. ఇవి ఇలా పోగా మిగిలిన చంద్రుని ప్రాణకళ 16వది. అది సూర్యునిలో అమావాస్యనాడు కలుస్తుంది. దానినే **'అమాకళ'** అంటారు. అమా='కూడినది' అని అర్థం. సూర్యునితో కూడి ఉండిన కళ. దానినే **'కుహూ, సినీవాలి'** అని అంటారు. ఈ కళ మఱల శుక్లపక్షం నుంచి 15 కళలను చేర్చుకొనే ఒక తేనెటీగ వంటిది. అందుకనే ఈ కళను **'సరఘ'** అంటారు. తేనెతుట్టియ గూడా పూర్ణిమదాకా పెరిగి అమావాస్యకు పూర్తి అవుతుంది. తరువాత మఱల 'రాణిఈగె' సాన్నిధ్యంలో మిగిలిన ఈగలు తుట్టెను తయారుచేస్తాయి.

10) అమృతం చంద్రరూపేణ ద్విధా షోడశధా పునః।
పిబంతి చ సురాః సర్వే దశ పంచ పరాః కలాః॥
అమాశేషగుహాంతస్స్థా మావస్యా విశ్వతర్పిణీ॥ - కాలికాక్రమం (వ్యాఖ్యాత)
ఈ అమాకలికకే "ఊర్ధ్వతుట్యర్థం" అని పేరు.



**విశేషములు-వివరములు :**

1) **అవిభాగాత్తు పశ్యంతీ సర్వతః సంహృతక్రమా।**
**స్వరూపజ్యోతిరేవాంతః సూక్ష్మా వాగనపాయినీ॥** క్షేమరాజు (వివృతి)

'పశ్యంతి' అనేది స్వరూప జ్యోతిరూపం. ప్రాణనాద స్వరూపం. వర్ణవిభాగ రహితంగా సూక్ష్మక్రమంతో ఉండే వాక్కు పశ్యంతి.

2) **కేవలం బుద్ధ్యుపాదానాత్ క్రమరూపానుపాతినీ।**
**ప్రాణవృత్తిమతిక్రమ్య మధ్యమా వాక్ ప్రవర్తతే॥** - క్షేమరాజు. (వివృతి)

మధ్యమవాక్కనగా బుద్ధిగతంగా ఉండే అక్షరక్రమం. ప్రాణవృత్తి అయిన పశ్యంతీనాదరూపం నుంచి విడివడి అంతఃకరణంలో నిలుస్తుంది. మధ్యం అంటే అంతఃకరణం. కనుక ఇది మధ్యమావాక్కు.

**3) స్థానేషు వివృతే వాయౌ కృతవర్ణపరిగ్రహా।**
**వైఖరీ వాక్ ప్రయోక్తౄణాం ప్రాణవృత్తి నిబంధనా॥** - క్షేమరాజు (వివృతి)

ముఖంలో జిహ్వామూల, మధ్య మొదలగు స్థానాలద్వారా వాయుస్పర్శతో వర్ణరూపందాల్చి, స్థూలప్రాణవృత్తియై ప్రయోగదశలో వచ్చే ప్రసిద్ధవాక్కు "వైఖరి".

4) **విఖరం**-గట్టిదయిన స్థూలశరీరం. అందులో పుట్టినది గనుక **వైఖరి.**

5) మిత్రావరుణులు అంటే అగ్నీషోములు. అంతర్గతముగా సర్వం ఎండబెట్టాడు కనుక మిత్రుడే అగ్ని. ఆహ్లాదం ఆప్యాయనం చేస్తాడు కనుక వరుణుడే సోముడు. ఈ మిత్రావరుణుల సదనం అంటే సుషుమ్నానాడి. అందలి కుండలిని నాదశక్తి. ఇదే పరావాక్కు. మూలనాదం. దీనినుండి "63" అక్షరాలు వస్తాయి.

| | | | |
|---|---|---|---|
| 6) | అ,ఇ,ఉ,ఋ-ఇవి హ్రస్వదీర్ఘప్లుతభేదంలో | - 12 | |
| | - హ్రస్వం, దీర్ఘం | - 02 | |
| | సంధ్యక్షరాలు ఏ,ఐ,ఓ,ఔ - వీటి దీర్ఘప్లుత | - 08 | |
| | అచ్చులు **మొత్తం** | **-22** | **22** |
| | 'క' నుంచి 'మ' దాకా స్పర్శలు | - 25 | |
| | యరలవ-అంతస్థలు | - 4 | |
| | శషసహ-ఊష్మలు | - 4 | |
| 'యమ' వర్ణాలు (వేదంలో) | | - 4 | |
| | (కుం, ఖుం, గుం, ఘుం) అనుస్వార, | | |
| | విసర్గ, జిహ్వామూలీయ ఉపధ్మానీయములు | - 4 | |
| | **మొత్తం** | **- 41** | **41** |
| | | **మొత్తం =** | **63** |

7) జ్ఞానాగ్నియందు కొద్దిగా సూక్ష్మప్రాణసంగంవలన 'పశ్యంతి'లో; జ్ఞానాగ్ని మరియు సూక్ష్మప్రాణములు కలసి 'మధ్యమ'లో, స్థూల ప్రాణసంగంవలన 'వైఖరి'లోను వర్ణాలు పుట్టాయి.

8) **వర్ణానంతః ప్రకటకరణైః ప్రాణసంగాత్ప్రసూతే**–అని పాఠాంతరము. దానికి అర్థము– పరా వాగ్రూపశక్తి మిత్రావరుణసదనమునుంచి విమర్శించుచు, అనగా ప్రమాణరూపుడయిన సూర్యుని, ప్రమేయరూపుడయిన 'చంద్రుని' ఆశ్రయంతో అనగా 'పింగళా, ఇడా' నాడీద్వయ సహాయంతో ఆత్మాకాశమునుంచి ఊర్ధ్వంగా ప్రసరిస్తూ, ప్రమాతృరూపమయిన "తన" స్థానాన్ని ప్రకటిస్తుంది. ఆమెయే అంతర్భాగంలో మాత్రమే స్పష్టంగా ఉండే ఇంద్రియములతో ప్రాణసంగంవలన అక్షరాలను ప్రసవిస్తుందని తాత్పర్యము. ఈ పాఠాంతరానికి ప్రతిపదార్థము

అంతః=లోపలనే, ప్రకట=స్పష్టమైన, కరణైః=ఇంద్రియాలతో, ప్రాణసంగాత్=ప్రాణవాయుస్పర్శవలన, వర్ణాన్=అక్షరాలను, ప్రసూతే=పుట్టించును.

**అవః–** ఈ విధంగా వాక్ప్రసారం దాకా భగవంతుని స్వరూపాన్ని స్తుతించి మధ్యస్థానంయొక్క దశను వర్ణిస్తున్నాడు.

**శ్లో॥ ఊర్ధ్వాధస్స్థాన్యతనుభువనాన్యన్తరా సన్నివిష్టా**
**నానానాడిప్రసవగహనా సర్వభూతాన్తరస్థా।**
**ప్రాణాపానగ్రసననిరతైః ప్రాప్యతే బ్రహ్మనాడీ**
**సా నః శ్వేతా భవతు పరమాదిత్యమూర్తిః ప్రసన్నా॥ 5**

**ప్రతిపదార్థము :** ఊర్ధ్వ=పై భాగమున, అధస్స్థాని=క్రిందను ఉన్న, అతను=అనల్పమయిన, భువనాన్యంతరా=లోకములమధ్యగా, సంనివిష్టా=ప్రవేశించినదియు, నానా=అనేకమయిన, నాడి=నేత్రములనుండి రోమకూపాలవఱకుగల నాడులయొక్క, ప్రసవ=విస్తారముచేత, గహనా=సంక్లిష్టమయినదియు, సర్వభూత=సమస్తజీవులయొక్క స్థావరాది దేవతాంత జీవులయొక్క, అంతరస్థా=లోపలనున్నదియు అగు, బ్రహ్మనాడీ=ఓంకారనాడి అయిన సుషుమ్న, ప్రాణాపాన=ప్రాణాపానములయొక్క, గ్రసన=అన్యోన్య హోమక్రియలో అనగా యోగక్రియలో, నిరతైః=ఆసక్తులయిన యోగులచేత, ప్రాప్యతే=పొందబడును. సా=అటువంటి, శ్వేతా=జ్ఞాన ధవళ అయిన, పరమాదిత్య=పరమజ్ఞానసూర్యునియొక్క, మూర్తిః =ఆకారమయిన సుషుమ్న, నః=మనకు, ప్రసన్నా=అనుగ్రహాభిముఖురాలుగా, భవతు= అగుగాక!

**తాత్పర్యము :** మన శరీరమున బయటగూడా "14" లోకాలున్నాయి. అతలవితలాది లోకాలు మూలాధారాత్తు క్రింద అరికాలివరకు ఉన్నాయి. మూలాధారమునుంచి భూ, భువః, సువః మొ॥ లోకములు 7 కలవు. వీటిమధ్యలో ఉన్నది 'సుషుమ్నా'. బాహ్య ప్రపంచములోను ఉత్తరదక్షిణ–అక్షాంశములమధ్య ఒక రేఖను ఊహిస్తే అదీ సుషుమ్నకు ప్రతినిధి. ఆ విధంగా ఊర్ధ్వాధోలోకములకు మధ్యవర్తిని అయినది. దీనినుంచి



**ప్రతిపదార్థము :** తేజసా=నీ మరీచిస్ఫురణచేత, సోమమ్=రూపం మొ॥ అగు (15) ప్రమేయ సమూహమును లేదా చంద్రుని/ సోమరసమును, పూర్ణామృతమ్=అమృత పూర్ణమయిన, చరుమివ=హవ్యపదార్థమునుగా (హోమాన్నం), సాధయిత్వా=సాధించి, తేన=ఆ 'చరువు' చేత, అనలముఖ=ఉదానాగ్నిముఖంగాగల అగ్నిముఖమయిన, జగత్= ధరాది శివతత్త్వాంత ప్రపంచముయొక్క/ప్రపంచముయొక్క, తర్పణమ్=తృప్తి చేయుట అను, వైశ్వదేవం= వైశ్వదేవము అను యాగమును, కృత్వా=చేసి, ఖే=ఆకాశమునందు (హృదయాకాశము), ఆమావస్యమ్=అమావాస్యకు సంబంధించిన, తత్=ఆ సోముని యొక్క, కలాశేషమ్=శేషమయిన 16వ కలను, ఆమావాస్యమ్=దర్శయాగ సంబంధమయిన, విఘసమివ=నివేదితశేషమయిన చరువునువలె, గృహపతిరివ= గృహయజమానివలె, బ్రహ్మాండ= బ్రహ్మరంధ్రమునందున్న శాక్తబ్రహ్మగల శరీరాండము యొక్క, లేదా ప్రపంచము యొక్క, అంతః=ధరామూలమాయాశక్తి–అండచతుష్టయ మధ్యమున/ప్రపంచములోపల, స్వాత్మయాగమ్=స్వాత్మదేవతా సంబంధమయిన, యాగమ్=భుక్తశేషచరు నివేదనా రూపమయిన యాగమును, కరోషి=చేయుచున్నావు.

**తాత్పర్యము :** హే జ్ఞానభాస్కరా! ఈ ప్రమేయ ప్రపంచము అనబడు అపానరూపమయిన 16 కళలుగల 'సోముని' నీవు నీ తేజస్సుతోనే సాధించి, ఆ అమృతమునే హవ్యమయిన 'చరువు'గా అగ్నిముఖంగా గల యీ దేవతా ప్రపంచమునకు హోమంచేసి ఆ విధంగా 'వైశ్వదేవం' అను యాగంచేసి, మిగిలిన '16' వ కళ అనబడే అమావాస్యా చంద్రశేషమును, హుత శేషమయిన చరువును తిన్నట్లు నీ ఆత్మయందు హుతం చేసి ఒక యజమానునివలె ప్రవర్తించుచున్నావు. బాహ్యసూర్యుడుగూడా తనకాంతులతో 'చంద్రుని' నింపి, ఆ అమృతమును దేవలోకాదులకు ప్రతి కృష్ణపక్షమున కానుక చేయును. మిగిలిన 16వ కలను అమావాస్యనాడు తనయందే ఉంచుకొని అనుభవించును. అట్లే ఒక గృహంలో యజమానుడు (సోమయాజి మొ॥వారు) సోమరసమును అమృతరూపమయిన హవిస్సుగా కల్పించి దానితో అగ్ని మొ॥గు అగ్నిముఖులయిన దేవతలకు ఆహుతులుగా సమర్పించి హుతశేషమయిన హవ్యమును తనలోని వైశ్వానరునకు ఆహారరూపంగా అందిస్తాడు. అలా సూర్యుడు అంతర్బాహ్యదశలలో ఒక వైశ్వదేవపాకయాజివలె ఆదర్శమును ఆచరించుచున్నాడని చమత్కారము.

**విశేషములు–వివరములు :**

1) బ్రహ్మరంధ్రమునందున్నది శాక్తబ్రహ్మం. అందువలన శరీరం బ్రహ్మాండం/ శాక్త బ్రహ్మాండం. దీనిలో "ధరాండం, మూలాండం, మాయాండం, శక్త్యండం" అని 4 అండాలుంటాయి.

2) రూపం మొ॥ 15 ప్రమేయాలు.

3) చరువు–హోమంకోసం వండిన అన్నం.

4) సోమం=సోమరసం, చంద్రుడు, ప్రమేయ సమూహం, అపానము.

చెప్పవచ్చును. ఇందులో 'షట్+రసా' అని విడదీస్తే ఆఱురకాల భూసంబంధమయిన ఆస్వాదము అని చెప్పవచ్చును. ఆఱుఋతువుల ప్రభావంతో వచ్చే భౌమరసాలు.

సి) కాముకుని పక్షంలో షట్ అనగా ఆఱు చుంబనస్థానాలనుండి అనగా నుదురు, కనురెప్పలు, బుగ్గలు, అధరం మొ॥ లభించు ఆనందరసము అని చెప్పవచ్చును.

డి) తంత్రశాస్త్రం ప్రకారం 6 ఆనందభూములున్నాయి. అవి –

1) నిజానందం 2) నిరానందం 3) బ్రహ్మానందం 4) మహానందం

5) చిదానందం 6) జగదానందం. వీటిని **'తంత్రాలోకం'** వివరించింది. ఇవి శూన్యమునుంచి వ్యానంవఱకు ఉన్న విశ్రాంతి స్థానాలు. సాధకుడు ప్రాణాన్ని స్పందింపజేయదలచినవాడై ముందు హృదయమునందు శూన్యమున విశ్రమించును. ప్రాణోదయం తర్వాత బాహ్యమునందు విశ్రమించును. తరువాత అపానచంద్రపూరణంచే సర్వాత్మభావం గ్రహించటంలో విశ్రాంతి. దానివలన ఇతరాకాంక్షలు నశించును. తరువాత సమానోదయంవలన సంఘట్ట విశ్రాంతిని (సర్వార్థములయొక్క అన్యోన్యమేలన రూపమయినది) పొందును. తర్వాత 'ఉదానవహ్ని' ఉదయింపగా మాతృమేయాది జ్ఞానం హుతం అవుతుంది. ఉదానవహ్ని చల్లబడిన తర్వాత వ్యానం ఉదయిస్తుంది. అప్పుడు సర్వభేదములు నశిస్తాయి. ఇలా శూన్యంనుంచి వ్యానంవఱకు ఈ విశ్రాంతులను 1) నిజానందం 2) నిరానందం 3) పరానందం 4) బ్రహ్మానందం 5) మహానందం 6) చిదానందం అంటారు. ఇందులో **నిజానందం** హృదయంలో మాతృభూమి అయిన సుషుమ్న లోనిది. **నిరానందము** అనగా ప్రమాతృస్థానమునుండి బయటకు రావటంవలన ఏర్పడేది. అచ్చటనుంచి అపానపూరణంవలన సర్వాత్మభావన ఏర్పడుతుంది. అది **పరానందము**. ఇది బహిర్ముఖస్థితిలో ప్రమేయమయిన ఇతర పదార్థమువలన వచ్చేది. సమానోదయంవలన సర్వార్థస్వీకరణవలన వచ్చేది **బ్రహ్మానందం**. (బృంహకత్వేన బ్రహ్మరూపః) ఉదానవహ్ని ఉద్భవించినపుడు ప్రాణాదిక్షోభ పోతుంది కనుక **మహానందము.** సర్వమయత్వం ఉన్నా సర్వాతీతంగా ఉండే స్థితి వ్యానోదయ స్థితి. అందువలన ఇది చిద్రూపం. కనుక **'చిదానందము'**. వీటినన్నింటిలో సమానంగా వ్యాపించి ఉండే సంవిత్తును 'జగదానందము' అంటారు.

**"యాసామేకోను సంధాతా ఉదయాస్తమయ విహీనః అంతర్విశ్రాంతి పరమార్థ రూపః జగదానందః" – తంత్రసారం.**

అసలు 'సంవిత్తే' ప్రాణాదిరూపంలో వరసగా పరిణమిస్తుంది.

**"ప్రాక్ సంవిత్ప్రాణే పరిణతా"**–(తంత్రసారటిప్పణీ)

దీని వివరం "తంత్రాలోకం"లో చూడదగును.

**శ్లో॥ సోమం పూర్ణామృతమివ చరుం తేజసా సాధయిత్వా**
**కృత్వా తేనానలముఖజగత్తర్పణం వైశ్వదేవమ్।**
**ఆమావస్యం విఘసమివ ఖే తత్కలాశేషమశ్నన్**
**బ్రహ్మాణ్డాన్తర్గృహపతిరివ స్వాత్మయాగం కరోషి॥ 27**



సర్వనాడులు, 3.5కోట్ల నాడులు, ప్రధానముగా 108 నాడులు ఇంకా ప్రధానంగా దశనాడులు ఇంకా ప్రధానంగా ఇడాపింగళ ఉంటాయి. నేత్రంనుంచి రోమకూపాలవఱకు ఈ నాడీ సంతానం సంక్లిష్టంగా అల్లుకొని ఉంటుంది. కాని యోగగ్రంథాలలో సుషుమ్నలో '3' భాగాలు చెప్పారు. అవి వజ్రిణి చిత్రిణి బ్రహ్మనాడులు. ఏదయినా బ్రహ్మనాడి అంటే /మధ్యనాడి అంటే సుషుమ్న. సుమ్నం అంటే తేజస్సు. 'సుషుమ్న' అంటే తేజోభరితమయిన నాడి. **'నీలతోయదమధ్యస్థా–విద్యుల్లేఖేవభాస్వరా'** అని శ్రుతి. ఇది లోకమధ్యముననే కాక జీవుల శరీరమధ్యంలోనూ ఉన్నది. దీనిలోనికి వెళ్లడం కేవలం ప్రాణాయామ ప్రవీణులయిన మహాయోగులకు మాత్రమే సాధ్యం. అటువంటి బ్రహ్మనాడి జ్ఞానస్వరూపుడయిన పరమాత్మయొక్క మూర్తిభేదమే. అది ప్రసన్నమై సత్త్వకాంతిభరితమై శ్వేతమై మనలను ఉద్ధరించుగాక.

**విశేషములు–వివరములు :**

1) పరమాదిత్యుడు అంటే జ్ఞానసూర్యుడు. బ్రహ్మనాడి అనగా పరమాత్మను పొందించేది, పరమాత్మనుంచి వచ్చినది, పరమాత్మ రూపమయినది. ఓంకారరూపమయినది అగు శబ్ద/నాదబ్రహ్మనాడి. అది ప్రసన్నం కావటం అంటే పూర్వజన్మసిద్ధమయిన ఆణవము మొ॥ ప్రాణాది కాలుష్యములు లేనిది కావటం. కనుకనే నిర్మలము అనగా శ్వేతము. చిదానంద పూర్ణము కనుక శ్వేతంగా భాసిస్తుంది. ఈ అవకాశం ఈ నాడికి మాత్రమే కలదు. శరీరములో నేత్రాదీంద్రియనాడులనుంచి రోమకూపనాడుల వఱకు సర్వస్థూలసూక్ష్మనాడులు సుషుమ్న ఆధారంగా అల్లిబిల్లిగా 3.5కోట్ల నాడులు కలవు. కనుక ఇది సంక్లిష్టము.

2) అనాశ్రితమునుంచి కాలాగ్నివఱకు ఉన్న అనేక భువనములు.

3) ప్రాణాపానములంటే సర్వవాహప్రసవ ప్రవేశములు. ప్రాణం=పీల్చేగాలి. అపానం=వదిలే, వదలించే గాలి.

**శ్లో॥ న బ్రహ్మాణ్డవ్యవహితపథా నాతిశీతోష్ణరూపా**
**నో వా నక్తందివగమమితాతాపనీయాపరాహుః।**
**వైకుణ్ఠీయా తనురివ రవే రాజతే మణ్డలస్థా**
**సా నః శ్వేతా భవతు పరమాదిత్యమూర్తిః ప్రసన్నా॥ 6**

**ప్రతిపదార్థము :** యా=ఏది, బ్రహ్మాండ=బ్రహ్మాండములచేత, వ్యవహిత=అడ్డుకొనబడిన, పథా=మార్గముగలది, న=కాదో, అతి=మిక్కిలి, శీత=చల్లని, ఉష్ణ=వెచ్చని, రూపా= రూపము గలది, న=కాదో, నక్తమ్=రేయింబవళ్లు జరిగే, గమ=సంచారముచేత, మితా= పరిమిత మయినది, న=కాదో, అతాపనీయా=తాపరహితమయినదో, అపరాహుః =ప్రమాత అనబడు రాహువులేనిదో, రవేః=సూర్యునియొక్క, మండలస్థా=మండలము నందున్నదో, వైకుంఠీయా =త్రివిక్రముడయిన వామన విష్ణువుయొక్క, తనురివ=శరీరమువలె, రాజతే= ప్రకాశించు చున్నదో, సా=ఆ, శ్వేతా=నిర్మలమయిన,

పరమ=పరస్వరూపమయిన, ఆదిత్యమూర్తిః=సూర్యనారాయణమూర్తి, నః=మనకు, ప్రసన్నా=సానుగ్రహమయినది, భవతు=అగుగాక!

**తాత్పర్యము :** మనలోనే మధ్యధామంలో అనగా సుషుమ్నా మధ్యభాగంలో ఉన్న చిద్భానువు అనగా జ్ఞానసూర్యుడు పైనుంచి క్రిందవఱకు భూమూలమాయాండ ప్రపంచశక్త్యండముల దాకా వ్యాపించి ఉంటాడు. ఈ సూర్యుడు అగ్నివలె వేడికాదు. చంద్రునివలె చల్లన కాదు. అగ్నిషోముల సామరస్యరూపమయిన ఆనందస్వరూపము. ఈ జ్ఞానసూర్యునికి రేయింబవలు నియమం లేదు. సర్వదా వెలుగువాడు. సుషుప్తిలోనూ నిరంతరాయంగా ఉంటాడు. పరమాహ్లాదప్రదమయినదీ రూపం. ఈయనకు ప్రమాత అనగా జీవుడు అను రాహువు వలన ఆవరణం అనే గ్రహణం లేదు. అంటే రాహువు సూర్యుని కప్పివేసినట్లు ఈ జ్ఞానసూర్యునికి "అహంకార" రూపజీవుడు ఆచ్ఛాదనగా ఉండడు. ఈ జ్ఞానసూర్యుడు జ్ఞానమండలములో రశ్మిపరివేషమధ్యంలో ఉంటాడు. సూర్యమధ్యంలో నారాయణుడు ఉన్నాడన్నది సంప్రదాయమే. ఈ జ్ఞానసూర్యుడు నిరంతరాయంగా సకల బ్రహ్మాండమును క్రోడీకరించుచు త్రివిక్రమావతారంలో విష్ణుమూర్తివలె విజృంభించును. అట్టి పరమాదిత్య నిర్మలమూర్తి మనకు ప్రసన్నమగు గాక!

**విశేషములు-వివరములు :**

1) బ్రహ్మబిలం సుషుమ్నా సుషిరం. అందులో ఉన్నది బ్రహ్మాండము. అదే భూమూల మాయాండప్రపంచశక్త్యండము.

2) ఈ జ్ఞానసూర్యుడు ద్వైతాన్ని దహిస్తాడు అద్వైతానందాన్ని చిందిస్తాడు. అందువలన సూర్యచంద్ర/ అగ్నీషోమ/ మిత్రావరుణ సమ్మేళనమువలె సమరసం అయినవాడు. కనుక నాతిశీతోష్ణరూపుడు.

3) రాహువు సూర్యమండలాన్ని కప్పుతాడు అలానే వ్యవహారంలో శూన్యప్రమాత అయిన అంతఃకరణప్రతిబింబ జీవుడు అసలయిన ఆత్మరూపానికి బదులు తానే కనబడతాడు. అనగా పరమాత్మను/ ప్రత్యగాత్మను కప్పుతాడు. కాని బ్రహ్మనాడీ మధ్యమున వెలిగే భానునకు అనగా నిర్వికల్పసమాధిలో పరస్పరసమావేశం అయిన స్థితిలో ఈ భాస్కరునికి ప్రమాత అనే రాహువు అడ్డురాడు. ఆ స్థితిలో ప్రమాత ఉండడు. ప్రత్యగాత్మభానుడు మాత్రమే వెలుగుతాడు కదా! అదే ఆగమోక్తి.

**ప్రకాశమానే పరమాత్మభానౌ నశ్యత్యవిద్యాతిమిరే సమస్తే**
**అహో బుధా నిర్మలదృష్టయోఽపి కించిన్న పశ్యంతి జగత్సమగ్రమ్॥**

కనుక "పరమాత్మ భానుప్రకాశం"లో ప్రమాత మొ॥ జగత్తు కనబడదు.

4) శరీరంలో 360 శివశక్తిరశ్ములు '6'చక్రాలవారీగా నిష్పత్తిలో ఉంటాయని యోగశాస్త్రము. ఇదే రశ్మిచక్రం. ఇది రవిరశ్మిపరివేషం. రశ్మిమధ్యంలో రశ్మిని వెదజల్లుతూ ఉండేది "రవి". ఈ చిద్భానుమండల మధ్యంలో ఉండేది "చిద్భానువే". ఇంతేగాక మామూలు సూర్యమండలంలోను కాంతిదాతగా ఉండేది నారాయణుడే.



2) గోముఖములు అంటే 'అనుత్తరకిరణాలు' అన్నాడు వ్యాఖ్యాత. ఇవి అకారాది వర్ణాలు, నాదరూపాలు. వీటివలననే షట్కమలాలు వికసిస్తాయి అన్నది యోగతంత్ర వాస్తవము. లేదా అనుత్తర-అకారః=చిత్సూర్యుడు. కిరణాలు జ్ఞానప్రసరణాలు.

3) 'వదనం' అంటే 'శబ్దం' అని అర్థం.

4) 'ఖం' అనగా శూన్యప్రమాత అయిన ఆకాశం. అనగా జీవుడు.

**కలోద్వలితమేతచ్చ (ఏతత్=దహరాకాశము) చిత్తత్త్వం కర్తృతామయమ్।**
**అచిద్రూపస్య శూన్యాదేః మితం గుణతయా స్థితమ్॥** (వ్యాఖ్యానోదాహృతం)

అనగా ఆకాశము ఆనందరూపము. చిత్తత్త్వం. అది కలలతో (ఇంద్రియాదులతో) కూడినదై 'కర్తృత్వం'తో గూడి ప్రమాతగా అయింది. అది జడమయిన శూన్యాది పదార్థాలకు గుణంగా ఉండినది. 'మితం' అయినది. అనగా 'ఖండం' అయినది.

5) వదనం నలినంచ-'వదననలినే' అని ద్వంద్వం. ఆధ్యాత్మికానికి సరిపోతుంది. మిగిలిన అర్థాలకు నలినమివవదనం-అని ఉపమితసమాసం అవసరం. లేదా రూపకం.

6) 'ఇందు'భాసా-అంటే కాముకపక్షంలో 'కర్పూరం' అని వ్యాఖ్యాత చెప్పారు. కాని 'ఖే' అన్నాడు కవి. కనుక 'వెన్నెల' అనటం ఎక్కువ బాగుంటుంది.

7) గోముఖం-అంటే హస్తముద్ర కావచ్చు. లేదా ఆవుమూతిలాగా మూతిని ముందరికి 'సున్నా' చుట్టి కనురెప్పల మీద ముద్దాడటం కావచ్చును. కిరణాగ్రాలు, లేదా చిద్రశ్ములు అని అర్థం.

8) ఇందులో శ్లేషాలంకారము అని శ్లేషధ్వని అని వ్యాఖ్యాత. ఇందులో 'అంతస్సూర్యార్థము, బహిస్సూర్యార్థము, '2' ప్రకృతశ్లేషగా వచ్చినవి. కాని 'శ్లేషధ్వని' అనటానికి తగిన ఆధారం కనబడలేదు. తప్పనిసరిగానో, ఒక సూచనగానో, శ్లేషను వ్యంగ్యంగా సాధింపవలసివస్తే 'శ్లేషధ్వని' అని చెప్పవచ్చును. కాని యీ శ్లోకంలో 'శబ్దార్థశ్లేష'లు స్వయంగానే ఏర్పడినవి. ఇక 'అప్రస్తుత కాముక వృత్తాంతం' శ్లేషతోగాక ప్రతీయమానంగానే వస్తున్నది. కనుక దీనిని 'సమాసోక్తి' అనవచ్చును. 'ద్యావాపృథివీ' పదాలు అప్రకృతశ్లేషను నివారిస్తాయి కనుక ఇది 'సమాసోక్తి'. ప్రస్తుతమునందు అప్రస్తుతము స్ఫురిస్తున్నది కనుక దాని ఆధారంగా 'శ్లేషధ్వని' అని వ్యాఖ్యాత చెప్పి ఉండవచ్చును. కాని సమగ్రశ్లేషరాదు. కనుక ఇది 'సమాసోక్తి' అనే అలంకారంగా చెప్పవచ్చునేగాని 'శ్లేషధ్వని' అనడం పొసగదు. పైగా 'శ్లేష' అనుకొన్నా దానికి ప్రాధాన్యం లేదు. కనుక 'ధ్వని' అని కాక అపరాంగరూపగుణీ భూతవ్యంగ్యశోభితమయిన 'అలంకారం'గా -అనగా 'సమాసోక్తి'గా చెప్పటం సబబు.

9) షడ్రస-అన్న పదానికి వివరణ :-

ఎ) షట్చక్రములందున్న షట్కమలమకరందరసాస్వాదం అని యోగార్థము.

బి) బాహ్యసూర్యపక్షంలో షడృతువులవలన వచ్చే రకరకాల పదార్థాలు ఆనందాలు అని

ఆఋరుచులయొక్క, ఆస్వాద=ఆస్వాదించుట యందు, లోలః=ఆసక్తిగలవాడవై, పర్యాయేణ=ఋతువుల క్రమంలో, గర్భాధాన= గ్రీష్మాదులందు 'కర్షణి' మొ॥ కిరణాలను ప్రవేశపెట్టుటయొక్క, ప్రసవ=వర్షాదులయందు 'వర్షణి' మొ॥ కిరణములను వదలుటయొక్క, విధయే=విధికొఱకు అనగా అనేక ఓషధీ సృష్టికొఱకు, ఆ పిబసి=త్రాగుచున్నావు.

**తాత్పర్యము-2 :** బాహ్యసూర్యుడు భూస్వర్గలోకాలమధ్య భువర్లోకంలో (అంతరిక్షంలో) అగ్నిరూపంగా ఉండి ఈ '2' లోకాల ముఖాలను తన కిరణాగ్రాలను ప్రసరించి వికసింప చేస్తున్నాడు. ఈ '2'లోకాలు అంతకుముందు రాత్రి చంద్రకాంతిలో అందంగా ఉన్నాయి. ఈ లోకాలయందు అర్కుడు ఈ విధంగా ప్రవర్తించటానికి ప్రయోజనం గర్భాధానం-ప్రసవం. అనగా గ్రీష్మాదిఋతువులలో **'కర్షణీ'** మొ॥ తన రశ్ములను భూమిలో ప్రవేశపెట్టటం. వర్షాది ఋతువులలో **"వర్షణీ"** మొ॥ తన కిరణాలను ఆకాశంలో ప్రవేశపెట్టి వర్షం ప్రసవించటం. దానివలన అన్నాది ఓషధులు, అన్నాదులయిన జీవులు ఉద్భవిస్తారు. ఈ విధంగా బాహ్యసూర్యుడు బాహ్యలోకంలో పనిని అంతస్సూర్యుడు అంతర్లోకంలో చేసినట్లు, చేస్తున్నట్లు, చేస్తున్నాడు.

**3) (కాముకపరంగా)**-భగవన్!=సూర్యదేవా!, మధ్యసంస్థః=మధ్యలో పరుండినవాడవై, ఖే=ప్రాసాదాకాశమునందు, సాపత్న్యేన=సవతులగుటచేత, అభిముఖమివ=ఎదురు బదురుగా, సుప్తయోః=నిద్రించినవారును, ఇందుభాసా=వెన్నెలతో, కాంతయోః= అందమయినవారును అగు, ద్యావాపృథ్వ్యోః=ద్యావాపృథివులయొక్క, (అనుస్త్రీలు) వదనకమలే=కమలములవంటి ముఖములను, గోముఖైః=వాక్కులు, కటాక్షములు మొ॥ వానితో లేదా, గోముఖ హస్తములతో, బోధయిత్వా=మేల్కొలిపి, షడ్రసాస్వాద= షడ్రసాస్వాదమునందు, లోలః=ఆసక్తికలవాడవై, గర్భాధాన ప్రసవవిధయే=గర్భ, ప్రసవముల కొఱకు, పర్యాయేణ=ఒకరి తర్వాత ఒకరు-అను క్రమంతో, ఆ పిబసి=(అధరామృతమును) త్రాగుచున్నావు.

**తాత్పర్యము-3 :** ఒక కాముకుడయిన భర్త చంద్రకాంతిలో మనోహరంగా ప్రాసాదోపరితలం మీద ఎదురుబదురుగా పరుండిన తనభార్యల ముద్దుముఖాలను తన మాటలతో, కన్నులతో, ముఖంతో/లేదా గోళ్లతో సుతారంగా తాకి వారిని పర్యాయక్రమంతో వారి అధరరసాస్వాదం చేశాడు. ఇచట ఆశించిన ప్రయోజనం సహజమయిన **'గర్భాధానప్రసవములు'**.

**విశేషములు-వివరములు :**

1) వదనకమలే అనగా 'శాక్తనలినే' అన్నాడు వ్యాఖ్యాత. కుండలినీ సంబంధమయిన నాదరూపమయిన కమలము లేదా ఆత్మసంబంధమయిన నాదము శాక్తము. కమలం-ఆ నాదప్రణవం మార్గంలో భౌతికంగా పార్థివశరీరంలో ఉన్న షట్చక్ర కమలాలు' అని అర్థం చెప్పాలి. అపుడే 'షడ్రస' అనే పదం సరిపోతుంది. లేదా అంతర్ద్వాదశాంత, బహిర్ద్వాదశాంతములు అని చెప్పవచ్చును. చూ॥ 27శ్లో॥ విశేషాలు.



**"ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణస్సరసిజాసనసన్నివిష్టః"** -అని ఆగమోక్తి.

5) వ్యవహారకాలంలో మనకు తెలియకపోవటం వలన శాస్త్రైకగమ్యుడై వామనరూపంగా ఉన్న "ప్రత్యగాత్మ" (అంగుష్ఠమాత్రః) పరమార్థ దశాకాలమున సర్వజగత్తును మ్రింగి తనే ప్రకాశించడం "త్రివిక్రమావతార" స్థితి. ఈ స్థితిలో బ్రహ్మాండాలు అడ్డురావు. రాత్రి పగలు లేవు. ఆచ్ఛాదన లేదా గ్రహణం కలిగించే ఏ రాహువు రాదు. సర్వం ఆనంద విజృంభణం. కనుక చిద్భాను పరాక్రమం త్రివిక్రమ విజృంభణం లాంటిది.

6) బాహ్యసూర్యునకింతటి స్థితి లేదు. ఆయనకు బ్రహ్మాండములు అడ్డుపడుతుంటాయి. స్వర్గంవఱకే ఆయన ప్రకాశము. ఋతువులనుబట్టి శీతోష్ణగుణాలు పెరుగుతాయి, తఱుగుతాయి. పగలు మాత్రమే వస్తాడు. రాత్రిరాడు. కేవలాహ్లాదకారి కాడు. తాపకారికూడా. ఈయనకు రాహుకేతువులబాధ ఉన్నది.

7) ఈ విధంగా ఇందులో చిద్భానుమూర్తికి వామనమూర్తితో ఉపమ చెప్పబడినది కనుక ఉపమాలంకారము. సాధారణ సూర్యునికి చిద్భానుమూర్తికి తేడా చెప్పబడినది కనుక వ్యతిరేకాలంకారం. ఇందు అర్థశ్లేషతో **ఉపమాలంకారము "ఇవ"** అనే ప్రత్యయం ద్వారా వాచ్యంగా చెప్పబడినది. వ్యతిరేకాలంకారం మాత్రం వ్యంగ్యంగా చెప్పబడినది. కాగా ఉపమాశ్లేషలతో కూడిన వ్యతిరేకాలంకార ధ్వని.

**"వ్యతిరేకో విశేషశ్చేదుపమానోపమేయయోః"** అని చంద్రాలోకం. వ్యతిరేకం అనగా ఉపమానోపమేయముల మధ్య "తేడా" సూచింపబడినది కనుక వ్యతిరేకాలంకార ధ్వని.

**అవః-** అంతరాదిత్యుని బహిరాదిత్యుని కలిపి ఈ ఏకశ్లోకంలో ధ్యానిస్తున్నాడు సాంబకవి.

**శ్లో॥ యత్రారూఢం త్రిగుణవపుషి బ్రహ్మ తద్బిన్దురూపం**
**యోగీన్ద్రాణాం యదపి పరమం భాతి నిర్వాణమార్గః।**
**త్రయ్యాధారః ప్రణవ ఇతి యన్మణ్డలం చణ్డరశ్మే-**
**రన్తస్సూక్ష్మం బహిరపి బృహన్ముక్తయేఽహం ప్రపన్నః॥ 7**

**ప్రతిపదార్థము :** త్రిగుణ=త్రిగుణాత్మకమైన, వపుషి=రూపమయిన, యత్ర=ఏ మండలము నందు, బిందురూపమ్='చుక్క' రూపముగలదై (ఓంకారముపై), తత్=ఆ, బ్రహ్మ=పరమాత్మ, ఆరూఢమ్=అధిష్ఠించి ఉన్నదో, పరమం=చరమమయిన, యత్=ఏ మండలము, యోగీంద్రాణామపి=యోగిరాజులకు గూడా, నిర్వాణమార్గః=మోక్ష మార్గముగా, భాతి=వెలుగుచున్నదో, యత్=ఏది, త్రయీ=వేదత్రయికి/త్రయములన్నింటికి, ఆధారః=అధిష్ఠానమయిన, ప్రణవః+ఇతి=ఓంకారమని ప్రసిద్ధమో, అంతః=లోపల, సూక్ష్మమ్=సూక్ష్మముగాను, బహిరపి=బయటనూ, బృహత్= విశాలముగానూ వ్యాపించిన, చండరశ్మేః=జ్ఞానసూర్యునియొక్క, లోకసూర్యునియొక్క, మండలమ్=మండలమును, అహమ్=నేను, ముక్తయే=మోక్షముకొఱకు, ప్రపన్నః=పొందితిని.

**తాత్పర్యము :** అంతరాదిత్యుడు బహిరాదిత్యుడు–ఇద్దఱు ఒకే జ్ఞానశక్తియొక్క/ చిచ్ఛక్తియొక్క "ఆధ్యాత్మిక, ఆధిభౌతిక" రూపములు. గుణత్రయరూపమయిన ఓంకారమును బిందు (ॐ) రూపమున అధిష్ఠించినవాడు పరమాత్మ. గుణత్రయరూపమయిన సూర్యబింబమును అధిష్ఠించినవాడు సూర్యుడు. యోగులకు జ్ఞానసూర్యుడే మోక్షమార్గము. **"నాన్యః పంథా అయనాయ విద్యతే"** అని శ్రుతి. భౌతిక సూర్యమండలభేదనం చేస్తేనే యోగులకు మోక్షము అని గూడా శ్రుతి. త్రయానికి ఆధారం ప్రణవం. అలానే సూర్యమండలమున్ను. కనుక అది ప్రణవస్వరూపము. ఇలా అంతర్యామి బహిర్యామి అయిన ఆదిత్య మండలమును ముక్తికోసం శరణుకోరితిని.

**విశేషములు–వివరములు :**

1) అంతః అంటే లోపల జ్ఞానభూమికలో ప్రథమస్పందముగా వెలిగినది. అది యోగిజనులకు మాత్రమే అందుతుంది.

2) త్రయీ అంటే సృష్టిస్థితిసంహారములు–రజః సత్వతమస్సులు–బ్రహ్మవిష్ణురుద్రులు–అకారఉకారమకారములు–హ్రస్వదీర్ఘప్లుతములు–భూర్భువస్సువర్లోకములు–సామ ఋక్యజుః– ఇలా అన్ని త్రయములు. ఇవి ప్రణవములో, సూర్యమండలములోను సంకేతముగా ఉన్నట్లు చెప్పారు. బృహదారణ్యచ్ఛాందోగ్యములను చూడాలి. వీటి అవిభక్త ప్రకాశమే 'బిందువు'.

3) బిందువు– ఇది ఉన్మనా స్థితికి సంకేతము. పరమశివతత్త్వము.

4) ప్రణవము అనగా **"ప్రకర్షేణ నూయతే"** అనగా ఎక్కువగా పరతత్త్వం దీనిచే విమర్శింపబడుతుంది. అనే అర్థంలో 'ప్రణవము' అవుతుంది. తనే బాగా విమర్శింపబడుతుంది గనుక ప్రణవం అని గూడా చెప్పవచ్చును.

5) **స్వచ్ఛందతంత్రంలో** "**నవయోజనసాహస్రో విగ్రహోఽర్కస్య మండలమ్‌।**, త్రిగుణమ్" అని భౌతికసూర్యబింబము 9000 యోజనాలు విశాలమయినదని అది సూర్యుని శరీరమని, త్రిగుణమని చెప్పబడినది.

6) అంతస్సూక్ష్మం అంటే ఒక వస్తువును చూచినపుడు మన మనస్సులో ఒక ప్రాథమిక స్పందం రేఖామాత్రంగా గోచరిస్తుంది. ఇది 'సూక్ష్మం' అలాగే ఆదిత్యునికి స్థూలరూపం అందరికి తెల్సినదే. ఆయన సూక్ష్మరూపం, పైన చెప్పినట్లు, ప్రాథమికస్పందరూపంగా ఏర్పడిన ఒక నిర్వికల్పభావన. దానిని 'ప్రథమాభాస' అంటారు.

**శ్లో॥ యస్మిన్ సోమః సురపితృనరైరన్వహం పీయమానః**
**క్షీణః క్షీణః ప్రవిశతి యతో వర్ధతే చాపి భూయః।**
**యస్మిన్ వేదా మధుని సరఘాకారవద్భాన్తి చాగ్రే**
**తచ్చణ్డాంశోరమితమమృతం మణ్డలస్థం ప్రపద్యే॥** 8

**ప్రతిపదార్థము :** సోమః=సమస్తప్రమేయవర్గము/ చంద్రుడు, సురపితృనరైః=దేవ పితృదేవ



**ప్రతిపదార్థము : 1) (అంతస్సూర్యపరంగా)** భగవన్=జ్ఞానసూర్య!, మధ్యసంస్థః=అగ్నీషోముల మధ్యనున్నవాడవై, ఖే=శూన్యప్రమాతయందు, సాపత్న్యేన=ఎదురుబదురుగా, అభిముఖమివ=అభిముఖంగా, ఇందుభాసా=చంద్రకాంతితో/ఆప్యాయనమయిన అపానకాంతితో, సుప్తయోః=లీనమయినవియు, కాంతయోః=తమవిజ్ఞానంతో రమణీయ మయినవియు అగు, ద్యావాపృథ్వ్యోః=ఆత్మరూప–అంతరిక్షమునకు దేహరూప భూమికిన్ని, వదనకమలే=శక్తికమలములను (నాద, కమలములను) (ఆత్మకు శక్తి, దేహానికి కమలము), గోముఖైః=అనుత్తర కిరణములచే, బోధయిత్వా=వికసింపజేసి, షడ్రస=ఆరు రుచులయొక్క (ఆరుచక్రముల/కమలములయొక్క రసములు), ఆస్వాద=ఆస్వాదించుట యందు, లోలః =ఆసక్తుడవై, గర్భాధాన=తనలో విశ్వమును విత్తుట, ప్రసవ=విశ్వమును ప్రకాశింప జేయుటలయొక్క, విధయే=విధానముకొఱకు, పర్యాయేణ=ఉన్మేషనిమేష క్రమములతో, ఆ పిబసి=త్రాగుచున్నావు.

**తాత్పర్యము–1 :** ద్యావాపృథివులు అంటే మనలోని ఆత్మ మన శరీరం. ఒకటి పైది, మఱొకటి క్రిందది. '2' ఎదురుబదురుగా ఉంటాయి. ప్రాణశక్తి ఊర్ధ్వగతి. అపానశక్తి అధోగతి. ప్రాణం జ్ఞానశక్తి, అపానం క్రియాశక్తి. ఇది సంసారసంకేతము అగ్నీషోములు అంటే ప్రాణాపానములకు సంకేతము. కనుక శరీరంలోని ఆత్మ, ఇతర ఇంద్రియాదులు అన్నీ సంసారదశలో చంద్రకాంతితో అనగా అపానకాంతిలో ఆహ్లాదం పొందుతుంటాయి ఈ '2' ద్యావాపృథివులు. వీటిమధ్యన అనగా సుషుమ్నానాడిలో ఉన్నవాడు జ్ఞానసూర్యుడు. ఆయన తన జ్ఞానకిరణాగ్రాలతో శరీరంలోని కమలాలను (షట్చక్రాలు, షట్కమలాలు శరీరంలో ఉంటాయి). నాదాన్ని (వదనం–వాదం–నాదం) మేల్కొలుపుతాడు. ఆయనకు ఈ షట్కమలాలలోని సామరస్యరూపమయిన అసాధారణ శాక్త–ఆనందరసం మీద ఆసక్తి. అందువలన పర్యాయములుగా అనగా ఉన్మేషనిమేషములుగా అనగా సమాధిదశలుగా (లోకవ్యవహారదశలు–సమాధిదశలు–2 ఉంటాయి కదా! జీవికి) ఈ ద్యావాపృథివీ రసములను ఆస్వాదిస్తున్నాడు. దీనికి ప్రయోజనం గర్భాధానం. ప్రసవం అన్నాడు కవి. గర్భాధానం అంటే తనలో విశ్వాన్ని 'లీనం' చేయటం, ప్రసవం అంటే విశ్వాన్ని 'భాసనం' చేయటం. అనగా భగవంతుడు ఆత్మ, శరీరాలమధ్య జ్ఞానరూపంగా ఉండి సమాధి ఆనందాన్ని, భౌతికానందాన్ని ఆత్మరూపంగా అందిస్తూ అనుభవిస్తూ ఉన్నదని సారాంశము.

**2) (బాహ్యసూర్యపరంగా)**–భగవన్!=సూర్యనారాయణా!, మధ్య=అంతరిక్షమధ్యమున, సంస్థః=ఉన్నవాడవై, ఖే=ఆకాశమున, సాపత్న్యేనేవ=సవతితనముతో ఉన్నట్లు, అభిముఖమ్= ఎదురు బదురుగా, ఇందుభాసా=చంద్రకాంతితో, సుప్తయోః =నిద్రించుచున్నట్లున్న, కాంతయోః=మనోహరమయినవియు అగు, ద్యావాపృథ్వ్యోః =భూలోకస్వర్గలోకములయొక్క, వదనకమలే=ముఖకమలములను, గోముఖైః =కిరణాగ్రములచేత, బోధయిత్వా=వెలిగించి, షడ్రస=భూ, అంతరిక్ష సంబంధమయిన

**తాత్పర్యము :** జీవుని శరీరమున నుండు 'ద్వంద్వ' సముదాయము-అగ్నీషోములు, ప్రకృతిపురుషులు, బిందునాదములు, ప్రాణాపానములు, రాత్రిపగలు, సత్యాసత్యములు, ధర్మాధర్మములు, సత్తాసత్తలు-వీటినన్నింటిని ధ్యానయోగంలో జ్ఞానంలో కఱగించి ఆత్మ నిష్ఠుడయిన యోగి ద్వంద్వాతీతనిర్గుణపరబ్రహ్మమూర్తివయిన నిన్ను చేరగలడు.

**విశేషములు-వివరములు :**

1) ప్రాణాపానములు 'నిత్యప్రవాహం'గా ఉండేవి కనుక 'నిత్యములు' అని వ్యాఖ్యాత.

2) అయితే శరీరమున్నంతవఱకే ప్రాణాపాన నిత్యత. అదేవిధంగా శరీరంలో అగ్నీషోమాదులు నిత్యులే. కనుక 'నిత్య' విశేషణం అగ్నీషోమాదులకు అర్థమే.

3) శరీరంలోనే ప్రాణాపానములే మిగిలిన ద్వంద్వాలకు మూలమని-వ్యాఖ్యాత. అందువలన **'సతతవాహినౌ ప్రాణాపానావేవ కవలనాప్యాయనహేతుత్వాత్ అగ్నీషోమౌ....'** అని చెప్పాడు.

| | ప్రాణం | అపానం |
|---|---|---|
| 4) | కబళిస్తుంది కనుక **అగ్ని** | ఆహ్లాదపరుస్తుంది కనుక **సోముడు**. |
| | జ్ఞానశక్తి కనుక **పురుషుడు** | క్రియాశక్తి కనుక **ప్రకృతి**. |
| | వేదనం అనగా జ్ఞానం కనుక **బిందువు** | విమర్శం కనుక **నాదం**. |
| | ప్రసారకారకం కనుక **దినం** | విశ్రాంతికారకం కనుక **నిశ**. |
| | వికాస కారణం కనుక **సత్యం** | సంకోచకారణం కనుక **అనృతం**. |
| | ఊర్ధ్వగతికారణం కనుక **ధర్మం** | అధోగతికారణము కనుక **అధర్మం**. |
| | సత్తకు సూచన-**సత్** | అసత్తకు సూచన-**అసత్**. |

-అని వ్యాఖ్యాత 'క్షేమరాజపండితుడు'.

5) ప్రకృతిపురుషులు అనగా ఇడాపింగళానాడులు-అని ఇతర తంత్రగ్రంథాలు చూ॥
**వామగాయా ఇడానాడీ శుక్లాచంద్రస్వరూపిణీ**
**శక్తిరూపా హి సా దేవీ సాక్షాదమృతవిగ్రహా॥**
**దక్షే తు పింగళానామ పుంరూపా సూర్యవిగ్రహా**
**రౌద్రాత్మికా మహాదేవీ దాడిమీకేసరప్రభా॥** - అని **సమ్మోహనతంత్రం**లో ఉన్నది.

మరికొందరు **"పుంప్రకృత్యాత్మకౌ ప్రోక్తా బిందుసర్గౌ మనీషిభిః"** అన్నారు. **(చక్రకౌముది)**. అనగా ప్రకృతిపురుషులు అంటే బిందుసర్గములు. అవే హంసలని, శ్వాసనిశ్వాసలని చెప్పారు.

**శ్లో॥ గర్భాధానప్రసవవిధయే సుప్తయోరిన్దుభాసా**
**సాపత్న్యేనాభిముఖమివ ఖే కాన్తయోర్మధ్యసంస్థః॥**
**ద్యావాపృథ్వ్యోః వదనకమలే గోముఖైర్బోధయిత్వా**
**పర్యాయేణాపిబసి భగవన్! షడ్రసాస్వాదలోలః॥** **26**



మనుష్యులచేత/ప్రమాతలు/జీవులచేత, అన్వహమ్=ప్రతిరోజు, పీయమానః =త్రాగబడుచున్న వాడై, క్షీణః క్షీణః=కృశుడై, కృశుడై, యస్మిన్=ఏ సూర్యునియందు, ప్రవిశతి=ప్రవేశించునో, యతః=ఏ సూర్యునివలన, భూయశ్చాపి=మఱల, వర్ధతే= పెరుగుచుండునో, యస్మిన్=ఏ సూర్యునియందు, వేదాః=వేదములు, మధుని= తేనెతుట్టెయందు, సరఘాకారవత్=తేనెటీగల వలె, అగ్రే=ఎదుట, భాంతి చ=ప్రకాశించునో/ ఏకవాక్యతగా భాసించునో, తత్=ఆ, చండాంశోః=సూర్యునియొక్క, మండలస్థమ్= మండలమునందున్న, అమితమ్=అమిత మయిన, అమృతమ్=అమృతమును, ప్రపద్యే=ఆశ్రయించెదను.

**తాత్పర్యము :** అంతస్సూర్యుడు జ్ఞానము. ఆయననుంచి స్ఫూర్తిని బొందుచు ఆయనచుట్టు తిరుగుచు సర్వజీవులకు ఆనందమును పంచేది ప్రమేయమయిన ప్రపంచము. అదే చంద్రుడు. ప్రతిదినము కలాగ్రాసయుక్తితో జీవులచేత అనుభవింపబడే యీ మేయప్రపంచ చంద్రుడు మఱల క్షీణుడై హృదయవిశ్రాంతి తర్వాత ఈ సూర్యునిలో లీనమగును. మఱల దీనినుంచి తన శక్తిని పుంజుకొని శుక్లపక్షంలో వృద్ధి పొందుతాడు. ఈ జ్ఞానసూర్యునియందే సమస్త వేదములు తమ వాక్యములను ఏకవాక్యముగా సమన్వయంచేసి-అనగా తమ వాదాలన్నింటిని జ్ఞానమునందు సమన్వయం చేసి, పరమ-అద్వైతామృతమును పరామర్శించి వెలుగుచుండును. బాహ్యచంద్రుడు గూడా బాహ్యసూర్యుని నుంచి శుక్లపక్షమున కళలను వృద్ధి చేసికొని తేనెతుట్టెవలె పూర్ణిమ నాటికి పూర్ణ స్వరూపమును పొందును. తర్వాత కృష్ణపక్షమంతా **"ప్రథమాం పిబతే వహ్నిః"** అని శాస్త్రప్రకారము దేవతలకు గ్రాసమయి అమావాస్యకు సూర్యమండలము నందు ప్రవేశించి మఱల శక్తిని పొందుతాడు. వేదములకు సూర్యమండలము నిలయమని శాస్త్ర సంప్రదాయము. యాజ్ఞవల్క్యుడు తన వేదవిద్యలను గురువులకు తిరిగి సమర్పించి సూర్యునివద్ద వేదం తిరిగి పొందినట్లు కథ. అట్టి సూర్యబింబస్థితమయిన అమృతమును నేను కోరుకొనుచున్నాను.

**విశేషములు-వివరములు :**

1) మధ్యనాడీనివిష్టమయిన చిద్భానుమండలమున పరమానందరూపమయిన 'అమృతం' ఉన్నది.

2) జీవులు ప్రమాతలు. చంద్రుడు మేయవర్గమయిన విశ్వము. ఇది జీవులచే అనుభవింపబడుతున్నది. క్షీణిస్తుంది. తరువాత నిద్రలో హృదయవిశ్రాంతిలో అమావాస్య వంటిదానిలో ఇదంతా లయమవుతుంది. తర్వాత మఱల దానినుంచి సంసారం పుట్టుంది.

3) ఇందులో 'సోమ' అంటే 'ప్రాణాపాన' సూచకము. దేవ పితృ మనుష్యులు, సాత్త్విక, రాజస, తామస వృత్తులకు గూడా ఇది సంకేతము. ప్రాణాపానములు అంతరబాహ్య వృత్తులద్వారా లోపల బయట కలియటం ద్వారా (ద్వాదశాంతం)

జీవనహేతువు లవుతున్నాయి. ఇలా ప్రాణాపాన సంధిగా అయిన 'సూర్యుడు' ఈ శ్లోకంలో వర్ణితుడు.

**శ్లో॥ ఐన్ద్రీమాశాం పృథుకవపుషా పూరయిత్వా క్రమేణ**
**క్రాన్తాస్సప్త ప్రకటహరిణా యేన పాదేన లోకాః।**
**కృత్వా ధ్వాన్తం విగలితబలివ్యక్తిపాతాలలీనం**
**విశ్వాలోకస్స జయతి రవిః సత్త్వమేవోర్ధ్వరశ్మిః॥ 9**

**ప్రతిపదార్థము :** యేన=ఏ సూర్యునిచేత, పృథుకవపుషా=అల్పశరీరముతో/ వామన శరీరంతో, ఐంద్రీమ్=ఇంద్రసంబంధమయిన, ఆశామ్=ఆశను/దిక్కును, పూరయిత్వా= నింపి, క్రమేణ=క్రమంగా, ప్రకట=స్పష్టమయిన, హరిణా=నేత్రాదిశక్తులుగల/ గుర్రములుగల ఏ సూర్యునిచేత/ త్రివిక్రమునిచేత, పాదేన=కిరణముచేత/ పాదముచేత, సప్త=ఏడు, లోకాః=లోకాలు, క్రాంతాః=ఆక్రమింపబడినవో, సః=ఆ, విశ్వాలోకః= విశ్వమునకే వెలుతురయిన వాడును, ఊర్ధ్వరశ్మిః=గొప్పకిరణములుగలవాడు, ఊర్ధ్వకిరణములు గలవాడు, సత్త్వమ్= మహాప్రకాశాత్మస్వరూపుడైన, రవిః ఏవ=చిద్భానుడే/ సూర్యుడే, విగలిత= హరింపబడిన, బలి=ఆత్మయందు అనాత్మను ఆరోపించు బలమయిన, వ్యక్తి=(బలి అను వాని) స్ఫూర్తిగల, ధ్వాంతమ్=చీకటిని/అజ్ఞానమును, పాతాలలీనమ్= సంపూర్ణముగా అణగిన దానినిగా/ పాతాలలోకంలో లీనంగా, కృత్వా=చేసి, జయతి= జయించుచున్నాడు.

**తాత్పర్యము :** శ్రీహరి వామనశరీరంతో ఉదయించి ఇంద్రుని ఆశను నెరవేర్చి క్రమంగా హరిగా ప్రకటమయి పాదముతో సప్తలోకాలను ఆక్రమించి, 'బలి' వ్యక్తిత్వాన్ని శిథిలపఱచి అతని పాతాలలీనునిగాజేసి అతనినుండి విశ్వానికి విముక్తి గలిగించి వెలుగునిచ్చినవాడు. అలాగే పరమాత్మ-జ్ఞానభానుడు. అధిక రశ్మిమంతుడై మహాప్రకాశుడై ముందు ప్రథమోన్మేషంతో ప్రథమశాక్తస్పందరూపంతో ఆవిర్భవించి శరీరంలోని తూర్పుదిక్కును-ముఖభాగాన్ని నింపి, తర్వాత సృష్టిరూపపాదంతో నేత్రాది శక్తులను ప్రకటించి లోకాలను ఆక్రమించి బలమయిన "ఆత్మానాత్మాధ్యాస" అనే (అనగా ఆత్మయందు శరీరభావన, శరీరమునందు ఆత్మభావన) అంధకారమును పాతాలస్థాయికి అణచి విశ్వాలోకుడై ప్రకాశించుచున్నాడు.

**విశేషములు-వివరములు :**

1) **యో హి యస్మాద్గుణోత్కృష్టః స తస్మాదూర్ధ్వమిష్యతే॥** అను వాక్యమువలన మనకన్న గొప్పవారు మనకన్న పైన ఉన్నట్లు చెప్తాం. అలా ఊర్ధ్వరశ్మిః అన్నచోట పైన వ్యాపించిన కిరణములు అనగా విశ్వాధికమయిన కిరణములు గలవాడని అర్థం.

2) సత్త్వం-సత్తు అనగా ఉన్నది. సత్త్వం అనగా ఉనికి. ఆయన స్వరూపమే ఉనికి. అనగా 'సత్'- భగవంతుడే. సద్రూపుడు. అదే ప్రకాశము. అదే ఆయనయొక్క పరమార్థము.



=సూర్యుడు, జగతామ్= లోకములకు, ప్రాణభృత్=ప్రాణపోషకుడని, ఆత్మా=ఆత్మ అని చెప్పబడుచున్నాడు.

**తాత్పర్యము :** భగవన్ సూర్యదేవా! నీవు జ్ఞానప్రకాశకమయిన బ్రహ్మరంధ్రమునందు ప్రవేశించునటువంటి శాక్తామృత (జ్ఞాన) ప్రాణాగ్నివాయువులతో జీవునియొక్క జాగరస్వప్న సుషుప్తులను పూరించి అందులో సమరసమయి కల్పినవాటియొక్క దివ్యసారమయిన "దివ్యానందమును" నీ కిరణములతో మాటిమాటికి గ్రహించి చమత్కరించి అంతర్లీనుడవై పరాభూమికనధిరోహించి స్ఫురించెదవు. అచ్చటనుంచి యీ భోగ్య వేద్య పదార్థమును సృజించెదవు. అనగా వేద్యప్రపంచరూపంగా స్ఫురిస్తావు. కనుక ప్రాణాపానాది స్థితిహేతువయిన ఆ 'అన్నం' నీవే. ప్రాణాపానాలునున్ను నీవే. కనుకనే **"సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ"** అన్నట్లు ఈ సూర్యుడు లోకములకు ఆత్మయే, ప్రాణములున్ను సూర్యుడే. అట్లే లోకంలోనూ సూర్యుడు ముల్లోకములను తన జలతేజోవాయువులతో పూరించి మఱల వాటి సారమయిన రసమును, తన "కిరణములతో" పీల్చి మఱల భూమియందు 'ఎండ' రూపంగా ప్రవేశించి అంతర్గతంగానూ, తపింపజేసే ఓషధీరూపమయిన 'అన్నమును' సృజించి మన ప్రాణములను నిలబెట్టును. కనుక లోకాలకు 'ఆత్మ' ఆయనయే, ప్రాణపోషకుడున్ను ఆయనయే.

**విశేషములు-వివరములు :**

1) అనుత్తరమయిన కిరణములు అనగా అకారాది వర్ణములు, శ్రేష్ఠమయిన జ్ఞానకిరణములు.

2) **సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ; అహమన్న మహమన్న మన్నాదోఽహ మన్నాదః। అన్నం బ్రహ్మ, అహం చ బ్రహ్మ, భోక్తా చ బ్రహ్మ** - అను వేదవాక్యసారమిది.

**శ్లో॥ అగ్నీషోమౌ ప్రకృతిపురుషౌ బిన్దునాదౌ చ నిత్యౌ**
**ప్రాణాపానావపి దిననిశే యే చ సత్యానృతే ద్వే।**
**ధర్మాధర్మౌ సదసదుభయం యోఽన్తరావేశ్య యోగీ**
**వర్తేతాత్మన్యుపరతమతిః నిర్గుణం త్వాం విశేత్సః॥ 25**

**ప్రతిపదార్థము :** అగ్నీషోమౌ=శరీరమునందు అగ్నీషోములను, ప్రకృతిపురుషౌ=ఇడా పింగళానాడీరూపముననున్న, బిందునాదౌ=ఓంకారబిందునాదములను, నిత్యౌ=నిత్య ప్రవాహ రూపమయిన, ప్రాణాపానావపి=ప్రాణాపానములను, యే దిననిశేచ= రేయింబవళ్లను (జ్ఞానాజ్ఞానమును), ద్వే=రెండయిన, సత్యానృతే=సత్యాసత్యములను (బ్రహ్మ ప్రపంచములను), ధర్మాధర్మౌ=ధర్మాధర్మములను, సదసదుభయమ్= సత్తాసత్తా ద్వంద్వమును, యః=ఏ, యోగీ=యోగి, అంతః=ఉదానస్థానమున, ఆవేశ్య=కఱగించి, ఉపరత=వ్యాపార రహితమయిన, మతిః=బుద్ధిగలవాడై, ఆత్మని=తనయందే, వర్తేత=ఉండునో, సః=ఆ యోగి, నిర్గుణమ్=గుణరహితుడ వయిన, త్వామ్=నిన్ను, విశేత్=ప్రవేశించును.

2) **సప్త అధోలోకాలు**-అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళములు.

**సప్తసముద్రాలు**-లవణ, ఇక్షు, సురా, ఘృత, దధి, క్షీర, జలసముద్రాలు.

**సప్తర్షులు**-మరీచి, అత్రి, అంగీరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వశిష్ఠుడు. (సప్తమన్వంతరాలను బట్టి ఈ ఋషులు మారుతారు).

**సప్తపర్వతములు**-మహేంద్రము, మలయము, సహ్యము, మాల్యవంతము, ఋక్షము, వింధ్యము, పారియాత్రము, **లేదా** ఉదయ, అస్తమయ, వింధ్య, మేరు, హిమ, త్రికూట, లోకాలోకములు.

**సప్తద్వీపములు**-జంబూ, ప్లక్ష, శాల్మల, కుశ, క్రౌంచ, శాక, పుష్కరములు.

**సప్తలోకాలు**-భూ, భువః, సువః, మహః, జన, తపః, సత్యలోకాలు.

**సప్త-ఆధులు**-మోహో మదశ్చ గర్వశ్చ విషాదః క్రోధ ఏవ చ భయం చ హర్షణం చైవ దేహే సప్తాధయః స్మృతాః॥

**సప్తబీజములు**-శాలి, వ్రీహి, శూక, శుంబి, యవ, సర్షప, శ్యామాక.

**సప్తచ్ఛందస్సులు**-గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి.

**సప్తస్వరములు**-షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము.

3) అశ్వసహితుని ఉపాసన అశ్వరహితుని చేర్చటం విరోధాభాసాలంకారము. లేదా విషమాలంకారము.

**శ్లో॥ దివ్యం జ్యోతిః సలిలపవనైః పూరయిత్వా త్రిలోకీ-**
**మేకీభూతం పునరపి చ తత్సారమాదాయ గోభిః।**
**అన్తర్లీనో విశసి వసుధాం తద్గతస్సూయసేఽన్నం**
**తచ్చ ప్రాణాస్త్వమితి జగతాం ప్రాణభృత్సూర్య ఆత్మా॥ 24**

**ప్రతిపదార్థము :** జ్యోతిస్సలిలపవనైః=బ్రహ్మరంధ్రమున ప్రవేశించునట్టి శాక్తామృతప్రాణ, మరుత్తులతో/నిప్పు, నీరు, గాలులతో, త్రిలోకీమ్=ముల్లోకములను/జాగరస్వప్న సుషుప్తులను, పూరయిత్వా=నింపి, ఏకీభూతమ్=పై త్రిలోకియందు కలిసిపోయినదియు, దివ్యమ్=తుర్యానందరూపమైన/ దివ్యమైన, తత్సారమ్=రసరూపమయిన వాటి సారమును, గోభిః=అనుత్తరమయిన కిరణములతో/కిరణములతో, పునరపి చ=మాటి మాటికి, ఆదాయ=తీసికొని, అంతః=అంతర్ముఖస్థానమున/అంతర్గతంగా (ఎండుగా), లీనః= కల్పినవాడవై/ వేడిరూపంతో చేరినవాడవై, వసుధామ్=పరాభూమికను/ భూమిని, విశసి=పరాభూమి రూపంగా ప్రకాశించుచున్నావు/ప్రవేశించుచున్నావు. తద్గతః=ఆ వసుధలో ఉన్నవాడవై, అన్నమ్=భోగవిషయమయిన పదార్థ (వేద్య) సమూహమును/ అన్నమును, సూయసే=కనుచున్నావు. అనగా పదార్థరూపంగా స్ఫురించుచున్నావు. తచ్చ=ఆ అన్నమున్ను, ప్రాణః=ప్రాణాలున్ను, త్వమితి=నీవేనన్న కారణంగా, సూర్యః



3) అట్టి ప్రకాశస్వరూపుడు కనుక ప్రకాశంలోనే విశ్వం నిమగ్నం అయి ఉన్నది కనుక ఆయన విశ్వాలోకుడు.

4) ఐంద్రదిక్కును పూరించడం అంటే శరీరంలో తూర్పువైపు వచ్చే ఉన్మేషదశ. అది యోగులకు మాత్రమే అర్థమయ్యే సూక్ష్మశాక్త స్పందము. దాంతో పూరించడం అంటే ప్రాణాయామంద్వారా చిత్తుకు ప్రాధాన్యం కల్పించడం. ప్రాణాదులను సంకోచించడం.

5) సప్తలోకాలు అంటే-**"శివాదిసకలాత్మాంతాః శక్తిమంతః ప్రకీర్తితాః"** అని **శ్రీ పూర్వతంత్రం** చెప్పినట్లు, శివమంత్ర, మహేశ్వరమంత్ర, ఈశ్వరమంత్ర, విజ్ఞానాకల, ప్రలయాకల, సకల- ఇవి "7" లోకాలు.

6) పాదము అంటే "పాదోస్య విశ్వాభూతాని" అన్నట్లుగా పాదభాగమయినది యీ సృష్టి. ఈ సప్తలోకాలను ఆక్రమించటం తన వెలుగుతో నింపటం. దీపం ఇల్లంతా ఆక్రమించిందంటే దీపకాంతి ఇల్లంతా వెల్లివిరిసిందని అర్థం.

7) హరి-అనగా హరించునవి. రూపాది విశ్వమును హరించును గనుక నేత్రం మొ॥ వాని శక్తులు. హరులు. **"యుక్తా హ్యస్య హరయః శతా దశ"** అని శ్రుతి. అసంఖ్యాకశక్తిగలవాడు ఆత్మ అని అర్థము.

8) ఆదిత్యానా మహం విష్ణుః-గీత.

9) ఇద్దఱు సూర్యులమధ్య వామన త్రివిక్రమావతారముల మధ్య శబ్దార్థశ్లేషతో ఉపమాధ్వని.

**శ్లో॥ ధ్యాత్వా బ్రహ్మ ప్రథమమతను ప్రాణమూలే నదన్తం**
**దృష్ట్వా చాన్తః ప్రణవముఖరం వ్యాహృతీః సమ్యగుక్త్వా।**
**యత్తద్వేదే తదితి సవితుః బ్రహ్మణోక్తం వరేణ్యం**
**తద్భర్గాఖ్యం కిమపి పరమం ధామగర్భం ప్రపద్యే॥ 10**

**ప్రతిపదార్థము :** ప్రథమమ్=ముందుగా, అతను=అకారశరీరుడైన, బ్రహ్మ=వీరేశ్వరుడను పేరుగల బ్రహ్మమును, ప్రాణమూలే=ప్రాణమూలమునందు అకారాదుల స్ఫురణకు ముందు, ధ్యాత్వా=చింతన చేసినతరువాత, అంతః=లోపల, నదంతమ్=పరవిమర్శ రూపమయిన నాదముగా, దృష్ట్వా=చెప్పి, ప్రణవముఖరమ్=ప్రణవోచ్చారణ పూర్వకముగా అనగా 'ఓం' కారముతో కలిపి, చతస్రః=నాలుగు, వ్యాహృతీః="భూః స్వాహా, భువః స్వాహా, సువః స్వాహా భూర్భువస్సువః స్వాహా" అను వ్యాహృతులను, సమ్యక్=పూర్తి ఏకాగ్రతతో, ఉక్త్వా=ఉచ్చరించి, బ్రహ్మణా=ప్రజాపతిచేత, వేదే=వేదమునందు, ప్రణవ ముఖరమ్=ఓంకార పూర్వకంగా, తదితి=తత్సవితుః మొదలుగా, ఉక్తమ్= చెప్పబడినదియు, సవితుః=విశ్వసూతి అయిన జ్ఞానసూర్యునియొక్క, యత్తత్ కిమపి= అనిర్వచనీయమయిన/ అసామాన్య మయినదియు, వరేణ్యమ్=వరదాన/ అనుగ్రహశీలమయినదియు, ధామగర్భమ్ =సూర్యసోమాగ్నిధామములను

క్రోడీకరించినదియు, అగు, తత్=ఆ, భర్గాఖ్యమ్='భర్గము' అనుపేరుగల, ధామ=శాక్తతేజమును, ప్రపద్యే=పొందెదను.

**తాత్పర్యము :** ప్రకాశవిమర్శములు '2' ప్రాచీన విషయాలు. అందు ప్రకాశం పరమాత్మయే. మన జీవులందరి అసలు స్వరూపము సత్యం శివం సుందరము. దానినుంచి వచ్చిన ప్రథమస్పందము శక్త్యున్మేషము. 'విమర్శము' అది పరా. అది నాదరూపం. అది ప్రాణమూలం. ముందు అకార స్వరూపమయిన ఆ ప్రకాశమును ప్రాణమూలమున స్మరించెదను. తరువాత పరవిమర్శరూపమున 'నాద' శక్తిని అంతర్గతంగా ధ్యానించెదను. విమర్శ స్వరూపమయిన లోకత్రయమును ఓంభూః స్వాహా, ఓం భువః స్వాహా, ఓం సువఃస్వాహా, ఓం భూర్భువః సువః స్వాహా" అను 4 వ్యాహృతులతో చక్కగా పలికి ఆ చిదగ్ని ప్రకాశంలో ఆహుతిచేసి వేదంలో ప్రజాపతి గాయత్రీమంత్రంలో చెప్పిన "భర్గ" అను అనిర్వచనీయమయిన సర్వకాంతి గర్భమయిన ఆ విమర్శరూపశాక్తతేజమును కొలిచెదను. అది వరేణ్యం అనగా అనుగ్రహశీలమయినది. కోరదగినది. శ్రేష్ఠమయినది.

**విశేషములు-వివరములు :**

1) ఇందులో 'ధామగర్భం'లో ధామ అన్నదానిని వివృతికర్త క్షేమరాజు విడదీసి ఒకసారి 'కర్మ'గా వాడాడు. అట్లే 'ప్రణవముఖరం' గూడా 2సార్లు అన్వయించాడు. ఆ ప్రకారం ప్రతిపదార్థంలో 2సార్లు వాడాము. **"ధామగర్భమిత్యత్ర" ధామశబ్దః తంత్రేణ ద్విరుక్తః । తథా ప్రణవముఖరమితి".**

2) శాక్తతేజస్సు అంటే 'పరిస్ఫురత్తా' అని చెప్పబడింది. ఇతర తంత్రాలలో స్ఫురత్త/స్ఫురణ అనియు చెప్పబడింది. అదే స్పందం, ఉన్మేషం అనియు చెప్పబడింది.

3) శాక్తతేజస్సు, లోపల బయట గూడా సూర్యసోమవహ్నిధామములకు మూలకారణము. వాటిని క్రోడీకరించి విజృంభించి వెలుగునట్టిది. కనుక అది ధామగర్భము.

4) అ ఇ ఉ- వీటిలో 'అ' అనేది అనుత్తరాకారమని తంత్రసంప్రదాయం. అది శివరూపము. అ-తను- అనగా 'అ' కారం తనువు అనగా శరీరంగా గలది. వీరేశ్వరుడనే బ్రహ్మమునకు ఇది పేరు.

5) ప్రాణమూలము అనగా ప్రాణాలకు మూలమయినచోటు. ప్రాణములు నాదము ఇంకా స్పందించని దశ. **అప్రాణాద్యస్ఫురత్తాధామ్ని** అనగా 'అ' మొ॥ ప్రాణములు అనగా అచ్చులు స్ఫురించనిచోట అనగా నాదమూలము అనగా 'పరా' స్థానము.

6) పరవిమర్శరూపమే నాదము. అది అంతర్నాదము. దానిని తనస్వరూపంగా సాక్షాత్కరించటం దర్శనం. దృష్ట్వా- అంటే అదే. ఈ రకమయిన నాదవిమర్శ బాగా సాగేకొద్దీ బయటపడి బలపడినది ప్రణవోచ్చారణ. దానితో వ్యాహృతులు చేస్తాం.



**శ్లో॥ యే పాతాలోదధిమునినగద్వీపలోకాధిబీజ-**
**చ్ఛన్దోభూతస్వరముఖనదత్సప్తసప్తిమ్ ప్రపన్నాః।**
**యే చైకాశ్వం నిరవయవవాగ్భావమాత్రాధిరూఢం**
**తే త్వామేవ స్వరగుణకలావర్జితం యాన్త్యనశ్యమ్॥ 23**

**ప్రతిపదార్థము :** యే=ఎవరు, పాతాల=అతలసుతల మొ॥ సప్త అధోలోకములు, ఉదధి=క్షీరం మొ॥ సప్త సముద్రములు, ముని=అద్రి మొ॥ సప్తర్షులు, నగ=మహేంద్రము మొ॥ సప్తపర్వతములు, ద్వీప=జంబూ మొ॥ సప్తద్వీపములు, లోక=భూలోకం మొ॥ సప్తలోకాలు, ఆధి=మోహము మొ॥ సప్తరోగాలు, బీజ=యవలు మొ॥ సప్త బీజములు, ఛందః=గాయత్రి మొ॥ సప్తచ్ఛందస్సులుగా, భూత=అయిన, స్వర=షడ్జము మొ॥ స్వరములు (7), ముఖ= ముఖమునందుగలవై, నదత్=వాటినే ధ్వనించుచున్న, సప్త=7, సప్తి=మనస్సు, బుద్ధి, పంచజ్ఞానేంద్రియాలు అనే గుఱ్ఱములుగల, త్వామ్=నిన్ను, ప్రపన్నాః=పొందిరో, యే చ= ఎవరు, నిరవయవ=వర్ణాది విభాగములేని, వాక్='పశ్యంతీ' వాక్కుయొక్క, భావమాత్ర= మధ్యధామమునందున్న 'స్పందము' మీదనే, అధిరూఢమ్=అధిష్ఠించినవాడవై, ఏకాశ్వమ్= (అందువలననే) ఒకే గుఱ్ఱముగల, త్వామ్=నిన్ను, ప్రపన్నాః=పొందిరో, తే=ఆ '2' రకములవారు, స్వర=సప్తస్వరములతోను, గుణ=సత్త్వాది గుణములతోను, కలా=అకారాది కలలతోను, వర్జితమ్=రహితుడవై, అనశ్వం=(అశ్వముగా ఏ ఉపాధియులేని) నిరుపాధికుడ వయిన, త్వామేవ=నిన్నే, యాంతి=చేరెదరు.

**తాత్పర్యము :** సప్తపదార్థములుగా ఉన్న అతలాది పాతాల లోకాలు, భూరాది ఊర్ధ్వలోకాలు, సప్తసముద్రాలు మొదలగునవి అన్నింటికి సప్తస్వరములు సంకేతాలు. (ఇది శబ్దసృష్టిపరంగా చెప్పిన మాట). ఇవి 7 గుఱ్ఱములుగా గల స్థూలమార్తాండుడవయిన నిన్ను కొలిచేవారు కొందఱు. అట్లే సూక్ష్మరూపంలో 'పశ్యంతీ వాగ్రూపంలో' సత్తామాత్రంగా ఉన్న ఆత్మరూపసూర్యుని సేవించేవారు కొందఱు. ఈ 2 రకముల ఉపాసకులుగూడా చివఱకు స్వర, గుణ, కలారహితమయి నిరుపాధికమయిన 'చిదర్క' నామకమయిన పరబ్రహ్మమునే చేరెదరు. అనగా 'స్థూల, సూక్ష్మ పర' భాస్కరులు ఒక్కటేననియు, వారిసేవలో ఎవరయినా పరమ గమ్యుడయిన 'భాస్కర పరబ్రహ్మమునే' చేరెదరని చెప్పినట్లు. "సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" అన్నట్లు.

**విశేషములు-వివరములు :**

1) ఓంకారములోని '3' వర్ణములు 3 లోకములకు, అట్లాగే '3' రకాల వస్తువులన్నింటికి సంకేతము. అలానే సప్తస్వరాలు సప్తసంఖ్యగల లోక, సముద్ర, ఋషి, పర్వతాదులకు సంకేతం. శబ్దసృష్టి తరువాత అర్థసృష్టి అని సృష్టిక్రమం ప్రపంచసారతంత్రము శారదాతిలకం మొ॥ గ్రంథాలలో చెప్పబడింది. ఆ విధంగా ముందు సప్తస్వరములు తర్వాత వాటి అర్థముగా భౌతికరూపాలుగా అనేక "సప్తపదార్థాలు" పుట్టినవి.

గీతప్రధానముగాను ఉండును. అట్లే బాహ్యాకారము ప్రాతఃకాలమున అరుణకిరణమై రాజసముగా సృష్టిరూపముగాను, మధ్యాహ్నకాలమున మండుచు స్వచ్ఛధవళకాంతులతో విరాజిల్లుచు సాత్త్వికముగాను, స్థితిపాలన చేయుచు, సాయంకాలము కిరణములను ముడిచికొని విశ్రాంతికారణమై తమోమయముగా లయము చేయుచు ప్రతిరోజు సృష్టిస్థితి లయములను చేయుచున్నది. అట్లే నీ చిద్రూపము హృదయమున ఉదయించిన కాలమున ప్రాణమునకు సృష్టిరూపములు ప్రాణాపానవృత్తులను అప్రధానముచేసి శివశక్తి సంఘట్టరూపముగా సుషుమ్నలో అరుణకాంతులతో ప్రత్యక్షమగును. (అరుణం అంటే చిత్రవర్ణములు లేకుండా వెలుగుట. ***అనున్మిషిత వైచిత్ర్యాత్ దీప్తాః - (వ్యాఖ్యాత)***. అదే విశ్వ ప్రకాశకము, విశ్వప్రసరానికి సూత్రధారి. ఇది పరంధామమును విమర్శించునట్టిది కనుక స్తోత్రరూపము. కనుక 'ఋక్'. ఇక మధ్యధామమున జ్ఞానదేవతాపూజారూపమయిన క్రియాశక్తి కనుక యజుస్సు. ద్వైతమును తగలబెడుతుంది కనుక ఇది 'జ్వలత్' అన్నాడు. హ్లాదం-ఆనందమనే సోముడు రావటంవలన ఇది శుక్లవర్ణం. సత్-ఉన్నది. సత్త్వం-ఉండుట. అనగా ప్రకాశించుట. అనగా తెలియుట. అట్టి "తెలివిని" ఇచ్చునది కనుక 'సాత్త్వికము'. తన ప్రకాశంతో విశ్వమును ప్రకాశింపజేసి విశ్వవ్యాపారరూపమయిన జ్ఞానదేవతా కర్మకలాపమును నెరవేర్చునది. కనుక 'స్థితి' కారకము. సాయంకాలమున అనగా ప్రపంచవ్యాపారములు అస్తమించిన తర్వాత ఊర్ధ్వతుటిలో/సమాధి క్షణంలో ప్రాణాది సంస్కారములు లయించిన సమయంలో ద్వైతాద్వైతభావములు '2' మాయమయిన క్షణంలోని నిర్వికల్పస్థితిని 'చీకటి' అని అంటారు. (యా నిశాసర్వ-లో 'నిశా' లాగా) అట్టి నిర్వికల్పరూపమున అనగా బ్రహ్మమునందు విశ్రమించి సమరసంకావటం జరుగుతుంది. అదే సామ. సమత్వం, విశ్రాంతి. "స్థూల, సూక్ష్మ, పర" అనబడు ఈ రూపము నీవే. అది త్రయీరూపం వంటిది. అశేషసృష్టిని క్రోడీకరించిన ఈ 'తుర్యశక్తి' 3 రకములుగా విజృంభించుచున్నది.

**విశేషములు-వివరములు :**

1) **ప్రాతస్సంధ్యా**-సంధ్యలు 3. ప్రాతస్సంధ్య, మధ్యాహ్నసంధ్య, సాయంసంధ్య. ఇవే దేహాంతర్గతంగానూ ఉన్నాయి. ప్రాణం (శ్వాస) ఒక దినం. దానికి 3 సంధ్యలు.

1) **హృదయం**-ఇది ప్రాణం అనగా శ్వాస ఇచ్చట నుండి బయలుదేరును. ఇది
ప్రాతస్సంధ్య.

2) **తాలువులు**-తాలుస్థానం అనగా దవడలస్థానంనుండి ఇది బయటకు వస్తుంది.
ఇది మధ్యాహ్నసంధ్య.

3) **బాహ్యద్వాదశాంతం**- ఇది సాయంసంధ్య అని యోగ సంప్రదాయం.



7) ఈ వ్యాహృతులు మేయమాన ప్రమాతలకు -వారి సంస్కారములతో సహా- పరబ్రహ్మమయత్వాన్ని చెప్పేవి. ఈ శాక్తధామములను ఏకాగ్రం చేయటం ద్వారా వీటినన్నింటిని "శాంభవధామం"లో సమరసం చేయటం ఈ వ్యాహృతి పఠన ప్రయోజనం. చూ॥ **అంతర్నిరంతరనిరింధనమేధమానే, మోహాంధకారపరిపంథిని సంవిదగ్నౌ కస్మింశ్చిదద్భుతమరీచివికాసభూమౌ విశ్వం జుహోమి వసుధాది శివావసానమ్** - అన్న శ్లోకములోను ఇదే విషయం స్ఫుటంగా ఉన్నది. ఈ విశ్వహోమమే 4 వ్యాహృతులతో సూచింపబడినది.

8) ధామగర్భం-అనగా సూర్యసోమాగ్ని ప్రకాశం-ధామ
జాగ్రత్స్వప్నసుషుప్తి ప్రకాశం-ధామ
వీటిని క్రోడీకరించినవాడు చిత్సూర్యుడు.

**శ్లో॥ త్వాం స్తోష్యామి స్తుతిభిరితి మే యస్తు భేదగ్రహోఽయం**
**సైవావిద్యా తదపి సుతరాం తద్వినాశాయ యుక్తః।**
**స్తోష్యేవాహం త్రివిధముదితం స్థూలసూక్ష్మం పరం వా**
**విద్యోపాయః పర ఇతి బుధైర్గీయతే ఖల్వవిద్యా॥ 11**

**ప్రతిపదార్థము :** స్తుతిభిః=స్తోత్రములచేత, త్వామ్=నిన్ను, స్తోష్యామి=స్తుతింపగలను, ఇతి= అని, మే=నాకు గల, యోయం తు=ఏదయితే, భేదగ్రహః=భేదబుద్ధిగలదో, సైవ=అదియే, అవిద్యా=అజ్ఞానము, తదపి=అయినప్పటికి, సుతరామ్=పూర్తిగా, తద్వినాశాయ=ఆ అవిద్యానాశమునకు, యుక్తః=సంబంధించినవాడనై, అహం=నేను, స్థూలమ్=స్థూలముగా బాహ్యసూర్యునిగా, సూక్ష్మమ్=మధ్యనాడీగతుడయిన ప్రాణబ్రహ్మరూపునిగా, పరం వా= విశ్వరూపమయిన చిదానందరూపునిగాను, త్రివిధమ్='3' విధాలుగా, ఉదితమ్= ఉదయించిన, త్వామ్=నిన్ను, స్తోష్యేవ=స్తోత్రము చేసి తీఱుతాను. ఎందుకంటే, అవిద్యా= అవిద్యయే, పరః=శ్రేష్ఠమయిన, విద్యోపాయః =విద్యకుపాయము, ఇతి=అని, బుధైః=పండితులచేత, గీయతేఖలు=చెప్పబడుచున్నదిగదా!

**తాత్పర్యము :** అయ్యా! నేను నీవు అభిన్నులము. అది జ్ఞానము. కాని నేను నిన్ను స్తుతించడం అనేది అజ్ఞానము. నేను వేఱు, నీవు వేఱు-అన్న భావం ఉంటేనే గదా స్తోత్రం చేయటం జరుగుతుంది. ఈ భావం అజ్ఞానం. కాని యీ అజ్ఞానాన్ని నివారించటానికి అజ్ఞానంలోనుంచే ఉపాయం రావాలి. గిన్నె తోమి మురికి పోగొట్టాలంటే మట్టివేసి తోమాలి. కనుకనే పండితులు విద్యను పొందే ఉపాయంకూడా 'అవిద్య'యే అన్నారు. ముల్లును తీయటానికి మరోముల్లు అవసరం కదా! కనుక స్థూలంగా ప్రత్యక్షసూర్యునిగాను, సూక్ష్మంగా అంతస్సూర్యుడయిన ప్రాణబ్రహ్మగాను విశ్వాతీతమయిన జ్ఞానసూర్యునిగాను ఉదయించిన నీ త్రివిధమూర్తిని స్తుతించితీఱతాను. అనగా స్తోత్రరూపమననం చేస్తాను.

**విశేషములు-వివరములు :**

1) స్తోత్రంలో త్రిపుటి ఉన్నది.

స్తుతించువాడు-జీవుడు-ప్రమాత.

స్తుతింపబడువాడు-దేవుడు-ప్రమేయం.

స్తుతించటం-క్రియ-ప్రమాణం.

కనుక దేవునికి జీవునికి భేదం భావిస్తేనే స్తోత్రం కుదురుతుంది. అది అజ్ఞానం అయినా జ్ఞానానికి అదే మార్గం.

2) స్తోత్రం అంటే దేహాదులయొక్క ప్రమాతృభావాన్ని-అహంకారాదులను నిమజ్జనం చేయటం.

3) అనగా స్తోత్ర,స్తుతి మొదలగు విభాగరూపమయిన అవిద్యతోనే అవిద్యాబీజమయిన దేహాభిమానం అహంకార మమకారాలు మొ॥ ప్రమాతృధర్మాలను శాంతపఱచి చిదానంద ఘనుడయిన పరమాత్మోత్కర్షను, పరామర్శించడం వలన ఈ స్తోత్రం పరమసమావేశం అనబడే జీవబ్రహ్మైక్యమును కలిగించును.

4) స్థూలంసూక్ష్మం పరం. అనగా ఇవి చిత్సూర్యుని రూపభేదములు.

1) స్థూలం-బాహ్యసూర్యమండలరూపం.

2) సూక్ష్మం-సుషుమ్నానాడీరూపం.

3) పరం-సమాధిలో అనుభూతమయిన ఆనందస్వరూపం.

**శ్లో॥ యోఽనాద్యన్తోప్యతనురగుణోఽణోరణీయాన్ మహీయాన్**
**విశ్వాకారః సగుణ ఇతి వా కల్పనాకల్పితాఙ్గః।**
**నానాభూతప్రకృతివికృతీర్దర్శయన్ భాతి యో వా**
**తస్మై తస్మై భవతు పరమాదిత్య! నిత్యం నమస్తే॥ 12**

**ప్రతిపదార్థము :** హే పరమాదిత్య=ఓ జ్ఞానసూర్యా!, యః=ఏ నీవు, అనాద్యంతః =దేశకాలాదులు లేనివాడవని, అపి=మఱియు, అతనుః=దేహరహితుడవని, అగుణః =నిర్గుణుడవని, అణోః=అణువుకన్న, అణీయాన్=పరమసూక్ష్ముడవని, మహీయాన్=పరమ స్థూలుడవని అనగా వ్యాపకుడని, విశ్వాకారః=విశ్వమును క్రోడీకరించినవాడు కనుక విశ్వరూపుడవనియు, సగుణ ఇతివా=సగుణుడవనిగాని, కల్పనా=రకరకాల కల్పనలతో, కల్పిత=కల్పింపబడిన, అంగః=శరీరము కలవాడవని, యః=ఏ నీవు, నానాభూత=అనేక భూతములయొక్క, ప్రకృతి=ప్రకృతులను (మాయాప్రకృతి శుక్రశోణితాదులకారణము లందు), వికృతీః=కలా, బుద్ధి దేహాది వికారాలను, దర్శయన్=చూపుచు, భాతివా= ప్రకాశించునో, తస్మై తస్మై=ఆయా స్వరూపములుగల, తే=నీకు, నిత్యం=సదా, నమః =నమస్కారము, భవతు=అగుగాక!

**తాత్పర్యము :** జ్ఞానసూర్యా! నీవు ఆద్యంతరహితుడవని నిరాకారుడవని, నిర్గుణుడవని అణుతమస్వరూపుడవని, మహాపరిమాణుడవని, విశ్వరూపుడవని, సగుణమూర్తివని రకరకాల కల్పనలతో స్తుతింపబడుచున్నావు. అట్లే నీవు స్థావరాది బ్రహ్మాండాంతమయిన



7) ఈ ప్రణవం 'ఖం' అనగా ఆకాశంలో ఉదయించింది. సుషుమ్నాకాశంలో 5 ఆకాశాలున్నాయి. అందు సర్వాతీతమయిన ఆకాశమునందు వ్యాపించినది.

8) కరణం అంటే సాధారణ శబ్దసాధనములయిన జిహ్వాదంతాదులు కావు. అవి మధ్యమావైఖరుల విషయంలో వస్తాయి. ఇది 'పశ్యంతీ' వాక్కు విషయం. అందువలన దీని సాధనం 'దివ్యకరణము'.

**దివ్యం తు కరణం కృత్వా తత్త్వస్యోచ్చారణం కురు** - శ్రీ స్వచ్ఛందతంత్రం.
మరింత వివరణకు చూ॥ 50వ శ్లోకం.

9) ప్రణవం భగవంతునికి 'వాచకం' అంటే శబ్దబ్రహ్మతత్త్వము అయిన (సత్) శక్తి స్వరూప పరామర్శం ద్వారా భగవంతుని (తత్) స్వరూపమును విమర్శించును.

**శ్లో॥ ప్రాతస్సన్ధ్యారుణకిరణభాగృఙ్మయం రాజసం య**
**న్మధ్యే చాపి జ్వలదివ యజుః శుక్లభాః సాత్త్వికం వా।**
**సాయం సామాస్తమితకిరణం యత్తమో ల్లాసి రూపం**
**సాహ్నః సర్గస్థితిలయవిధావాకృతిస్తే త్రయీవ॥ 22**

**ప్రతిపదార్థము :** ప్రాతః=హృదయంలో ఉదయించిన కాలమున/ ప్రొద్దున, సంధ్యా= ప్రాణాపానముల ఘర్షణతర్వాత శివశక్తియోగరూపమయిన సంధిలో/ సంధ్యా కాలమున, అరుణ=చిత్రవర్ణరహితమై వెలిగిన/ ఎఱ్ఱని, కిరణ=శరీరాదులను/నేత్రాది ప్రకాశములను/ కిరణములను, భాక్=పొందినది కనుకనే, రాజసమ్=విశ్వమును వెలిగించుచు ప్రసరింప జేయు/రజోగుణ సంబంధమయిన, యత్=ఏ, ఋఙ్మయమ్=పరంధాముని విమర్శించునదో/ స్తోత్రప్రధానమయిన ఋగ్వేదరూపమును, మధ్యే చాపి=సుషుమ్న మధ్యభాగమున/ మధ్యాహ్నమున, జ్వలదివ=ద్వైతమును తగులవేయుచున్నట్లుగా/ మండుచున్నట్లు, శుక్ల=హ్లాదరూపమయిన సోమవ్యాప్తివలన నిర్మితమై/ తెల్లనై, సాత్త్వికం వా=సత్త్వమును అనగా సర్వభూతములకు తన ప్రకాశముతో ఉనికిని ప్రకాశించునదై (స్థితికాలం కనుక), యత్=ఏ, యజుః=చిద్దేవతాపూజాత్మకమయినదో/ క్రియాత్మక యజుర్వేద రూపమును, సాయమ్=ఊర్ధ్వతుట్యర్థమున (సమాధికాలమున) (లయ కాలమున), అస్తమిత=లయించిన, కిరణమ్=ప్రాణాది సంస్కారములు/ కిరణములు గలదై, తమః=ద్వైతాద్వైతములు తెలియని చీకటివంటి/చీకటి సంబంధమయిన, యత్=ఏ, సామ= సమరసమయిన/ గానరూపసమర సహేతువయిన సామరూపమును, లాసి=గ్రహించు చున్నావో, సా=అ, తే=నీయొక్క, ఆకృతిః=ఆకారము, అహ్నః =ప్రాణదినమునకు/ పగటికి, సర్గస్థితిలయ=సృష్టిస్థితిలయముల యొక్క, విధౌ=విధానమునందు, విజృంభతే= విజృంభించుచున్నది.

**తాత్పర్యము :** భగవన్! భాస్కరా! నీ శరీరము వేదత్రయీ తుల్యము. అందు ఋగ్వేదము ఉదయకాలమున ప్రార్థనారూపముగాను, యజుర్వేదము మధ్యాహ్నకాలమున కర్మకలాప విధానరూపముగాను, సాయంకాలమున సామవేదము విశ్రాంతిహేతువయిన

**హకారేణ బహిర్యాతి సకారేణ విశేత్పునః** – అదే నాదం అంటారు.
**నాదాఖ్యం యత్పరం బీజమ్** – అని శ్రీకాలోత్తరతంత్రం.

2) అది వేద్యం. అంటే "తెలియదగినది" అనే అర్థం తప్పని వ్యాఖ్యాత క్షేమరాజు చూ॥ **"న తు విదిక్రియాకర్మాత్మకమ్"** అన్నాడు. మఱి దాని అర్థం ఏమిటంటే **"సుప్రకట సుస్ఫురత్తాత్మకత్వాదనపహ్నవనీయమ్"** అని చెప్పాడు. అంటే మనలో ప్రాణనాదం స్పష్టంగా స్ఫురిస్తున్న స్ఫురణ/ స్ఫురత్త. కనుక అది కాదన/ లేదనరానిది. కనుక వేద్యం అనగా ఉన్నదని తెలియశక్యమయినది. కచ్చితంగా తెలియదగినది కాదు అని అర్థం. అంటే భగవంతుడున్నాడని తెలిసిన సంగతి. కాని స్పష్టంగా 'ఇదమిత్థం' అని తెలియరాదు.

1) యస్య రూపం శరీరం వా నాస్తి వర్ణః క్రియా తథా।
స కథం గృహ్యతే సూక్ష్మో హ్యగ్రాహ్యో నిత్యమవ్యయః॥ –స్వచ్ఛందతంత్రము.

2) నైష వర్ణో న వా శబ్దో న చైవాయం కలాత్మకః
కేవలం పరమానందో వీరో నిత్యోదితో రవిః
నాస్తమేతి న చోదేతి న శాంతో న వికారవాన్
సర్వభూతాంతరచరో భానుర్భర్గ ఇతి స్మృతః॥ –శ్రీ భర్గశిఖ

3) **ఓం తత్సదితి నిర్దేశః బ్రహ్మణః త్రివిధః స్మృతః** – ఆగమం.
బ్రహ్మమునకు 3 సంకేతాలు. 1) ప్రణవం. 2) తత్ 3) సత్.
ఇందులో తత్–పరబ్రహ్మ ఆత్మశక్తిగల రూపము. / చిదర్కరూపం.
సత్– శక్త్యాత్మబ్రహ్మరూపం. వీరు కలసి ఏర్పరచినది 'శబ్దబ్రహ్మం'.
తత్–బిందువు. సత్–నాదము.

4) అకారం అనుత్తరాకారం పరశివరూపం. దానిని విమర్శ చేయటంవలన శక్తిరూపం అయిన ఇ, ఉ మొ॥ పుట్టాయి. కనుక ప్రణవంలోని అకారాదులు కలలు/విమర్శలు.

5) శక్తిమంతుడయిన (సత్) జ్ఞానార్కుడు (తత్) కలిసి ఏర్పఱచిన 'శబ్దబ్రహ్మము' (పరా) అనే భిత్తి–గోడ (అధిష్ఠానమునందు) 'పశ్యంతీ' వాక్ప్రధానంగా 'ప్రణవం' ఏర్పడినది. అది అవ్యక్తము. కనుక మధ్యమావైఖరీ రూపంకాదు. ఇవి వ్యక్తవాక్కులు. **"ప్రణవః సర్వవేదేషు"** అని ప్రణవస్థితివలన సర్వవాచ్యవాచక విస్తారమును ప్రణవం క్రోడీకరించినట్లు.

6) ఈ ప్రణవం బిందునాదములనుండి పుట్టుంది. బిందుస్వరూపం **"సమస్తవేద్యాభేది వేదనం"** అని వ్యాఖ్యాత. అంటే సమస్తప్రపంచంతో అభేదంగల పరమాత్మను తెలిపేది–అనగా జ్ఞానం. నాదం అంటే 'సమస్తవాచకాభేది పరామర్శం' అని వ్యాఖ్యాత. అనగా సమస్తశబ్దములతోను అభిన్నమయిన శబ్దబ్రహ్మను పరామర్శించేది. అనగా 'ప్రాణధ్వని'. పరానాదము.



ప్రాణులను, వారి మాయాప్రకృతులయిన శుక్రశోణితాదికారణాలను, వికృతులయిన కలా బుద్ధి దేహాదికాలను చూపుచు విశ్వరూపునిగా భాసించుచున్నావు. అట్టి సగుణనిర్గుణ మూర్తివయిన నిన్ను నిత్యము నమస్కరించెదను.

**విశేషములు–వివరములు :**

1) పర, సూక్ష్మ, స్థూలరూపుడయిన ఆదిత్యునకు ఇది స్తోత్రము. దేశకాలాది విభాగమునకు అతీతుడు. ఆకారపరిమితి లేనివాడు. యోగిదృశ్యమయిన పరమాణువు కన్న అజ్ఞేయుడు. స్వప్రకాశజ్ఞానైకరూపం గలవాడు. విశ్వమును క్రోడీకరించియుండుట వలన విశ్వాకారుడు. సర్వజ్ఞత మొ॥ గుణములు గలవాడు.

2) **కల్పనాకల్పితాంగః**–దీనికి మఱో అర్థము.–
ధర్మరూపమయిన అవయవభాగాలు కలవాడు. ఇవన్నీ కల్పనలు అనటంవలన పరిచ్ఛేదంగల వస్తువుల విషయంలో ఉన్న శబ్దవికల్పములు ఆయనకు అంటవు. ఆయన అతీతుడు, అఖండుడు, అపరిమితుడు అని ధ్వని.

3) దర్శయన్–సంకుచితమయిన అనగా పరిమితమయిన సర్వాభాసపదార్థములకు అధిష్ఠానంగా ఉండి, వెలుగుగా ఉండి వాటిని ప్రకాశింపజేయువాడని అర్థము.

4) సగుణః–అంటే సర్వజ్ఞత, తృప్తి, అనాది, జ్ఞానం, స్వాతంత్ర్యం అనంతశక్తి మొదలయినవి.

**శ్లో॥ తత్త్వాఖ్యానే త్వయి మునిజనా నేతి నేతి బ్రువన్తః
శ్రాన్తాస్సమ్యక్ త్వమితి న చ తైరీదృశో వేతి చోక్తః।
తస్మాత్తుభ్యం నమ ఇతి వచోమాత్రమేవాస్మి వచ్మి
ప్రాయో యస్మాత్ప్రసరతి తరాం భారతీ జ్ఞానగర్భా॥ 13**

**ప్రతిపదార్థము :** త్వయి=నీ విషయమై, తత్త్వాఖ్యానే=తత్త్వం చెప్పటంలో, మునిజనాః =మునులు, నేతి నేతి=కాదు, కాదు అని (చూ॥తాత్పర్యం), బ్రువంతః=చెప్పుచూ, శ్రాంతాః =అలసిపోయిరి. తైః=ఆ మునులచే, త్వమ్=నీవు, ఇతి=ఇలా అని, ఈదృశోవేతి=ఇట్టి వాడవనిగాని, నోక్తఃచ=చెప్పబడలేదు. యస్మాత్=ఎందువలన/ ఏ నీ నుంచి, జ్ఞానగర్భా= జ్ఞానపూర్ణమయిన, భారతీ=పశ్యంతి మొ॥వాక్కు, ప్రాయః=బహుశః, ప్రసరతితరామ్= మిక్కిలి ప్రసరించుచున్నదో, తస్మాత్=అందువలన, తుభ్యమ్=నీకు, నమ ఇతి= నమస్కారమని, వచోమాత్రమేవ=వచనమాత్రమునే, అస్మి=నేను, వచ్మి=చెప్పుచున్నాను.

**తాత్పర్యము :** పరమాదిత్యమూర్తీ! నీ తత్త్వం వివరించటం ఉపనిషత్తులకు అందులోని ద్రష్టలయిన మునులకు సాధ్యం కాలేదు. అందువలన వారు "అది హ్రస్వం కాదు, శబ్దం లేదు. దీర్ఘం కాదు–అణువుకాదు, మహత్తుకాదు–ఇలా కాదని లేదని చెప్పారే కాని 'నీవు ఇదని, ఇలా ఉంటా'వని చెప్పలేకపోయారు. కనుక అంతకన్న అసమర్థుడను, అజ్ఞానిని నేను ఏమి చెప్పగలను?. కనుక నీకు మొత్తంమీద ఒక నమస్కారము మాత్రమే

చెప్పగలను. అదీ **వాచా** చెప్పగలను. ఎందుకంటె ఆ వాక్కు జ్ఞానగర్భమయి నీనుంచి వచ్చినదిగదా కనుక దానిని నీకు సమర్పించెదను.

**విశేషములు-వివరములు :**

1) సర్వవాక్యప్రసారహేతువయిన జ్ఞానాన్ని దాని అఖండతను ఖండరూపమయిన భిన్నమయిన స్తోత్రవాక్యములతో చెప్పటం అశక్యం. సమానత్వం లేదు. పైగా విరుద్ధలక్షణాలు-అవి ఇవిః-

పరమాత్మయే జ్ఞానం - వాక్కులో జ్ఞానం ఉంది.
సర్వవాక్యహేతువు - జ్ఞానకార్యం వాక్కు.
చైతన్యం అఖండం భేదరహితం - వాక్కులు భిన్నములు. ఖండములు.

2) వేదములు నీ స్వరూపమును, నీ ప్రకారమును, నీ సామ్యమును గాని చెప్పలేక పోయినవి.

3) జ్ఞానగర్భమయిన భారతి కనుక జ్ఞానరూపుడయిన భగవంతుని చేరగలుగుతుందని అందువలన వాక్యంతో నమస్కారం చేస్తున్నాను అనటంలో కావ్యలింగధ్వని.

**శ్లో॥ సర్వాఙ్గీణః సకలవపుషామన్తరే యోఽన్తరాత్మా**
**తిష్ఠన్ కాష్ఠే దహన ఇవ నో దృశ్యసే యుక్తిశూన్యైః।**
**యశ్చ ప్రాణారణిషు నియతైః మధ్యమానాసు సద్భిః**
**దృశ్యం జ్యోతిర్భవసి పరమాదిత్య! తస్మై నమస్తే॥ 14**

**ప్రతిపదార్థము :** పరమాదిత్య!=జ్ఞానసూర్య!, యః=ఏ నీవు, సర్వాంగీణః=సర్వపదార్థముల యొక్క సర్వజీవులయొక్క అంగవ్యాప్తుడవై, సకలవపుషామ్=సర్వశరీరముల యొక్క, అంతరే=ఆత్మలో, కాష్ఠే=కట్టెలో, దహన ఇవ=అగ్నివలె, అంతరాత్మా=అంతర్యామిగా ఆత్మగా, తిష్ఠన్=ఉంటూ గూడా, యుక్తిశూన్యైః=యోగశూన్యులయిన మాచేత, న దృశ్యసే= దర్శింపబడుటలేదో, యశ్చ=ఏ నీవు, నియతైః=యమనియమాలుగల, సద్భిః=సత్పురుషుల చేత, మధ్యమానాసు=చిలుకబడుచున్న, ప్రాణారణిషు=ప్రాణాపానములు అను అరణుల యందు, దృశ్యమ్=దృశ్యమయిన, జ్యోతిః=జ్యోతిగా, భవసి=అగుచున్నావో, తస్మై= అట్టి, తే=నీకు, నమః=నమస్కారము అగుగాక!

**తాత్పర్యము :** హే పరమాదిత్యమూర్తీ! స్థావరములనుండి దేవజాతులదాకా జీవులకు, రుద్రక్షేత్రజ్ఞులకున్ను సకలశరీరాంతర్యామిగా-ఆత్మగా, ఆత్మలలో అంతరాత్మగా నీవు ఉన్నావు. కట్టెలో నిప్పు ఉన్నది. అలా నీవున్నావు. కాని యుక్తి అనగా యోగం తెలియని మాకు నీవు తెలియవు. 'చిలకటం' తెలియనివానికి కట్టెలో ఉన్న నిప్పు తెలియదు. అందువలన యుక్తిగల మహాయోగులు తమ ప్రాణాపానములను పై అరణిగా క్రింది అరణిగా చేసికొని మథించితే నీవు అందులో 'స్వయంజ్యోతిగా, పరంజ్యోతిగా' ఆవిర్భవించుతావు. అట్టి నీకు నమస్కారము.



**4) ఏష హ్యేవైనం సాధు కర్మ కారయతి తం య మన్వాను నేషత్యేష ఏవైనమసాధు కర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్యోనునుత్సత ఏష లోకపాల ఏష లోకాధిపతి రేష సర్వేశ్వరస్సమ ఆత్మా- కౌషీతకం 3.9**

**శ్లో॥ యత్తద్వేద్యం కిమపి పరమం శబ్దతత్త్వం త్వమన్త-**
**స్తత్సద్వ్యక్తిం జిగమిషు శనైర్లాతి మాత్రాకలాః ఖే।**
**అవ్యక్తేన ప్రణవవపుషా బిన్దునాదోదితం స-**
**చ్ఛబ్దబ్రహ్మోచ్చరతి కరణవ్యఞ్జితం వాచకం తే॥ 21**

**ప్రతిపదార్థము :** యత్కిమపి=ఏదో అసాధారణమయిన/అనిర్వచనీయమైనదియు, పరమం= పరమమయినదియు, అంతః=అంతర్గతమయిన, పరిచ్ఛేదములేని స్థానము నందున్నదియు, వేద్యమ్=కాదనరానిదియు అగు, *(చూ. వివరములు-2)* శబ్దతత్త్వమ్ =శబ్దతత్త్వము, త్వమ్=నీవు, తత్=ఆ తత్త్వము, సత్=శక్తిరూపమయిన బ్రహ్మరూపము యొక్క, వ్యక్తిమ్= ప్రకటరూపమును, జిగమిషు=పొందదలచినదై, శనైః=మెల్లగా, ఖే= సుషుమ్నాకాశమునందు, మాత్రాకలాః= అకార ఉకార మకార మొ॥ మాత్రారూపమయిన కలలను/విమర్శశక్తులను, లాతి=స్వీకరించును. అవ్యక్తేన= వ్యక్తముకాని, ప్రణవవపుషా= ఓంకారస్వరూపంతో, బిందునాద=బిందునాదములనుండి, ఉదితమ్=ఉదయించిన (దహరాకాశమునందు), సత్=ఆ 'సత్' అను పదము, తే=నీకు, వాచకమ్=పరామర్శ చేయునదై, కరణ= దివ్యకరణములచే, వ్యంజితమ్=ప్రకటింప బడినదై, శబ్దబ్రహ్మ=ఆ శబ్దబ్రహ్మంగా/నాద బ్రహ్మంగా, ఉచ్చరతి (ఉత్+చరతి)=తనే ఉచ్చరించుచున్నది-అనగా స్వయంగా ప్రవర్తించుచున్నది.

**తాత్పర్యము : "ఓం తత్సత్"** అని బ్రహ్మయొక్క ప్రథమనిర్దేశము. ఇందు "తత్" అనునది పరబ్రహ్మయొక్క ఆత్మశక్తిగల రూపము. అది పరమమయిన శబ్దతత్త్వము. అదే హంసరూపం. శ్వాసరూపం. పరారూపము. అది 'సత్'గా ప్రకటము, గాదలచినదై అకారోకారాది మాత్రలను/ కలలను స్వీకరించును. ఆ సత్తు అవ్యక్తమయిన 'పశ్యంతీ' వాక్కుగా ప్రణవాకారంతో బిందునాదములనుండి (బిందువు పరమాత్మ-జ్ఞానరూపం, నాదం-బిందువునుండి పుట్టిన స్పందము) సుషుమ్నాకాశంలో ఉదయించి దివ్య కరణములచే సూచితమయి నీకు వాచకమై శబ్దబ్రహ్మముగా స్వయంగా ప్రసరిస్తుంది.

**విశేషములు-వివరములు :**

1) శబ్దతత్త్వం అంటే శబ్దమూలమయిన నాదమునకు మూలమయిన ఉచ్ఛ్వాస నిశ్వాసలు వాటికి ప్రతీకగా 'హంస' శబ్దము.

**శాస్త్రం శబ్దాత్మకం సర్వం శబ్దో హంసః ప్రకీర్తితః** -అని స్వచ్ఛందతంత్రంలో చెప్పిన అనాహత భట్టారకుడు, అనగా అనాహతచక్రంలో పుట్టిన స్వయంభువు అయిన 'వాయువు'. అదే 'హంస' అని యోగశాస్త్రము.

శ్లో॥ **స్థూలత్వం తే ప్రకృతిగహనం నైవ లక్ష్యం హ్యనన్తం**
**సూక్ష్మత్వం వా తదపి సదసద్వ్యక్త్యభావాదచిన్త్యమ్।**
**ధ్యాయామీత్థం కథమవిదితం త్వామనాద్యన్తమన్త-**
**స్తస్మాదర్క! ప్రణయిని మయి స్వాత్మనైవ ప్రసీద॥ 20**

**ప్రతిపదార్థము :** ప్రకృతి=స్వభావరీత్యా, గహనమ్=దుర్గమమయినదియు, అనంతమ్=అంతు లేనిదియునగు, తే=నీయొక్క, స్థూలత్వమ్=స్థూలతత్వమయిన ప్రపంచశరీరము, లక్ష్యం నైవ=పూర్తిగా గుర్తింప శక్యమయినది కాదు. తత్=ఆ, సూక్ష్మత్వమపి వా=నీ సూక్ష్మతత్త్వమయిన పరప్రమాతృ స్వరూపమయినను (ప్రత్యగాత్మరూపం), సదసత్=భావాభావములయొక్క, వ్యక్తి=ప్రతీతియొక్క, అభావాత్=లేమివలన, అచింత్యమ్=చింతన శక్యము కాదు. ఇత్థమ్= ఈ విధముగా, అవిదితమ్=పూర్తిగా తెలియని, అనాద్యంతమ్=ఆద్యంతరహితుడవయిన, త్వామ్=నిన్ను, అంతః=మనస్సులో, కథమ్=ఎట్లు, ధ్యాయామి=ధ్యానం చేయగలను?. తస్మాత్=అందువలన, అర్క!=సూర్య!, ప్రణయిని=నీయందు భక్తిరూపప్రేమగల, మయి=నాయందు, స్వాత్మనైవ=స్వయముగా నీ ఆత్మరూపముతోనే, ప్రసీద=అనుగ్రహించుము.

**తాత్పర్యము :** అర్కదేవా! ప్రపంచాంతర్యామి అయిన నీ సూక్ష్మపరమాత్మరూపంగాని ప్రపంచవ్యాప్తమయిన ప్రపంచప్రకాశకమయిన నీ స్థూలశరీరంగాని సహజగహనమయినవి, అనంతములు-అనాదులు. అందులో సూక్ష్మరూపము ఉన్నదో లేదో తెలియజాలని స్థితి. అది శాస్త్రసిద్ధం అయినా అనుభవైకవేద్యం. కనుక దానిని ధ్యానం చేయలేను. ధ్యానం చేయాలంటే మనకు తెలిసి ఉండాలి. లేనిచో ధ్యానం కుదరదు. కనుక ఓ పరమాత్మా! నీయందు-నీవు ఎట్టి తత్త్వమో తెలియకపోయినా-ఇంత ప్రేమగల నన్ను నీవే అనుగ్రహించి నాయందు సర్వాభిమానసంహారపురస్సరంగా స్ఫురింపుము.

**విశేషములు-వివరములు :**

1) అనంతం-దిక్, కాలములవలన పరిమితి లేనివాడు.

2) దేహాది ప్రమాతలకుండే "దేహాభిమానకాలుష్యమును" ప్రశమింపజేయటం ద్వారా ఆత్మరూపంగా స్ఫురించటమే అర్కదేవుని ప్రసాదము.

3) ప్రమాత=జీవుడు. ఈ శరీరాదులు నేను అనుకొనేవాడు.

4) 'స్వాత్మనైవ ప్రసీద'-అనగా నీవే అనుగ్రహించి నన్ను సరయిన దారిన పెట్టమనటం. మనమంచికయినా చెడుకయినా నడిపేది భగవంతుడేనని ప్రసిద్ధమే.

**1) ధియో యో నః ప్రచోదయాత్.**

**2) దదామి బుద్ధి యోగం తం.**

**3) స హోవాచ ప్రతర్దనస్త్వమేవ వృణీష్వ యం త్వం మనుష్యాయ హితతమం మన్యస ఇతి. - కౌషీతకం 3.1**



**విశేషములు-వివరములు :**

1) మితగ్రాహకమయిన 'ప్రమాత' అనబడు 'ఆత్మ'యందు అంతరాత్మగా పరమానంద రూపంగా ఉండేది, అసలు ఆత్మగా ఉండేదీ నీవే కనుకనే
ఆత్మా చైవాంతరాత్మా చ-అని **స్వచ్ఛందతంత్రము** చెప్పినట్లు 'పుర్యష్టక ప్రమాత'గా ఆత్మ-గా ఉన్నాడు.

2) పుర్యష్టకము -

| | | |
|---|---|---|
| 1) జ్ఞానేంద్రియాలు | 5 | |
| 2) కర్మేంద్రియాలు | 5 | |
| 3) అంతకరణం | 4 | |
| 4) ప్రాణాలు | 5 | |
| 5) భూతాలు | 5 | |
| 6) కామము | 1 | |
| 7) కర్మ | 1 | |
| 8) జ్ఞానము | 1 | |
| | | **మొత్తం-8** |

3) మథనం -
**ఊర్ధ్వశక్తినిపాతాచ్చ అధశ్శక్తినికుంచనాత్।**
**రుద్రశక్తిసమావేశం యో జానాతి స పండితః॥** - అని ఆమ్నాయంలో చెప్పబడింది.
ఊర్ధ్వశక్తి-ప్రాణం (పై అరణి)
అధశ్శక్తి-అపానం (క్రింది అరణి)
యోగిప్రయత్నం - మథనం.

జాలంధరబంధముతోను మూలబంధముతోను యోగులు ఈ ప్రాణాపానములను సంఘర్షానికి గురిచేసినపుడు కుంభకస్థితిలో పుట్టే అగ్ని 'స్వయంజ్యోతి' పరమాత్మయే.

4) క్షీరసాగరమథనం ఇటువంటిది.
సహస్రారం-ఊర్ధ్వారణి
మూలాధారం-అధస్థిత-అరణి
కవ్వం - వెన్ను
త్రిప్పటం-పూరకరేచకాదులు
అమృతం-జ్ఞానాగ్ని - ఇలా ఆలోచించాలి.

5) **నో దృశ్యసే యుక్తిశూన్యైః**- అనగా పరమాత్మ యోగశూన్యులకు అందదు. అంటే ఆయన యథార్థతత్త్వం అర్థంకాదు. ఒక శైవగురువు అదే అన్నాడు-

**మాణిక్యప్రవేక ఇవ నిచోలితో నిజమయూఖలేఖయా**
**ప్రతిభాతి లౌకికానామత్యంతస్ఫుటోప్యస్ఫుట ఆత్మా॥**

సూర్యునితత్త్వం తెలిసికొనటానికి ఆయన కిరణాలు అడ్డుపడినట్లు

భగవత్తత్త్వం కనుగొనటానికి ఆయన ప్రకాశమే అద్దం. **మనది గుడ్లగూబస్థితి.** అందువలననే ఆ ప్రకాశతత్త్వాన్ని మనం మన ఇష్టరీతిన చిత్రించాము. అదే అంటారు–

**శివస్థానం శైవాః పరమపురుషం వైష్ణవగణాః**
**లపంతీతి ప్రాయో హరిహరపదం కేచిదపరే।**
**పదం దేవ్యాః దేవీచరణయుగలాంభోజరసికాః**
**మునీంద్రా అప్యన్యే ప్రకృతి పురుషస్థానమమలమ్॥** – శ్రీతత్త్వచింతామణి.

**శ్లో॥ స్తోతా స్తుత్యః స్తుతిరితి భవాన్ కర్తృకర్మక్రియాత్మా**
**క్రీడత్యేకస్తవ నుతివిధావస్వతంత్రస్తతోఽహమ్।**
**యద్వా వచ్మి ప్రణయసుభగం గోపతే। తచ్చ తథ్యం**
**త్వత్తో హ్యన్యత్కిమివ జగతాం విద్యతే తన్మృషా స్యాత్॥ 15**

**ప్రతిపదార్థము :** స్తోతా=స్తోత్రము చేయుజీవుడు, స్తుత్యః=స్తుతింపదగిన నీవు, స్తుతిః =స్తుతించుట, ఇతి=అను '3'గా, భవాన్=నీవు, కర్తృకర్మక్రియాత్మా=కర్తగా, కర్మగా, క్రియగా, ఏకః=నీవొక్కడవే, క్రీడతి=క్రీడించుచున్నావు. తతః=అందువలన, అహం=నేను, తవ= నీయొక్క, నుతివిధౌ=స్తోత్రవిధిలో, అస్వతంత్రః=పరతంత్రుడను/ నీ అధీనుడను. గోపతే=ఓ మరీచి చక్రేశ్వరా/ చిచ్చక్రేశ్వరా!, ప్రణయ=ప్రార్థనతో/ప్రేమతో, సుభగమ్=సుందరమయిన మాటను, యద్వా=ఏదయితే, వచ్మి=పలుకుచున్నానో, తచ్చ=అది, తథ్యమ్=పరమార్థమే, జగతామ్=ప్రపంచములో, త్వత్తః=నీకన్న, అన్యత్=వేరయినది, కిమివ=ఏదయినా, విద్యతే=ఉంటే, తత్=అది, మృషా=అసత్యము, స్యాత్–హి=అగును కదా!

**తాత్పర్యము :** భగవంతుడు జ్ఞానచక్రేశ్వరుడు. దానినుండి సృష్టిలోకి అవతరించినది మరీచి చక్రము, అనగా కిరణచక్రము. ఇది సృష్టికారణమయిన కిరణసముదాయము. లేదా ప్రతిచక్రమునకు అంగముగా ఉండు యోగశాస్త్రప్రసిద్ధమయిన రశ్మిచక్రము. రశ్ములు 360. వీటి అధిపతి కనుక పరమాత్మ 'గోపతి'. అట్టి పరమాత్మయొక్క సృష్టిరూపం 'ఆత్మ' అనగా ప్రమాత అనగా జీవుడు. అతనే కర్మ. ఎటూ స్తోత్రానికి భగవంతుడే కర్మ. స్తుతించటం అనే 'వాక్కు' ఎక్కడయినా నాదరూపం. నాదం భగవంతుని శక్తిస్పందమే. అనగా 'సర్వంఖల్విదం బ్రహ్మ' అని అంతా జ్ఞానరూపమే. పదము, పదార్థము, పరమార్థము–అంతా బ్రహ్మమే. బ్రహ్మమే మాయాశక్తి సంకుచితమయి జీవుడయింది. కనుక ఆ మొత్తం క్రియలు, తత్త్వాలు అంతా నీవే. **"యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో! తవారాధనమ్"** అని శంకరులు చెప్పినదదే. **"స్తోత్రాణి సర్వాగిరః"** అయిందందుకే. **సంచారః పదయోః ప్రదక్షిణవిధిః** అయింది గూడా. సర్వం బ్రహ్మస్వరూపజగత్తు చుట్టూ జరిగే పాదన్యాసం కనుక మన సంచారం అంతా భగవంతుని ప్రదక్షణమే. అయితే అలాంటి భావనతో చేస్తేనే అలా అవుతుంది. కనుక పరమేశ్వరలీలలో భాగమయిన యీ స్థితిలో మన స్వతంత్రత ఏమి ఉంటుంది.



1) నలుపు, సుఖము మొదలగునవి అన్ని గ్రాహ్యప్రపంచము. లోపలి అంతఃకరణం మొదలగునవి 'గ్రాహక ప్రపంచము'. ఈ గ్రాహ్య గ్రాహక' ప్రపంచమునకు కారణము అగ్నీషోములు. అనగా శరీరంలో ఇడా పింగళానాడులు. వాయువులలో ప్రాణాపానములు బాహ్యప్రపంచములో సూర్యచంద్రులు. ఒకరు ప్రకాశనం చేస్తే మఱొకరు జగత్తుకు అవస్థానం అనగా స్థితికి కారణం అవుతారు. ఒకరు పుట్టటానికి బ్రతకటానికి కారణం. మఱొకరు స్థితికి పోషణకు కారణం. సృష్టిస్వీకార సమయం అంటే సృష్టి కామసమయం, తరువాత సృష్టిలో తాను అంతర్యామిగా ప్రవేశించే సమయం **"తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్"** అన్నట్లు. ఇదే వస్తువును అభాసింపజేయటం అని తర్వాత దాన్ని విమర్శించటం అని అంటారు. సూర్యచంద్రులలో సూర్యునివి 12 కళలు. చంద్రునివి 16 కళలు. వీటనన్నింటిని తన మరీచి చక్రంతో సృష్టిస్తాడు చిద్భానుడు. వీటిద్వారా సృష్టిస్థితులు జరుగుతాయి. ఇవి సంసారకారణం అని అర్థం.

అయితే సంసారమునుంచి మోక్షం పొందదలచిన భక్తయోగులు సంసార కారణమయిన ఈ అగ్నీషోములను ఇడాపింగళలద్వారా కుంభకంచేసి సుషుమ్నలో 'సమం' చేస్తారు. పగలు రాత్రులు సమంగా ఉండే రోజును **'విషువం'** అంటారు. అలానే ప్రాణాపానములు, సమంగా ఉండే కుంభక స్థితిని **'విషువం'** అంటారు. అదే సుషుమ్నలో గాలిప్రవహించే స్థితి ఇడాపింగళాసామ్యం. దానివలన శరీరంలో 'ఉదానవహ్ని' పుట్టుంది. దానియందు ఈ అగ్నీషోములను హోమం చేస్తారు. అనగా లయం చేస్తారు. అట్టివారికి మోక్షప్రాప్తిని అనుగ్రహించటానికి భగవంతుడే తన మయూఖములతో /జ్ఞానకిరణములతో వారిని లయం చేస్తాడు. అనగా సంసార నివృత్తి అవుతుంది.

**విశేషములు–వివరములు :**

1) కుంభకంలో సోమసూర్యకలలు కలసి అన్యోన్యం సంఘర్షణ పడతాయి. అలా అవి కలసిపోతాయి–అమావాస్యలో లాగా. యోగశాస్త్రంలో 'నిత్యలు' అని తిథులున్నాయి. వాటిలో ఈ ఇడాపింగళ అనే సూర్యచంద్రులను బట్టి పూర్ణిమలు– అమావాస్యలు, పగళ్లు–రాత్రులు, విషువత్తులు ఉన్నాయి.

2) విషువత్–అనగా హృదయాకాశంలోనుండి ప్రాణవృత్తి నిర్గమిస్తుంది. ఇలా ఎచ్చటనుండి శ్వాస బయటకు బయలుదేరిందో ఆ 'బిందువు'ను **'అంతస్తుటి'** అంటారు. బయటనుంచి శ్వాస ఏ ప్రాంతం నుంచి లోపలికి వెళ్లటానికి బయలుదేరిందో దానిని **'బాహ్యతుటి'** అంటారు. వీటి '2'మధ్య సమాన కాలస్థితిని 'విషువత్' అంటారు.

3) మోక్షం–అంటే శివునకు తనకు భేదం ఉన్నట్లు చూపే ఆణవం మొ॥ 3 మలములను నశింపజేసి శివాద్వైతమును పొందటం.

4) విశ్వం అంతా **'వ్యానము'.** 'వ్యాన స్సర్వశరీరగః' కదా! దీనియందు వ్యాపించి, అగ్నీషోమరూపాత్మను జ్ఞానక్రియాత్మ రూపంగా చేస్తాడు.

**ప్రతిపదార్థము :** గృహే=శూన్యగృహమున, శ్రియమివ=లక్ష్మినివలె, ప్రవాసే=ప్రయాణము నందు (బంధురహితస్థలంలో), కామధేనుం ఇవ=కామధేనువును వలె, ధ్వాంతే= చీకటియందు, భాతిమివ=వెలుగునువలె, వనే=అడవియందు, ధృతిమివ=ధైర్యమును వలె, యోజనే=యోగమునందు, బ్రహ్మనాడిమివ=సుషుమ్నునువలె, తామ్=ఆ భక్తిని, అస్మిన్=ఈ, విషమ=రకరకాల భయంకరమయిన, విషయ=విషయములనే, గ్రాహ=మొసళ్లకు సంబంధించిన, సంసారసింధౌ=సంసారసముద్రమునందు, నావం చ=పడవను వలె, ఆసాద్య=పొంది, యత్=ఏది, శీతం న=శీతము కానిదో, ఉష్ణం చ న=వేడిది కానిదో, తే=నీయొక్క, పరమమ్=శ్రేష్ఠమయిన, అమృతమ్=ఆ శాక్తధామమును, గచ్ఛేయమ్= పొందెదను.

**తాత్పర్యము :** దేవా! బాహ్యసూర్యుని ధామం శీతమో ఉష్ణమో అయి ఉంటుంది. కాని జ్ఞానసూర్యుడవయిన నీ తేజము, మా మోహాన్ని దహిస్తుంది కనుక ఉష్ణమనరాదు. కాని ప్రకాశమును, ఆహ్లాదమును కలిగిస్తుంది. కాని చల్లన అనటానికి లేదు. కనుక శీతోష్ణాది గుణద్వంద్వరహితమయినది నీ తేజము. అది అమృతస్వరూపం. దానిని పొందటానికి ఈ సంసారసముద్రమును దాటాలి. భయంకర విషయ మకరాలను అధిగమించాలి. దీనికి నీపైన భక్తి చక్కని 'ఓడ' వంటిది. శూన్యగృహమునకు సంపద చేరినట్లు ప్రవాసములో కామధేనువు లభించినట్లు, చీకటిలో వెలుగు వచ్చినట్లు, అడవిలో ధైర్యసంపద వచ్చినట్లు, యోగంలో బ్రహ్మనాడి లభించినట్లు, సంసారంలో నీ భక్తి లభిస్తే తప్పక నీ పరమామృత స్థితిని పొందగలను.

**శ్లో॥ అగ్నీషోమావఖిలజగతః కారణం తౌ మయూఖైః**
**సర్గాదానే సృజసి భగవన్! హ్రాసవృద్ధిక్రమేణ।**
**తావేవాన్తర్విషువతి సమౌ జుహ్వతామాత్మవహ్నౌ**
**ద్వావప్యస్తం నయసి యుగపన్ముక్తయే భక్తిభాజామ్॥ 19**

**ప్రతిపదార్థము :** అఖిలజగతః=సమస్తప్రపంచానికి, అగ్నీషోమౌ=సూర్యచంద్రులు, ఇడా, పింగళనాడులు, ప్రాణాపానములు, కారణమ్=కారణము, భగవన్=ప్రభూ! సర్గాదానే=సృష్టి స్వీకారసమయంలో, తౌ=ఆ సూర్యచంద్రులను, ఇడాపింగళానాడులను, ప్రాణాపానము లను, హ్రాసవృద్ధి=క్షయవృద్ధులయొక్క క్రమేణ=క్రమముతో, మయూఖైః =12,16 కళలతో, సృజసి=సృష్టి చేయుచున్నావు. అంతః=లోపల, విషువతి=సమానస్థితి గల కుంభకము నందు, సమౌ=అన్యోన్యసంఘర్షణతో కలసిపోయిన, తావేవ=వారినే, ఆత్మ వహ్నౌ=ఉదానాగ్నియందు, జుహ్వతామ్=హోమం చేయుచున్న, భక్తిభాజామ్= భక్తులయిన యోగ తాంత్రికులయొక్క ముక్తయే=మోక్షంకొఱకు, ద్వావపి=వారిద్దరిని, యుగపత్= ఒక్కసారిగా, అస్తమ్=లయమును, నయసి=పొందించెదవు.

**తాత్పర్యము :**

**విశేషములు-వివరములు :**



**వాలువేగంతో పోయే పడవ గమనం నదీ గమనమే గాని 'పడవగమనం' అంటూ వాస్తవంగా ఏమీ లేదు.** కనుక నేను ఏమి స్తుతించినా పరమాత్మా అది నీదే గనుక నీవిచ్చిన వాక్కు గనుక అంతా సత్యమే. ఒకవేళ నేను ఏదయినా నీకన్న భిన్నంగా-నవీనతకోసం చెప్పినా అది అబద్ధమే అవుతుంది తప్ప నిజం కాదు. ఎందుకంటే ప్రపంచంలో సత్యం నీవు తప్ప మరేదీ కాదు కనుక. కనుక నేను అస్వతంత్రుడను. *(సహజంగా లోకవ్యవహారంలోనయినా ఒక మహాకవికి తాను మొదలు పెట్టిన శ్లోకం ఏ అక్షరంతో ముగుస్తుందో ఏ పదంతో ముగుస్తుందో భావంలో ఏ మార్పువస్తుందో ఎల్లవేళలా తెలియదు. అనుకొనకుండా మధ్యలో పదాంతర వాక్యాంతర భావాంతరాలు స్ఫురించవచ్చు. ఎత్తుగడలో ఉన్నది దింపుగడలో ఉండాలన్న నియమం లేదు. అసలు మన మామూలు మాటలలోను మనం అనుకోని భావాలు వ్యంగ్యంగా రావచ్చును. మనం ఎదుటి వారికి 'క్షమాపణ' చెప్పవలసిరావచ్చును. తన తపోవాంఛకు విరుద్ధంగా వరం అడిగిన "కుంభకర్ణుడు" ఇందుకు ఉదాహరణ. ఎత్తుగడలో తనతండ్రి తొడ ఎక్కాలని తపస్సు మొదలుపెట్టిన ధ్రువునికి దింపుగడలో* ***అందరితండ్రి*** *ఒడి ఎక్కాలన్న వాంఛతో తపస్సు అసంతృప్తితో ముగిసింది. తొలి కోరిక మలికోరికకు విరుద్ధంగా (ధ్రువుని కంఠం పట్టికొన్నది.)* కనుక దేవా!, నేను అస్వతంత్రుడను. ఈ ప్రార్థన నీదే, సత్యమే. అసత్యం ఉండదు.

**విశేషములు-వివరములు :**

1) ఈ వ్యాఖ్యాత క్షేమరాజు వ్రాసిన **భైరవానుకరణస్తోత్రం**లోనూ ఇదే భావం ఉన్నది.

**శ్లో॥ స్తోతా స్తుత్యః స్తుతిరితి యదపి విభిన్నం న కించిదస్తీహ।**
**మృశసి యథా యద్రూపం చిద్రూపతయా భవస్యేతత్॥** (క్షేమరాజు వివృతి)

2) 'అహం' అనేది సంకుచితమయిన మాయావశుడయిన "ప్రమాత"ను అనగా మనవంటి దేహాభిమాని అయిన అజ్ఞాన జీవుని చెబుతుంది.

3) చిదాత్మ తప్ప ఎవ్వనికి సొంత వేదన, సొంత సంకల్పాలు, అలానే ఈ సంకల్పాలకు విషయపదార్థములుగాని లేవు. అవన్నీ "గగనకుసుమాల" వంటివి. **కనుక స్తోత్రం అంటే మన అభేదాన్ని భావనచేయటమే తప్ప, భేదాన్ని చిలవలు పలవలుగా వర్ణించడం కాదు.** భేదాన్ని చెప్పటానికి వేదాంతాలు, మతాలు, తంత్రాలు అవసరం లేదు. అది సహజవ్యవహారసిద్ధం. తత్త్వాన్ని అభేదాన్ని చెప్పటానికే తత్త్వగ్రంథాలు అవసరం.

**శ్లో॥ జ్ఞానం నాన్తఃకరణరహితం విద్యతేఽస్మద్విధానాం**
**త్వం చాత్యస్తం సకలకరణాగోచరత్వాదచిన్త్యః।**
**ధ్యానాతీతస్త్వమితి న వినా భక్తియోగేన లభ్యః**
**తస్మాద్భక్తిం శరణమమృతప్రాప్తయేఽహం ప్రపన్నః॥ 16**

**ప్రతిపదార్థము :** అస్మద్విధానామ్=మావంటి ఖండజీవులకు, జ్ఞానమ్=జ్ఞానము, అంతః కరణ=అంతఃకరణముతో/జ్ఞానేంద్రియములతో, రహితమ్=శూన్యముగా, న విద్యతే=

ఉండదు. అత్యంతమ్=పూర్తిగా, సకల=సమస్తమయిన, కరణ=మనస్సునకు ఇంద్రియాదులకు, అగోచరత్వాత్=గోచరించనివాడవగుటవలన, అచింత్యః=చింతనకు శక్యమయినవాడవు కావు. త్వమ్=నీవు, ధ్యాన=ధ్యానమునకు, అతీతః=మించినవాడవు. ఇతి=కనుక, భక్తియోగేన వినా=భక్తియోగంచేత మినహా, న లభ్యః=పొందరానివాడవు. తస్మాత్=అందువలన, అహమ్=నేను, అమృత=అమృతవస్తువయిన జ్ఞానాదిత్యమూర్తి యొక్క, ప్రాప్తయే=పొందికకొఱకు, భక్తిమ్=భక్తిని, శరణమ్=శరణుగా, ప్రపన్నః =పొందితిని.

**తాత్పర్యము :** ఇంద్రియజ్ఞానంగల మాయాసహితులయిన 'ప్రమాత'లము మేము. మాకు ఇంద్రియవృత్తులు, అంతఃకరణము ప్రమాణము. నీవు ఇటువంటి ఇంద్రియాది వృత్తులకు అందని జ్ఞానదీపానివి. మాకు ఇంద్రియాది వృత్తులు అంతఃకరణంవలన వచ్చే జ్ఞానం తప్ప మఱో మార్గం లేదు. (అంటే మిణుగురుపురుగులవలె అల్పమయిన జ్ఞానంగలవారం. దానికి కారణం పగలు పీల్చుకున్న నీ వెలుగే. మిణుగురుపురుగులకు ముడ్డిపై వెలుగు అదే. మా బుద్ధులన్నీ నీ బాహ్యరూపం అయిన ఆదిత్యుని వలన వచ్చినవే. కనుక ఈ బ్యాటరీలైటు వంటి ఈ తెలివితేటలతో ఖగోళనక్షత్రం వంటి నిన్ను కనుగొనలేము.) కనుక ధ్యానానికి గూడా అందవు. మనస్సుకు అందే వాటిని మనస్సు ధ్యానింపగలదు. అందనివాటిని మనస్సు ఎలా ధ్యానింపగలదు. కనుక భక్తి ఒక్కటే నిన్ను మాకు అందించగల యోగమార్గం. అందుచే ఆ భక్తిని మాత్రమే అమృతప్రాప్తికై శరణు వేడుచున్నాను. అందుకే యీ స్తోత్రం.

**విశేషములు-వివరములు :**

1) భక్తి అనగా దేహంలోని ప్రమాత అయిన పరిమిత-ఆత్మను అఖండ జ్ఞానసూర్యునిలో భేదాభేదమును అదే నిమజ్జన-ఉన్మజ్జనలను చేసినట్లు భావించటం భక్తి. ఇందులో అభేదభావన వస్తుంటుంది. అది మరల మనస్సుయొక్క చాంచల్యం వలన పోతుంటుంది. మఱల మనసంకల్పంవలన దానిని అభేదభావనలోనికి తెస్తాం- ఇది ఇచ్చట భక్తి.

2) భక్త్యుద్రేకాద్విరక్తస్య యాదృశీ జాయతే దశా।
సా శక్తిః శాంకరీ నిత్యం భావయేత్ తాం తతశ్శివః॥ - విజ్ఞానభైరవం. ధారణా-95 (118)
భక్తి ఉద్రేకించటం వలన సంసారవిరక్తి మోక్షసంకల్పం వస్తాయి. ఆ దశకు "శాంకరీ" దశ అని పేరు. అది భావనలో స్థిరం అయితే సాధకుడు 'శివుడు' అవుతాడు. ఈ భక్తివలన శాక్తస్ఫారావేశం వస్తుంది.

3) రమణమహర్షి వృత్తాంతంలో; గూట్లోనించి క్రిందకు పడుతున్న ఉడుతపిల్లను, పడిన ప్రతిసారీ రమణమహర్షి విసుగుపడకుండా మఱల గూట్లోకి వేస్తున్నాడు. అది భక్తులకు ఒక సూచనగా ఆయనే చెప్పారు. మనస్సు ఆ ఉడుతపిల్ల వంటిది. అది తనకు మూలమయిన ఆత్మనుంచి అలా వేరుపడుతుంటుంది. వేరువడినపుడల్లా దాన్ని మళ్లీ మూలంలో పడవేస్తుంటే ఆ ఉడుతపిల్లలాగా అక్కడే నిలవటం అలవాటు చేసుకొంటుంది. అదే భక్తి.



**అభ్యాసేన చ కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే॥** అన్నది గీత. ఈ ప్రక్రియనే వ్యాఖ్యానంలో క్షేమరాజు "నిమజ్జన-ఉన్మజ్జన రూపభక్తి" అన్నారు. అసలు "భజ" ధాతువున అర్థం సేవ, పొందిక. సగుణానికి సేవ, పొందిక '2' చేయవచ్చును. నిర్గుణానికి పొందిక మాత్రమే. అదే సేవ. అదే శ్రవణమననినిదిధ్యాసలు.

**శ్లో॥ హార్దం హన్తి ప్రథమముదితా యా తమస్సంశ్రితానాం**
**సత్త్వోద్రేకాత్తదను చ రజః కర్మయోగక్రమేణ।**
**స్వభ్యస్తా చ ప్రథయతితరాం సత్త్వమేవ ప్రపన్నా**
**నిర్వాణాయ వ్రజతి శమినాం తేஉర్క! భక్తిః త్రయీవ॥ 17**

**ప్రతిపదార్థము :** అర్క=ఓ సూర్యుడా!, తే=నీయొక్క (నీయందలి), భక్తిః=భక్తి, త్రయీవ=వేద త్రయివలె, ప్రథమమ్=ముందుగా, ఉదితా=ఉదయించినదై, సంశ్రితానామ్=ఆశ్రితుల యొక్క (భక్తులయొక్క), హార్దమ్=హృదయసంబంధమయిన, తమః=అజ్ఞానమును/చీకటిని, హంతి= నివారించును. తదను=తర్వాత, సత్త్వోద్రేకాత్=సత్త్వగుణోద్రేకమువలన (ప్రకాశోద్రేకం వలన), కర్మయోగ=ఆత్మపరమాత్మసంయోగానికి పనికివచ్చు కర్మానుష్ఠానం యొక్క క్రమేణ=వరసతో, రజశ్చ=రజోగుణమునున్ను, హంతి=నివారించును. సు=బాగా, అభ్యస్తా చ=అభ్యసింపబడినదై, ప్రపన్నా=పొందబడినదై, సత్త్వమేవ=ప్రకాశరూపమునే, ప్రథయతితరామ్=విస్తరింపజేయును. ఈ విధముగా నీ భక్తి, శమినామ్= శాంతచిత్తు లయిన యోగులయొక్క, నిర్వాణాయ=మోక్షం కొఱకు, వ్రజతి=నడచుచున్నది.

**తాత్పర్యము :** చిదాదిత్యా!, నీ భక్తి వేదత్రయి వలె కామక్రోధాదులు తగ్గి శాంతచిత్తులయిన వారికి మోక్షమును అనగా జీవచ్ఛివత్వమును కలిగించును. వేదత్రయి కామ్యకర్మలు మాని ఆచరింపబడినచో వారికి అపవర్గమును ఇచ్చును. అది ప్రథమంగా మొలకెత్తిన వెంటనే ఆనందస్వరూపమయి హృదయప్రకాశమును కలిగించి అభేదఖ్యాతిరూపమయిన 'ఆణవ' మలమును (మానసిక) పోగొట్టును. ప్రకాశరూపమయిన సత్త్వమును ఉద్రేకపఱచి, ఆత్మ-పరమాత్మ విశ్రాంతిని ఫలముగా ఇచ్చు ఫలసంగరహితమయిన కర్మానుష్ఠానముతో కర్మమలరూపమయిన రజోగుణమును పోగొట్టును. అలాగే బాగా అభ్యాసం చేయబడినచో ఆ భక్తి సర్వత్ర నీ ప్రకాశరూపమయిన 'సత్త'ను విస్తరించి చూపును. 'వేదత్రయి' గూడా ఇలానే సర్వబ్రహ్మమయత్వాన్ని చెపుతుంది. అంతేతప్ప మాయాసంబంధమయిన మలభరితమయిన 'ఆత్మ-భిన్నప్రపంచము' అను జ్ఞానాన్ని అనగా భేదజ్ఞానాన్ని కలిగించదు. ఈ భేదజ్ఞానము పశుత్వం. దానిని పోగొట్టునది నీయందలి భక్తి. కనుక ఆ భక్తినే శరణువేడెదనని పై శ్లోకములోనికి అన్వయము.

**శ్లో॥ త్వామాసాద్య శ్రియమివ గృహే కామధేనుం ప్రవాసే**
**ధ్వాన్తే భాతిం ధృతిమివ వనే యోజనే బ్రహ్మనాడిమ్।**
**నావం చాస్మిన్ విషమవిషయగ్రాహసంసారసిన్ధౌ**
**గచ్ఛేయం తే పరమమమృతం యన్న శీతం న చోష్ణమ్॥ 18**